# కథలవరస

# కథామాలతి 5వ సంకలనానికి ముందుమాట

ఈ సంకలనంతో నాదగ్గర ఇంతరవకూ ఉన్న, నేను రాసిన కథలసంకలనాలు పూర్తి అవుతాయి. ఈ సంకలనంలో కథలగురించి రెండు మాటలు. దాదాపు 60 ఏళ్ళక్రితం తెలుగు స్వతంత్రలో వచ్చిన ఓ చిన్న స్కెచ్‌ని మాగంటి వంశీమోహన్ గారు తవ్వి తీసి ఆదరభావంతో తమ బ్లాగులో ప్రచురించడం నాకెంతో ఆనందాన్నిచ్చింది. వారి కృషిని అభినందిస్తూ, అదే ప్రతిని ఇక్కడ నా సంకలనంలో పెట్టేను.

శివుడాజ్ఞ కథలు – ఒక స్నేహితురాలు నాతో యాదాలాపంగానే కావచ్చు అన్న ఒక వాక్యం తీసుకుని కథ రాయడం మొదలు పెట్టేను. ముగింపు ఎలా చెయ్యాలో తెలీలేదు. పాఠకుల అభిప్రాయం కోరేను. వారు రెండు, మూడు ముగింపులు సూచించేరు. ఆ సూచనలు ఆధారంగా, మళ్లీ రెండో కథ రాసేను.

ఈ రెండు కథలూ పక్కన పక్కన పెట్టి చదివినప్పుడు, వర్ధమాన రచయితలకీ, బహుశా పాఠకులకీ కూడా, అర్థమయే విషయం - కథ నడపడం ఒక్క కథాంశంమీదే కాక ముగింపుమీద కూడా ఆధారపడి ఉంటుందని. కథలో సందేశం (అదే ముగింపు) కూడా కథ నడకని నిర్దేశిస్తుంది అని.

చివరిమాటగా. **సాహిత్య మాటలాడుకొనుట** పేరుతో ఊసుపోకకి రాసిన హాస్యరచన ఆలోచించినకొద్దీ ఆ అంశాన్ని కథగా మలచవలసిన అవుసరమే ఎక్కువ అనిపించింది. ఈమధ్య కొంతకాలంగా మనవాళ్ళు ఈరోజుల్లో చేస్తున్న సాహిత్యసేవతీరుని గురించి బాధ వెలిబుచ్చడం చూస్తున్నాను. అంచేత ఈ అంశాన్నే మళ్లీ తీసుకుని పొడిగించి కథగా మలిచేను. ఈకథలో నేను ప్రధానంగా చెప్పదలుచుకున్నవి రెండు విషయాలున్నాయి. మొదటిది – ఇద్దరు సాహిత్యాభిమానులు ఎదురైతే సాహిత్యంగురించే మాటాడతారని ఆశిస్తాను నేను. అలా కాక, వ్యక్తిగతవిషయాలు అదే పనిగా ప్రస్తావించడం నాకు చిరాకు కలిగిస్తుంది అది నావిషయం కానప్పుడు కూడా. రెండోది, అసలు ఈనాటి సాహిత్యచర్చలు ఎలా సాగుతున్నాయి. అలా సాగడానికి కారణం ఏమిటి అని. ఈకథలో బహుశా నేను అనుకున్నంత స్పష్టంగా చెప్పలేదేమో అని కూడా అనిపిస్తోంది. పైపైపొరల్లోనే తప్ప, నిజమైన మార్పు, ఆదరణీయమైన మార్పు రావడానికి ఇంకా చాలాకాలం పడుతుందేమో. ప్రస్తుతం మానవీయవిలువలంటే విలువ లేకుండా పోయింది. అదే సాహిత్యానికీ వ్యాపించింది. అంచేతే సాహిత్యం కూడా వ్యాపారంగా సాగుతోంది. ఇది నాగరికత అని నాకు అనిపించడంలేదు. మరోకోణం దేశకాలపరిస్థితులు సంస్కృతి రూపురేఖలకి ఆధారం. మరొకజాతి విలువలన్నీమనకి నప్పవు. ఏవి పనికొస్తాయి, ఏవి మనకి అనుగుణంగా మార్చుకోవాలి అన్నది మనచేతుల్లో ఉంది.

నాకథలను ఆదరిస్తున్న పాఠకులకి ధన్యవాదాలు.

నిడదవోలు మాలతి

మే 26, 2013

# 1. ఆవారా బుష్ కోటు

గల్పిక

## "ఆవారా" బుష్ కోటు

నిడదవోలు మాలతి

"ఏం కావాలమ్మా!" అన్నాడు గుమాస్తా సన్నటి పొడుగావిడ లోపలికి రాగానే. ఆవిడ వెనకే ఆవారా బుష్‌కోటు వేసుకున్న పధ్నాలగేళ్ళ అబ్బాయి లోపలికొచ్చాడు.

"మైసూరు సిల్క్ సారీస్ ఉన్నాయా?"

"ఉన్నాయండీ"

"ప్స్. కలర్సేం బాగులేవు. లైట్ గ్రీన్ కలర్ లేదూ?"

"లేదండీ. బెంగుళూరు సిల్క్ అయితే ఉందండీ."

"వద్దులే. ఆ బ్లూ సారీ తియ్యి చూద్దాం."

"మిల్లు చీరండీ. ఇరవై ఎనిమిది రూపాయలు."

"సెవన్ యార్డ్సేనా?"

"టూ కాట్స్" అన్నాడు ఆవారా బుష్‌కోటు మధ్యలో కలుగజేసుకుని. ఆవిడ అతనివేపు ఆదోలా చూసి, గుమాస్తాతో జాకెట్ పీసెస్ తియ్యమంది. ఓ పదిరకాలు తీసి పైన పడేశాడు గుమాస్తా. అది కాదని ఇది, ఇది కాదని అది అన్నీ లాగిస్తూంటే గుమాస్తాకి లేని తలనొప్పి పుట్టుకొస్తోంది. మధ్యమధ్యలో ఆవారా బుష్‌కోటు కలుగజేసుకుంటూనే ఉన్నాడు. ఆవిడ అతనివేపు ఆదోలా చూస్తూనే ఉంది. ఇదిమాత్రం గుమాస్తా గమనించనేలేదు. షాపంతా మూడుమాట్లు తిరగేయించి 34-14-0 బిల్లు చేసింది. గుమాస్తా "అమ్మయ్య" అనుకున్నాడు.

"హండ్రెడ్ రూపీస్ ఛేంజి ఉందా?" అంది పర్సు చూస్తూ. లేదన్నాడు మేనేజరు.

"అయితే విడిగా 20-0-0 ఉన్నాయి ఇవి తీసుకోండి. అటు వెళ్ళి మళ్ళీవచ్చేటప్పుడు మిగిలింది యిచ్చేస్తాను. ఈ పేకెట్ కూడా ఇక్కడే ఉంచండి" అందావిడ. వెనకే "ఆవారాహూఁ" అని పాడుతూ ఆ అబ్బాయి కూడా వెళ్ళిపోయాడు.

మరో రెండునిముషాలు అయినా అవకముందే ఆవారా బుష్‌కోటు వచ్చి అయిదురూపాయలిచ్చి పార్సెలూ, బేడా తీసుకెళ్ళిపోయాడు.

మరో రెండునిముషాలు అయినా అవకముందే సన్నటి పొడుగావిడవచ్చి పార్సెలడిగేసరికి షాపు కీపర్ తెల్లబోతూ, "ఇప్పుడే మీ అబ్బాయి పట్టుకెళ్ళాడు కదండీ?" అన్నాడు.

"మా అబ్బాయెవరూ?" అందావిడ అంతకన్న వింతగా.

**(తెలుగు స్వతంత్ర పత్రికలు తిరగేస్తుంటే మన తెలుగు బ్లాగరైన** (నేననుకుంటున్న!) నిడదవోలు మాలతి గారు రాసిన "బుష్ కోటు" గల్పిక కనపడింది....ఇక్కడ చూడొచ్చు అంటూ వంశీమోహన్ గారు తమ పత్రిక, **maganti.org. http://janatenugu.blogspot.com/2011/12/1954.html లో ప్రచురించేరు. తొలిసారిగా** 1954, జూన్ 18 న తెలుగుస్వతంత్రలో ప్రచురితం.... దాన్ని తవ్వి తీసిన వంశీమోహన్ గారికి ధన్యవాదాలు.)

# 2. జ్ఞాపక చిహ్నం

"కెమెరా తెచ్చేను సార్," అంటూ ఆఘమేఘాలమీద వచ్చి వాలేడు మురళి గదిలోకి. మురళి ఎప్పుడూ ఇంతే. ఆర్భాటంగా తప్ప ప్రవేశించడు. మొదట అసలు సెట్టింగు చెప్తాను.

అది జనవరి నెల. అదొక పర్ణశాల. అసలు ఇంటివారు మేడ వేసే ఉద్దేశంతో డాబామీద గోడలు లేపి, ఆపైన పెంకులేద్దామా, రేకులేద్దామా అని ఆలోచిస్తుంటే, నేనూ, నాలాటి మరో ఇద్దరూ కలిసి, "గది కావాలండీ," అని అడిగేం. మేం అడిగిన అలుసు చూసుకునో, నిజంగా డబ్బు లేదో, వచ్చినంతమటుకు రాబడదామనో, "ముగ్గురూ మూడు నెలల అద్దె ముందుగానే ఇస్తే, ఆపైన తాటాకులేయించి ఇస్తాను," అన్నాడు ఇంటాయన, అది కూడా చాలా ఇన్ఫ్లుయన్సు ఉపయోగించిన తరవాత. మేం ఒప్పుకున్నాం.

మాలో స్వామి పాలిటెక్నిక్ కాలేజీలో చదువుతూ, వాళ్ళ హాస్టల్లో ఉంటూ వార్డెన్‌తో తగువేసుకు బయటికి వచ్చేసినవాడు. తన పుస్తకాలూ, చదువూ తప్ప మరో ధ్యాస ఉన్నట్టు కనిపించని ఆ కుర్రాడికి వార్డెన్‌తో ఎలాటి తగువొచ్చి ఉంటుందో ఊహించడం కష్టం. చలం వెటరినరీ విద్యార్థి. అప్పుడే చేరేడు. అతడికి బెరుకు. ఇంక నేను మొదటి రెండు టెర్ములూ స్ట్రైకులూ, శలవులూ పోగా పెరసి రెండు నెలలు కూడా కాలేదు మామగారితమ్ముడుగారి ఇంట్లో అతి కష్టంమీద గడిపి మూడో టెర్ములో చదువుకోవాల్సింది చాలా ఉంటుందని గ్రహించినవాడనై, వేరే గదిలో ఉంటే మేలని ఎంచి చినమామగారి చెరలోంచి బయటపడినవాడిని. ఉన్నవాళ్లలో పెద్దవాణ్ణి, టీచరుగా ఎనిమిదేళ్ల అనుభవం ఉన్నవాణ్ణి కావడంచేత మిగిలినవాళ్లు నన్ను మాష్టారూ అంటూ గౌరవించేవాళ్లు.

మేం అక్కడ చేరిన పదిహేను రోజులకి కాబోలు మురళి వచ్చేడు గది కావాలంటూ.

స్వామి, "మనకే చాల్డంలేదు కదు సార్," అన్నాడు.

చలం, "మీరు కొంచెం ఆలోచించాలి. అతను కూడా మీలాగే హాస్టల్నించి వాకౌటు చేసినవాడు. మీకే సానుభూతి లేకపోతే ఎలాగ?" అన్నాడు.

మురళి హాస్టలునించి ఎందుకు వచ్చేశాడో చెప్పలేదు. ఏదో ఫిషీ అనుకున్నాను. పావుగంట తర్జనభర్జనలయింతరవాత మురళిని చేర్చుకోడానికి అంగీకరించేం. మరొక గంట అయినతరవాత అతను ఓ పాతకాలపు రేకు పెట్టెతో, ఒకే ఒక జంబుఖానాతో మాగదిలో ప్రవేశించేడు. మాదగ్గిర ఉన్నవి హంసతూలికాతల్పాలూ, గాడ్రెజ్ బీరువాలూ కాకపోయినా మురళి సరంజామా చూసినప్పుడు మాత్రం ముగ్గురమూ గతుక్కుమన్నాం. అతను నైట్ కాలేజీ విద్యార్థి. పగలు సేఠ్ కమల్ దాస్ వెండి బంగారు

నగలషాపులో లెక్కలు రాస్తాట్ట. పగలు, ఉద్యోగం, రాత్రి కాలేజీ మూలంగా సామాన్యంగా అతనిఉనికి మాకు తెలియజేసేవి ఆ రేకు పెట్టే, జంబుఖానాగానే భాసించేయి చాలాకాలం.

మాముగ్గురిలో ఎవళ్ళం అల్లరిమేళం కాదు. అంచేతే మేమూ అన్యులూ కూడా మాగదిని ఆశ్రమంగానే వ్యవహరించేవాళ్లం. మురళి ఉన్నప్పుడు మాత్రం కొంచెం చలనం కనిపించేది ఆ ప్రాంతాల్లో.

“నాయనలారా! జీవితంలో సగం భాగం నిద్రకే పోతుంది. ఆ మిగిలిన సగంలో ముప్పాతిక ఆహారవ్యవహారాలకి పోతుంది. ఆ మిగిలిన అరాపరక భాగంలో కాస్త కళ్లు తెరిచి చుట్టూ ఉన్న ప్రపంచం చూడండి. పక్షుల్లా ఎగరలేకపోయినా ఎగుర్తున్న పక్షుల్ని చూసి ఆనందించవచ్చు కదా,” అంటూ సద్బోధలు చేస్తూ నవ్వించేవాడు.

OOO

“రండి, రండి. ఫొటోలు తీస్తాను,” అంటూ మాముగ్గుర్నీ లేపేడు ఆరోజు పొద్దున్నే.

ఎంత గడ్డిపరక అయినా అల్లుడని పీట వేస్తే ఎగిరిపడ్డట్టు, ఏ మనిషికయినా ఫొటో అనగానే కొంచెం చలనం కలుగుతుందనుకుంటాను. చలం మొదట్లో కొంత గునిసినా త్వరగానే తెమిలేడు మొహాన ఇంత పౌడరు కొట్టుకుని, ఇస్త్రీ మడతలు వేసుకుని. స్వామి లుంగీ అయితే మార్చేడు కానీ గడ్డం గీయలేదు.

“స్వాములారు గడ్డం తీయకపోతే ఫొటోలో వాంటెడ్ పర్సన్‌లా కనపడగలరు. తరవాత మీ యిష్టం,” అన్నాడు మురళి.

“నువ్వు తీసే ఫొటోలో ఎలా పడ్డా ఫరవాలేదులే,” అన్నాడు స్వామి.

నాకెందుకో అనుమానం వచ్చింది. మురళి నిజంగా ఫొటోలు తీయగలడా? ఆమాటే అడిగేను.

“చూడండి,” అంటూ నాకళ్ళముందే మూడు రీళ్ళు తగలేసేడు – ఇద్దరిద్దరుగా, ముగ్గురూ కలిసి, ఒకొకళ్లుగా, మాగదిలో, గదిముందు … రకరకాలుగా. ఒక్క ఫొటోలో కూడా అతను లేడన్న సంగతి చాలా ఆలస్యంగా గుర్తించేం. “నువ్వు కూడా కొన్ని ఫొటోల్లోనైనా ఉంటే బాగుండును,” అంటే, మురళి నవ్వి, “నాకెందుకు మాష్టారూ ఫొటోలు,” అన్నాడు.

కెమేరా తెచ్చినప్పటి ఉత్సాహం లేకపోయినా అతను నవ్వుతూ, “ఫొటోలు తెచ్చేను,” అన్నప్పుడు అందరం ఆత్రపడ్డాం అవి చూడ్డానికి. అవి మా ఫొటోలే అని అతను చెప్పేడు కనక సరిపోయింది. సగం నెగిటివులు పూర్తిగా నల్లగా ఉన్నాయి. కొన్ని పూర్తిగా తెల్లగా ఉన్నాయి. అవి ట్రావెల్ బాగ్‌కి విండోల్లా ఉపయోగించవచ్చు అంటూ సంబరపడ్డాడు మురళి. మిగిలినవి చూపిస్తూ, “ఇదుగో, ఇక్కడ మీరూ, ఇది అతనూ, ఆపక్కన చలం కదూ, ఇదుగో స్వామి గడ్డం,” అంటూ ఒకొకళ్ళనే అతను గుర్తు పడుతుంటే మేం కళ్ళు చించుకు చూసేం, “అవును, అలాగే ఉంది, కావచ్చు,” అంటూ. చూడ్డం అయింతరవాత, “ఎవరికి ఏవి కావాలో చెప్తే, కాపీలు

తీయించి ఇస్తాను," అన్నప్పుడు మాత్రం మేం ముగ్గురం మొహమొహాలు చూసుకుని తరవాత చెప్తాం అంటూ తప్పుకున్నాం.

000

ఆ రాత్రి మురళి ఎందుకో నలత పడ్డట్టు కనిపించేడు. పలకరిస్తే ఏమీ లేదన్నాడు. రెండో రోజూ, మూడో రోజూ కూడా గదికి త్వరగా వచ్చి పడుకోడంతో నాకు అనుమానం వచ్చింది. గట్టిగా మందలించి అడిగేను. మూడు రోజులయిందిట భోజనం చేసి. ఎందుకని అడిగితే జవాబు లేదు. అప్పుడే నాకు మరో విషయం కూడా గుర్తొచ్చింది. అప్పుడప్పుడు హాస్టల్లో భోంచేసి వచ్చేనని చెబుతూండేవాడు. అప్పుడు కూడా ఇలాగేనా?

"అవునండీ."

నాకు కడుపులో దేవినట్టయింది. "నాకెప్పుడూ ఎందుకు చెప్పలేదు?"

"ఏమని చెప్పను?"

అతనిమొహంలోకి చూడలేకపోయేను. ఎంత మూర్ఖుడివిరా అనుకున్నాను. డబ్బు చాలక హాస్టల్లోంచి వచ్చేశాడని అర్థమయింది. ఫొటోలకి ఇరవై రూపాయల్దాకా ఖర్చయిఉంటుంది. మళ్ళీ డబ్బు చేతిలో పడేవరకూ సేట్జీ ఇంట్లోవాళ్లు ఇచ్చిన మిఠాయిలు తిని నీళ్ళు తాగి పడుకుంటున్నాడు.

నాభోజనంకార్డు ఇచ్చి చెప్పేను, "ఇంకెప్పుడూ ఇలాటి నిరసనవ్రతాలు పట్టకు. పండుగలనీ, పబ్బాలనీ, పుట్టినరోజులనీ నెలకి పదిహేను రోజులు నేను మావాళ్ళింట్లోనే తింటాను. నీకు ఎప్పుడు కావలిస్తే అప్పుడు నాకార్డు తీసుకెళ్ళి తిను. తెలిసిందా?"

"సరేనండీ," అన్నాడు మురళి. అతనికళ్ళలో కన్నీటిపొరలతో నాకు కళ్ళు చెమర్చేయి.

క్రమంగా నాకు మురళి ఆప్తుడయేడు. కదాచితుగా అతడిని మా మామగారింటికి కూడా తీసుకెళ్తూ ఉండేవాడిని నాస్నేహితుడని. పిల్లలతో బాగా ఆడుకునేవాడు కానీ భోజనందగ్గర మాత్రం చాలా మొహమాటపడేవాడు. తరవాత తెలిసింది నేను లేనప్పుడు కూడా వెళ్ళి, సేట్జీ వాళ్ళిచ్చిన మిఠాయిలు పిల్లలకి పెట్టేవాడని.

కొన్నాళ్ళవరకూ ఎలాటి విపరీతాలు జరగలేదు. జీవితం ప్రశాంతంగా సాఫీగా సాగిపోతూంది. ఒక విధమైన పరీక్షజ్వరం వాతావరణంలో వ్యాపిస్తూంది.

మళ్ళీ ఓ కుదుపు ఇచ్చేడు మురళి. ఈసారి టేప్ రికార్డరు! "లేకపోతే నువ్వు మురళివి ఎందుకవుతావు?" అన్నాను కోపంగా.

మురళి ఇకిలించేడు చిన్నపిల్లాడిలా. ఎవరో స్నేహితుడిదిట తెచ్చేడు. ఇక్కడ గదిలో ఉన్నవాళ్ళందరి స్వరాలూ రికార్డు చేద్దామనిట. ఇక్కడ అంత రికార్డు ఇవ్వగల గాయకులున్నారని నాకు తెలీదే అన్నాను.

"దానికేంవుందండీ. శిలలు కరిగించే సంగీతం వినిపించితే తప్పు తీసుకోనంటుందా టేపు? మీరు పదమూడో ఎక్కం చెప్పినా ఎంతో చక్కగా రికార్డు చేస్తుందిది. మీ కంఠస్వరం మీకు వినాలని ఉందా? ఒకసారి పరీక్షించుకోండి. మీ గొంతులో కోయిలలు కూయవచ్చు. ఆ విషయం మీకు తెలియకపోవచ్చు."

సిలోన్ రేడియోలా మురళి వాగుతుంటే మేం అందరం నవ్వేశాం విశాలంగా. ఏనాడూ గట్టిగా మాటాడని చలం మూడు రోడ్లకి వినిపించేలా గొంతెత్తి పాండవోద్యోగంలో పద్యాలు చదివేడు. స్వామి "నాకేం రాదు బాబూ," అంటూ గునిసి, "కావలిస్తే నా సివిలింజినీరింగు పాఠం చదివేస్తాను," అన్నాడు.

"పోనీ ఓ పన్చేద్దాం. మనం అందరం కలిసి ఓ నాటకం వేద్దాం. ఏదైనా ఓ పుస్తకం తీసుకుని చదివేయడమే," అన్నాడు చలం.

"ఇంతవరకూ రికార్డు చేసింది చాలు. అది పెట్టు. ఎలా వచ్చిందో చూద్దాం," అన్నాన్నేను.

"అరరె, మాష్టారు పోల్చేసేరే," అంటూ టేపు రివర్స్ చేసేడు.

"అది నా గొంతే", "అదుగో అది నేనే," "ఇదెవరు?" అంటూ స్వామీ, చలం దానిచుట్టూ చేరి గోల చేస్తుంటే నేను చూసి నవ్వుకున్నాను.

ఆపూటంతా సరదాగా గడిచిపోయింది. "ఇంక తీసుకెళ్ళి ఇచ్చేయ్. అది గాని చెడిపోయిందంటే నీతలకి చుట్టుకుంటుంది ఏలిన్నాటి శని ఏడేడు పధ్నాలుగేళ్ళయినా వదుల్చుకోలేవు మళ్ళీ," అన్నాను.

"రేపిస్తాలెండి. ఇంకా కొందరి గాత్రాలు రికార్డు చేసుకోవాలి," అని మురళి అన్నప్పుడు నాకు కొంచెం అనుమానం తగిలింది. "చేసుకోవాలి అంటున్నావు. ఏం చేస్తావేమిటి ఇవన్నీ?" అనడిగేను.

"ఏం లేదండీ. ఊరికే అన్నాను," అనేసి తప్పించుకున్నాడు కానీ ఏదో ఉందనీ, ఊరికే అనలేదనీ నాకు వెంటనే అనిపించింది. ఆ రాత్రి మురళి ఒప్పుకున్నాడు తను టేపు కొనుక్కున్నాడుట. అతని మూర్ఖత్వానికి అంతు లేదేమో అనిపించింది. వరసగా రెండు సినిమాలు చూడ్డానికి తాహతు లేనివాడు నలభై అయిదు రూపాయలు పెట్టి టేపు కొన్నాడంటే ఏంటనుకోడం? అదీ రికార్డరు తనదగ్గర లేనప్పుడు!

"మూర్ఖుణ్ణే అనుకోండి మాష్టారూ, నాకు మనుషులు కావాలి. నాజీవితంలో తారసపడిన ప్రతి వాళ్ళూ - నేనంటే అబిమానం అనండి సానుభూతనండి - ఏదో చూపించిన ప్రతి మనిషీ నాకు ఆప్తుడే. నేను పస్తు పడుకున్నానంటే మీరు మీల్సుకార్డు ఇస్తారు. పుస్తకం లేదంటే చలం ఎక్కణ్ణుంచైనా తెచ్చి ఇస్తాడు. ఇవన్నీ చిన్న విషయాలు మీకు. నాకు మాత్రం ఆజన్మాంతం గుర్తుంటాయి. మన చదువులయిపోయి మనం విడిపోయిన తరవాత మళ్ళీ కలుసుకోకపోవచ్చు. కలుసుకున్నా గుర్తు పట్టకపోవచ్చు. అందుకే నేనిలా ఫొటోలూ అవీ సేకరించుకుంటాను. చూడండి కష్టపడి డబ్బు సంపాదించి ఎలాగో టేపు రికార్డరు కొనుక్కుంటాను. నేను రిటైరయిపోయినతరవాత పనేం ఉండదు కదా. ఇవి చూసుకుంటూ నన్నొక ప్రాణిలా

చూసుకున్న మిత్రులందర్నీ తల్చుకుంటూ కాలం గడుపుతాను. లేకపోతే ముసిలికాలం గడవడం కష్టంవండీ."

మురళిమాటలు వింటుంటే నాకు మనసు మొద్దుబారిపోయింది. హుషారుగా నవ్వుతూ, నవ్విస్తూ, కవ్విస్తూ గలగల్లాడుతూ తిరిగే ఈ కుర్రాడిలో ఇంతటి ఒంటరితనం గూడు కట్టుకుఉందని ఎవరనుకోగలరు?

నేను మురళిని మరింత జాగ్రత్తగా పరిశీలించసాగేను. అయితే అది అతనికిష్టం లేనట్టు, తను గీసుకున్న గిరి దాటి నన్ను చేరనివ్వలేదు. అతను సంపాదించే వస్తుసంచయం నాకు తమాషాగా ఉండేది. ఓ రోజు ఎవరో ఇచ్చేరని లక్కతో చేసిన బాల్ పాయింట్ పెన్ను తెచ్చేడు, "దీనిమీద పూసలు చూడండి ఎంత బావున్నాయో," అంటూ. మరోరోజు ఓ అగ్గిపెట్టె తెచ్చేడు, "చూడండి," అంటూ.

"బల్లమీద కొత్తగా ఉంది," అన్నాను. అంతకంటె ఏఁవనడానికీ నాకు తోచలేదు.

"అంతే కాదండీ, ఇది జపాన్నించి వచ్చింది. ముగ్గురు చిత్రకారులు కారుమీద దేశాలు తిరుగుతూ మాకవి గారింట్లో కలిసేరు. చాలాసేపు వాళ్ళతో మాటాడేనండీ. ఇది నాకు ఒకాయన ఇచ్చేడు. పుల్లలు చూసేరా, ప్లాస్టిక్. మందు కూడా చూడండి తెల్లగా ఉంది. తమాషాగా లేదూ?"

మురళి చెప్పే తీరు మాత్రమే నాకు తమాషాగా అనిపించింది. "మొత్తమ్మీద నీపెట్టె అంతా ఇలాటి చిల్లర సామానుతోనే నింపేసేట్టున్నావు," అన్నాను మందహాసంతో.

"మరింకేం ఉంటాయండీ అందులో పెట్టడానికి?" అతను నవ్వుతూనే అన్నా నాకు అయ్యో అనిపించింది. ఒక్కోమారు అనుకునేవాణ్ణి అతనికి చెప్పాలని, "నేనూ  నీవయసులో ఇలాగే అనుకున్నాను. కొత్తగా కళ్ళు తెరిచి ప్రపంచం చూడ్డం మొదలు పెట్టిన ప్రతి ప్రాణికీ ప్రతి వస్తువూ అందంగానూ ఆశ్చర్యంగానూ కనిపిస్తుంది అనీ, కాలం గడిచి సంసారాల్లోనూ ఉద్యోగాల్లోనూ దిగింతరవాత అగ్గిపెట్టె ఒట్టి అగ్గిపెట్టెలాగే కనిపిస్తుందనీ, అతను కడుతున్నది ఇసక గూళ్ళనీ …" కానీ మళ్ళీ అతనిమొహం చూసి చెప్పలేకపోయేవాణ్ణి.

మురళిమొహం చూస్తే సద్యోవికసితప్రసూనాలూ, పాలతో కడిగిన ముత్యాలూ తలపుకొస్తాయి. అర్థబలమూ, అంగబలమూ లేకపోయినా "నాజీవితం సుందర సురుచిరకావ్యంలా మలుచుకుంటాను," అన్న గుండెనిబ్బరం కనిపించేది ఆ మొహంలో. ఆరోజుకోసం ఆతృతగా ఎదురు చూస్తున్నాను.

మూడో టెర్ములో నేను ఇంటికి వెళ్ళలేదు చదువు సాగదని. "ఓమారు ఇంటికి వచ్చి వెళ్ళండి," అంటూ మాఆవిడ రాసిన ప్రతి ఉత్తరం పెట్టెలో పడేసేను. మార్చి మొదటివారంలో "ఒంట్లో బాగులేదు, వెంటనే రావలసింది," అంటూ తాఖీదులాటి టెలిగ్రాం రావడంతో, "రెండు రోజుల్లో వచ్చేస్తాను," అని నా సహవాసులకి చెప్పి బయల్దేరేను. తీరా ఇంటికొచ్చి చూస్తే, నిజంగానే మాఆవిడ మంచంలో ఉంది. రెండు రోజులనుకున్న నేను పదిహేను రోజులు ఉండిపోవాల్సివచ్చింది. సరిగ్గా పరీక్షలముందు ఇలాటి అవాంతరం తెచ్చిపెట్టిన దేవుడెంత కఠినుడు అనుకోడం తప్ప ఏం చేయలేకపోయేను.

తిరిగి వచ్చేసరికి చలం కాలేజీకి తయారవుతున్నాడు. స్వామి వెళ్ళిపోయినట్టున్నాడు. చేతిసంచీ ఓమూల పారేసి, మొహం కడుక్కుని నేను కూడా కాలేజీకి వెళ్ళడానికి తువాలందుకోబోతుంటే గదిలో ఏదో వెలితిగా ఉన్నట్టనిపించింది. "మురళి ఊళ్ళో లేడా?" అని చలాన్ని అడిగేను.

"మురళి చనిపోయేడండీ."

"ఆఁ!" ఎలెక్ట్రిక్ షాక్ తిన్నట్టు ఉలిక్కిపడ్డాను.

"అవునండీ, ఏక్సిడెంటు. మంగళవారం రాత్రి సైకిలుమీద వస్తున్నాడు. డబుల్సు ఎక్కేరుట. కాలేజీ కాంపౌండు దాటి రోడ్డుమీదికి వస్తుంటే వెనకనించి లారీ యమస్పీడులో వచ్చి గుద్దేసింది. వీళ్ళు తప్పుకోలేకపోయేరు," చలం చెప్పడం ఆపేడు.

అప్పటికే నేను నిలబడలేక కూలబడిపోయేను మంచంమీద. చాలాసేపయినతరవాత అడిగేను,

"వాళ్ళవాళ్ళెవరైనా వచ్చేరా?"

"అతనికి అయినవాళ్ళెవరూ ఉన్నట్టు లేదండీ. కాలేజీరిజిస్టరు చూసి ఏదో ఎడ్రెసుకి ఉత్తరం రాసేం. ఎవరో దూరపుబంధువుట వచ్చి ఆ పెట్టే, జంబుఖానా పట్టుకుపోయేరు."

అప్రయత్నంగా ఆమూల చూసేను. అందరిజ్ఞాపకాలకోసం తాపత్రయపడిన మురళి మాకు ఏమీ మిగల్చకుండా పోయేడు.

ఆమూల శూన్యంగా ఉంది.

ooo

(కామధేను, మే 1, 1972, లో ప్రచురితం.)

# 3. మద్రాస్ టు తిరుపతి

"తిరుప్పత్తుకు మూణు టికెట్ వేణుం," అంది నాజూగ్గా ఉన్న నాతి నట్టుతూ.

తెలుగుపడుచని పోల్చీసినట్టున్నాడు డ్రైవరుసీటులో సుఖాసీనుడై ఉన్న క్లీనరు, "కూసోండి, కండక్టరు ఇప్పుడుదా వచ్చును," అన్నాడు తనకొచ్చిన తెలుగులో.

ముగ్గురాడపిల్లలూ మురిసిపోయేరు రిజర్వేషను లేకుండా సీట్లు దొరికినందుకు కిలకిల్లాడుతూ సీట్లలో సర్దుకున్నారు. బస్సువరకూ టురదలో ఇంచుమించు ఈత కొట్టుకుంటూ రావడంచేత బస్సులో పడగానే హాయ్ హాయ్ అనిపించింది ప్రాణం వాళ్ళకి. వాన కూడా శోభాయమానంగా ఉంటుందనిపించింది. ఆ మాటే అంది నాజూగ్గా శలాకలా ఉన్న పిల్ల పక్కన కూచున్న దోసపండులాటి పొలతితో.

"ఛూ. నాకు వానంటే అసయ్యం," అంది దోసపండు.

వెనక సీట్లో కూచున్న ఆసామీ తన స్వామినితో, "బాలాజీ ఎక్స్‌ప్రెస్‌లో పూడుస్తుమంటే వింటివా?" అంటూ దెప్పుతున్నాడు.

"ఏమిటో వీళ్ళూ, వీళ్ళభాషాను. బతికుండగానే పూడ్చేస్తారు మనుషుల్ని," అంతవరకూ వింతగా చూస్తున్న మూడో అమ్మాయి ప్రకాశంగా స్వగతం పలికింది.

ముందు సీట్లో కూచున్న మొదలియారు కిటికీ కమ్మీలకి మొహం ఆనించి తుపుక్కున ఉమ్మేడు.

కిటికీపక్కన కూచున్న అమ్మాయి తృళ్ళిపడింది తుప్పర్లు మీద పడకపోయినా. ఇదే ఫారిన్లో అయితే ఎలా ఉంటుందో ఊహిస్తోంది. బస్సు కదిలింతరవాత కూడా ఆ మనిషి ఇలాగే తుపుకూ తుపుకూ ఉమ్ముతాడేమో అనుకుని బెదిరిపోతోంది.

చటుక్కున ఆడో మగో తెలీని నాలుగు శాల్తీలు గలగల్లాడుతూ బస్సెక్కి వెనకసీట్లో సర్దుకున్నాయి.

"కాలీజీలు మూసీసీరు గావాల. ఇల్లకెల్తన్నారు గావాల," ఓ పెద్దాయన అభిప్రాయం వెలిబుచ్చేడు.

"గోయింగ్ ఫర్ పిక్నిక్," ఆ నాలుగు శాల్తీల్లో ఒకటి అందో అన్నాడో.

"ఈ వానా, టురదా, ఈదురుగాలిలో పిక్నిక్కేమిటి నామొహం," అంది కిటికీదగ్గర కూచుని సుమారుగా మొహం బాగానే ఉన్న చిన్నది ఆ మొహమే వికృతంగా పెట్టి.

"బస్సు బయల్దేరితే బావుణ్ణు," అనుకుంటున్నాడు అప్పుడే బస్సెక్కిన బిజినెస్ మాగ్నెట్.

కండక్టరు రాయవలసిన చిట్టాఆవర్జాలన్నీ రాసి, టిక్కెట్లు లేనివాళ్ళకి టికెట్లిచ్చి, ఉన్నవాళ్ళవి చెక్ చేసి, "రైట్," అని కేక పెట్టేడు.

డ్రైవరు తలుపు తీసి, బస్సు దిగి, తలుపు వేసి, రోడ్డువారనున్న టీకొట్టుకి వెళ్ళి, జేబులోంచి పర్సు తీసి, డబ్బు తీసి, పర్సు జేబులో పెట్టుకుని, కాఫీ అడిగి తీసుకుని, అది సావధానంగా చప్పరిస్తూ పూర్తి చేసి, బస్సుదగ్గరకొచ్చి, జేబులోంచి బీడీ తీసి, అగ్గిపెట్టె తీసి, బీడీ వెలిగించి, అగ్గిపెట్టె జేబులో పెట్టుకుని, బీడీ పళ్లమధ్య గిట్టకరిచి పట్టి, తలుపు తీసి, సీట్లో సుఖాసీనుడై, తలుపు సరిగ్గా పడిందో లేదో మరోసారి చూసుకుని ఇంజను స్టార్టు చేసేడు.

బస్సులో జనం అంతా ఆ క్షణంకోసమే ఎదురుచూస్తున్నారు. అందరూ కూడబలుక్కున్నట్టు ఓ సుదీర్ఘమైన నిట్టూర్పు విడిచేరు.

ముందుసీట్లో కూచున్న మొదలియారు మళ్ళీ కాండ్రించి ఉమ్మేడు. కిటికీదగ్గర అమ్మాయి మళ్ళీ తుళ్ళిపడింది, కిటికీకున్న గాజు తలుపు మూసే ఉన్నా.

పిక్నిక్కుకి బయల్దేరిన కుర్రకారు పేకలూ, పత్రికలూ తీసేరు.

యాత్రకి బయల్దేరిన ముసలావిడ వక్కపలుకు నవుల్తోందో గోవిందనామాలు వల్లించుకుంటోందో సరిగ్గా తెలీడంలేదు.

బిజినెట్ మాగ్నెట్టు నాలుగు వేళ్ళమీదా నాలుగు ఉంగరాలూ మెరుస్తుండగా జేబులోంచి స్టేట్స్‌మన్ తీసి వెలిగించేడు. ఆయనగారి  వెనకసీట్లో ఉన్న పడుచు మొహం చిట్లించి ఆయన అలా బస్సులో పొగ తాగడాన్ని నిరసించింది. అది గ్రహించిన ఆమెపక్కనున్న మగాయన ముందుకి వొంగి, “బస్సులో సిగరెట్లు కాల్చకూడదండీ,” అన్నాడు మర్యాదగా.

బి.మా. నిర్లక్ష్యాన్ని సూచించే ధ్వనొకటి చేసి, “అటు చూడండి,” అన్నాడు డ్రైవరునీ, అతని నోట వెలుగొందుతున్న బీడీని ఉద్దేశించి.

“మీరేఁవుందండీ ఇటెక్కుతారు, అటు దిగడిపోతారు. మాం ఇరువైనాలుగ్గంటలూ ఈ బస్సులోనే సావాల. మాకామాత్తరం బీడీ ముక్కయినా కాల్సే రైటు నేకపోతే ఎట్టాగండీ,” అన్నాడు కండక్టరు ట్రేడ్ యూనియన్ భాష మాటాడుతూ.

“అయితే మాత్రం ఏం? ఆయన కాల్చే బీడీకి పొగ రాదా? లేక, ఆ పొగ శృంగారబత్తీ వాసనలు విరజిమ్ముతుందా?” ఓ స్టూడెంటు కుర్రాడు లా పాయింటు లాగేడు తను కూడా ఓ సిగరెట్టు వెలిగిస్తూ.

ముందు వరసలోని ముగ్గురు నవ్వేరు.

అభ్యంతరం చెప్పిన ఆడమనిషి భర్తచేతిమీద చెయ్యేసి, “మీరూరుకోండి,” అంది అనునయంగా.

ముందస్తుగా సిగరెట్ ముట్టించిన బిజినెస్మాగ్నెట్టు నిర్వికారంగా కిటికీలోంచి బయటికి చూస్తూ కూర్చున్నాడు.

బస్సు ఆగిపోయింది.

ఎందుచేత?

వాగొచ్చిందిట.

ఇంతకుముందు కూడా వాగులొచ్చేయి.

ఇది చాలా ఉధృతంగా ఉందిట.

“చూడవోయ్ పొగరుమోతుగిత్తలా పరవళ్ళు తొక్కుతోంది పిల్ల కాలువ. దూరంగా సచేలస్నానం వణికిపోతున్న పునిస్త్రీలా ...,” తెలుగు పడుచు శలాకలాటి పిల్లతో అంది.

ఆ శలాకలాటి పిల్ల మొహం చిట్లించి, “నాలాటివి తెలీవు. నేను తెలుగు చదువుకోలేదు,” అంది.

తమిళదేశంలో స్థిరపడిన తెలుగువెలుగుగారు, “మనము తిరుపదికి ఎప్పుడు పూడుస్తుమో,” అంటూ వాపోతున్నాడు.

బి. మాగ్నెట్ వెనకనున్న భర్త భార్యకి బోధిస్తున్నాడు, “వానొస్తే వాగులొస్తాయి. వానొచ్చినా రాకపోయినా లెవెల్ క్రాసింగులొస్తాయి. అన్ని పరిస్థితుల్లోనూ బస్సులాగిపోతుంటాయి.”

“స్పీడు బ్రేకరులంటే అవేనా?  ఇన్ని అడ్డంకులుండగా మనకి వేరే స్పీడు బ్రేకరుల అవుసరం ఉందా?” అని అమాయకంగా ప్రశ్నించింది భార్య.

“అయితే ఈ బస్సు ఈరాత్రికి ఇక్కణ్ణుంచి కదల్దా?” దోసపండులా ఉన్న అమ్మాయి బెంగగా అడుగుతోంది.

“మరి మనం ఎలా వెళ్తాం?” ఎవరో అడుగుతున్నారు ఎవర్ని ఉద్దేశించో తెలీదు.

“అయ్యో, నాకు లీవు కూడా లేదు. రేపు ఆఫీసుకి హాజరు కాకపోతే జీతం తెగ్గోసేస్తారు.”

“ఎన్నప్పా, ఇణ్ణికుదా పోఫ్లోమా ఇల్లియా?”

“డయివరయ్యోవ్, రోడ్డుండాది గంద, సెమ్మదిమీన పోదా బండి?”

“నాదేఁవుంది బాబూ, ఇడవమంటే బ్రేకులిడిసీస్తాను. అందరం పోతాం గంగలోకి.”

“అవును మరి. అందరూ ఏం చేస్తావు, ఏంచేస్తావంటే మాట తోచనియ్యకుండా చంపుకుతింటుంటే,” అన్నాడు ఓ కుర్రాడు డ్రైవరుపట్ల సానుభూతి చూపుతూ.

ఈ బస్సు ఇవాల్టికి కదలదు కాబోలు.

“బాలాజీ ఎక్స్‌ప్రెస్‌లో పోదుం అంటే వింటివా?”

యాత్రకి బయల్దేరిన ముసలావిడ, “వెళ్తున్నది పుణ్యక్షేత్రం. భగవానుడు అరాచకాన్ని సహించడు. ఆపదమొక్కులు సంపద మరుపులన్నారు. మర్చిమపోయిన మొక్కులేవేనా ఉన్నాయేమో తలపుకి తెచ్చుకోండి తండ్రులారా,” అంటూ బ్రతిమలాడ్డం మొదలెట్టింది.

“ఓ తడవ మాంవిట్టాగే బదరాసెలం ఎల్తాఉంటే బండి ట్రబులిచ్చేసినాది నడిదారిల. ఆ రేతిరి అక్కణ్ణే దిగడిపోనాం. సుట్టుపక్కల ఆమడదూరంల ఒటేళ్ళు గూడ నేవు. బండిలో ఇద్దరాడామెలుండిరి. వాల్లు ఒండి ఎట్టినారు మాకు.”

ముగ్గురమ్మాయిలూ మొహమొహాలు చూసుకున్నారు. మూడో అమ్మాయి గుసగుసలాడుతూ,

“మనల్నిప్పుడు వంట చెయ్యమనరు గద.”

మొదటమ్మాయి, “వండమన్నావు వండుతున్నాను నాబుద్ధికి తోచినవంట,” అని పాడితే సరి,” అంది.

బి.మాగ్నెట్ అడిగేడు, “మరోదారి లేదా?”

“రూటు మారిస్తే రూల్సొప్పవండీ,” అన్నాడు డ్రైవరు.

“బాగుందయ్యోయ్. పేసింజర్లనిట్టా బాదలెట్టటానికొప్పుతాయేటి నీరూలుసు,” భద్రాచలం ట్రిప్పు వివరించిన మనిషి కసిరేడు చనువుగా.

“Shall we go ahead with our picnic plans on the roadside in the dim reflections of the bus headlights?”

“ఛీ, ఛీ, ఇండియాలో బస్సెక్కడంవంత న్యూసెన్సు మరొకటి లేదు.”

“బాగుంది. మద్రాసునించి తిరుపతి వెళ్ళాలంటే బస్సు ఇండియాలో ఎక్కాలి గానీ లాసాంజలెస్‌లోనో మెల్బోర్న్‌లోనో ఎక్కుతావేమిటి?”

“ఆ ఒడ్డున బండేదో వస్తున్నట్టుందే!”

“రాటంలేదయ్యా. అదక్కడ చిక్కడిపోయింది.”

“ఉండండి చూదాం. అదిటొస్తే మనఁవూ అటెల్లెచ్చేమో.”

“ఆల్లూ మన్లాగే సూత్తున్నారేఁవో.”

“ఆ ఆ కదుల్తున్నట్టుంది.”

“ఆహాఁ. కదలకేం? కదుల్తున్నాది వెనక్కి. మిస్టర్ డ్రైవర్, మరలించవోయ్ మనరథం కూడా.”

“మళ్ళీ మద్రాసుకే!?”

“మొక్కులెవరికేనా ఉన్నాయేమో యాదకొచ్చినాయా?”

“తడ మీదుగా పోనీయవోయ్ బాబూ. ఒక్కరోజు శలవు పెట్టుకుని వచ్చేను.”

“యస్యస్యస్య్. గో వాయా తడ. మా పిక్నిక్ మట్టి కరిపించీకు.”

“పెట్రోలు సాలదండీ.”

“ప్రభో, తడమీంచి కాకపోతే కొచ్చిన్‌మీంచి తీసుకెళ్ళు. ప్రయాణం పెట్టుకున్న ప్రారబ్ధానికి మేఁవిచ్చుకుంటాం ఆ ఖర్చులు.”

"అరె, కదుల్తున్నట్టుంది."

"వెనక్కి."

"ఆగాగు. ఆ ఒడ్డునున్న బస్సు వస్తున్నట్టుంది."

"ముందు మోకాలు లోతు నీళ్ళలో నానుతున్న ఈబస్సుని ఒడ్డెక్కనీ."

"ఈ బస్సుని నమ్ముకునీకంటె నడిచి పోతే ముందే చేర్తామేమో."

"సరే, నువ్వు దిగి నడుస్తూండు. ముందెళ్ళిపోతే మాకోసం బస్టాండులో ఉండు. దారిలో మేం తగిలితే, మళ్లీ బస్సెక్కుదువుగానీ."

"ఆమాత్రం దానికి నడవడం ఎందుకు?"

"కదలిక చైతన్యానికి అంటే ప్రగతికి చిహ్నం. ఒక్కోసారి ఆ కదలిక ఆత్మప్రదక్షిణకి మించకపోయినా, కదుల్తున్నాం అన్న తృప్తినిస్తుంది."

"అమ్మా, మీరు ముగ్గురూ ఆరు రూవా ఈయండిమీ. అయింబదు పైస కొడప్పా."

"నిండా మోసంగ ఉండాది. ఆరు రూవా, ఆమీన అర్తరూవా వడ్డీ. అర్తరేతిరి వీడు సేరేదీ."

"నాస్పెప్పిడిస్తిని గంద బాలాజీఎస్ప్రెస్‌లో పూడుస్తుంవని."

"ఈడనే ఏడయిపోనాది."

డ్రైవరు కండక్టరుతో, "మల్ల మనతలకి సుట్టుకోకండ రాయి రిపోర్టు. గరదయ్యపాలెంవద్ద పెద్దవాగు వచ్చుటవలన బండి తడమీదుగ మళ్లించడమైనది. పెసింజర్లకాడ చేవ్రాలు తీసుకో."

"అర్తరూపాయి ఇస్తిమి గద, మల్ల ఏమి తీసుకోమంటండు?"

"నువ్ గమ్మునుండు. దస్కతు అడగతండు."

డ్రైవరు లైటార్పేసేడు. బస్సులో తమసు. మనసులో దిగులు. పేసింజర్లు అమ్మకోసం బెంగపడ్డ పిల్లల్లా కూచున్నారు.

కిటికీదగ్గర కూచున్న సుకుమారి సిగరెట్ పొగ భరించలేక గాజుతలుపు పైకెత్తింది. ముందుసీట్లో ఉన్న మొదలియారు తలుపుదగ్గరకెళ్ళి నోట్లో ఉన్న మొత్తం ఖారాకిళ్ళీ బయటికి ఉమ్మేసి వచ్చి కూచున్నాడు. చీకట్లో మెరుస్తున్న రాళ్ళు గల ఉంగరాలు గల చేతులు గల బిజినెస్ మేగ్నట్ సిగరెట్టు వెలిగించబోయి, ఓమారు వెనక్కి తిరిగి చూసి మనసు మార్చేసుకున్నాడు. ఆయన వెనకనున్న ఆడమనిషి పాపం ఆయన సిగరెట్టు కాల్చుకుంటే నేనేం అనుకోను అనుకుంటోంది.

కండక్టరు అపోలిజిటిగ్గా నవ్వి, "ఎల్లిపోతాంలెండి," అన్నాడు ఓదార్పుగా ఆడపిల్లలు ముగ్గురికీ అభయహస్తమిస్తూ.

"ఈరాత్రికే చేరిపోతాం అంటావా?" ఆ వెనకున్న ఒక్క రోజే శలవు పెట్టుకొచ్చిన ఉద్యోగి ఆతృతగా అడిగేడు.

“ఆఁ ఎల్పోతం.”

“తడ పోయిడిసిందా?” యాత్రకి బయల్దేరిన ముసలావిడ భర్తని అడిగింది.

“బాలాజీ ఎస్ప్రెస్ల పూడిస్తే ఈయేలకి కొండపైన పోదుం,” అడిగిన ప్రశ్నకి కాకుండా సమాధానమిచ్చేడు ఆ భర్త.

“కడ అంటే ఏమిటో?”

“కడ కాదు. తడ.”

“నేనడుగుతున్నది అది కాదు. సినిమాపోస్టరుమీద కడ అని ఉంది. అదీ ...”

“కడ అంటే ఆఖరు. రేపటితో బొమ్మ మారిపోతుందన్నమాట.”

“టైమెంతయిందో.”

“ఎనిమిదీ నలబై.”

“ఎట్టుమ్ముక్కాల్.”

“నావాచీలో ఎనిమిదీ యాభై అయిందే!”

“సరేలెద్దూ. ఈ ముసుర్లో ఈ బస్సులో ఎంతైనా ఒకటే. సుమారుగా ఎంతై ఉంటుందని అడిగేను. పేలంపాటలా అందరూ తలో టైమూ చెప్తున్నారు.”

“అసలే బోరు కొట్టి ఛస్తున్నాను. నీనీతిపాఠాలు కూడానా?”

“మరి నువ్వు నీ ఇల్లాలిముచ్చట్లాపకపోతే ..”

“శ్రీకాళహస్తీశ్వరస్వామి సన్నిధికి చేరుకున్నాం. ఎవరైనా కావలిస్తే ఇక్కడ భోజనాలు చెయ్యండి.”

“అప్పుడే నైన్ ఫిఫ్టీన్.”

“అయ్యా, కండక్టరుగారూ, నేనర్జంటుగా తిరుపతి పోవాలి. నెల్లూరినించి వస్తున్నాం. ఆ ఏరుకాడ మాబస్సు ఆగిపోయింది.”

బస్సులు పోనటంలేదు.

మరి ఈబస్సు మాత్రం పోతుందా?

నిజంగా బస్సులు పోటంలేదా?

ఆపదమొక్కులవాడా!

“నిజమేనయ్యా బాబూ, ఏరుకాడ ఆ ఒడ్డున బండ్లు ఆ ఒడ్డునా, ఈ ఒడ్డున బండ్లు ఈ ఒడ్డునా నిలిసిపోనాయ్ ఎదుర్కోలమాదిరి. నాన్నడిసొచ్చినా. బస్ తొరగా పోనీ. తొమ్మిదిముక్కాల్ బండికైన అందుకుంటం.”

“ఉండండి కండక్టరుగారూ. రెండు మెతుకులు కతికొస్తం.”

“కాళాస్త్రి బండి పోద్దయ్యా.”

“ఉండవయ్యా నీగోలోటి ఇప్పటికిప్పుడొచ్చి. నిన్నట్నుంచి నానా అవస్థా పడుతున్నాం మేం.”

“మీరు దిగి తీరిగ్గా భోంచేసి, ఈడ్నే పండుకుని తెల్లారి లేసి పొండి. బండికి పోయేవోళ్లని ఆడ వొదిలీసొస్తం.”
“సుట్టుతిప్పి తీసుకొస్తన్నాడని అర్ధరూపాయి ఎక్కువిచ్చి సగందారిలో దిగిపోడఁవా?”
ఈకథలో నీతిః మద్రాసులో బస్సు ఎక్కితే కాళహస్తిలో రైలెక్కే అవకాశాలుంటాయి. ఇంతే సంగతులు,

ooo

(ఆంధ్ర సచిత్రవారపత్రిక, జూన్ 1, 1973,లో ప్రచురితం.)

## 4. ఉభయభాషాప్రవీణ

ఒకొకప్పుడు ఆలోచిస్తుంటే కొందరి తరహా చూస్తుంటే ఇంగ్లీషొక్కటే భాష కాబోలు అనిపిస్తుంది. ఇంగ్లీషులా ధ్వనించని ఏ భాష మాటాడినా తెల్లమొహం వేస్తారు అదేదో అవాచ్యం అన్నట్టు. రెండక్షరాల పేరు కూడా ధ్వంసం చేయగల జనాల్ని చూస్తే ఏం అనాలో నాకు తోచదు

అదే మనదేశంలో చూడండి జనాభై లెక్కల్లో నిరక్షరాస్యులుగా తేలేవాళ్ళు కూడా రెండో మూడో భాషలు తడుముకోకుండా మాటాడగలరు. మీరిక్కడికొచ్చి ఎంతకాలం అయిందీ అనడక్కండి. బాలాప్రాయం వదిలేస్తే, నాజీవితం సరిగ్గా సగం పుట్టినగడ్డమీదా సగం మెట్టినగడ్డమీదాను. నేనిక్కడ అడుగెట్టగానే పాపం చాలామందే నన్నుద్ధరించడానికి పూనుకున్నారు కానీ నేనే మొండికేశాను వల్లకాదని నాపేరూ, మొహమూ, బాసా, యాసా మొత్తం అంతా ఒకటే పేకేజీ, మీకు నచ్చకపోతే మీఖర్మ అని స్పష్టంగా చెప్పేశాను.

Assimilation నా కార్యక్రమంలో లేదు. నిజానికి మెయిను స్ట్రీములో కొట్టుకుపోకుండా ఉండడానికే జాగ్రత్త పడ్డాను. పడ్డాననే అనుకున్నాను. కానీ నా ప్రమేయం లేకుండానే జరిగిపోయిందది కొంతవరకూ. చాపకింద నీరులా ఇంగ్లీషు నాబుర్రలో కమ్ముకునేసింది. Colonialismలాటిదే ఈ bilingualism కూడా. నేను తెలుగులో ఆలోచించడం ఎప్పుడు మానేశానో నాకే తెలీదు. ఇంగ్లీషులో ఆలోచించడం స్వయంకృతాపరాధం కాదు.

000

నాలుగు నెలలకిందట మాపక్క వాటాలో ఓ కొత్త కుటుంబం దిగేరు. ఆయనా, ఆవిడా, ఓ పదేళ్ళ కుర్రాడూను. వాళ్ళది ఏ దేశమో కానీ ఈ దేశం వాళ్ళకి అయోమయం అని నాకు అర్థం కావడానికి అట్టే కాలం పట్టలేదు. వాళ్ళు దిగిన వారంరోజులకనుకుంటాను ఏదో పుస్తకం పట్టుకుని కూర్చున్నాను. తలుపు తట్టిన చప్పుడు విని లేచి తలుపు తీసేను. మా పక్కవాటాలో కొత్తగా దిగినావిడ. హాయ్ అన్నాను నేను ఆహ్వానపూర్వకంగా ఓ అడుగు వెనక్కి వేసి.

ఆవిడ మొహంలో ఏదో భయం. నాచెయ్యి పుచ్చుకు గుమ్మంఅవతలికి లాగి ఎదురుగా దూరంలో ఉన్న ఇల్లు చూపించింది. ఆ ఇంటిచిమ్నీలోంచి పొగ వస్తూంది. నాకు నవ్వొచ్చింది. ప్రమాదమేమీ లేదని చెప్పబోయేను. అప్పుడు తెలిసింది ఆవిడకి ఇంగ్లీషు రాదని. రకరకాల హావభావాలతో ఓ పావుగంట పాటు పడి ఆవిడని అనునయించి పంపేశాను.

ఆ తరవాత వారంరోజులపాటు నేను కారెక్కుతున్నప్పుడూ దిగుతున్నపుడూ కనిపించి చెయ్యూపేది. అంతే.

000

వాళ్ళబ్బాయిని స్కూల్లో వేశారు. తల్లిదండ్రులకి ఇంగ్లీషు రాదు కనక నన్ను వాళ్ళతో రమ్మన్నారు. అక్కడ కాయితాలన్నీ నేనే నింపేను నాకు తోచినట్టు. చివర సంతకాలు పెట్టవలసిన చోటు చూపించి సంతకాలు పెట్టమన్నాను. తండ్రి వా ళ్ళభాషలోనే ఏదో గిలికేడు. అదేమిటో ఎవరికీ తెలీదు కనక నన్ను సాక్షి సంతకం పెట్టమన్నారు ప్రిన్సిపాలుగారు. పెట్టేను. వాళ్ళు సంతకాలు పెట్టిందెందుకో వాళ్ళకి తెలీదు. అది విడమర్చి చెప్పే భాషాపాటవం నాకు లేదు. అది గమనించనట్టు ఆరోజు నేనూ ప్రిన్సిపాలుగారూ కూడా మన సిస్టముని ఆ విధంగా పరిరక్షించి తృప్తి పడ్డాం.

అందరం ప్రిబుయమేని క్లాసుకి తీసుకెళ్లేం. టీచరు ఎనీనా ఎంతో అనునయంగా ఆ అబ్బాయిని పిల్లలకి పరిచయం చేయబోయింది. "మన క్లాసులో కొత్త అబ్బాయి" అని, వాడివేపు తిరిగి పేరడిగింది.

ఆ కుర్రాడు మాటాడలేదు. ప్రిన్సిపాలుగారు అంతకుముందుచెప్పేరు కానీ ఆవిడకి పట్టుబడలేదు ఆ నామధేయం. రెండోమారు కూడా అడిగి, జవాబు రాకపోవడంతో నిన్ను "ఫిల్ అంటాం, సరేనా" అని, క్లాసులో అందరికీ ఆ పేరు విదితం చేసింది.

కుర్రాడికి ఇదంతా అయోమయంగా ఉందో అవమానంగా ఉందో పళ్ళు గిట్టకరిచి చూస్తున్నాడు అందరినీ.

క్లాసంతా ముక్తకంఠంతో "హాయ్ ఫిల్" అన్నారు.

ఆవిధంగా ఆరోజు ఆ కుర్రాడికి పేరు పెట్టడం, స్కూల్లో వేయడం అయిపోయేక, మేం ఇల్లు చేరుకున్నాం.

అదృష్టవశాత్తు స్కూలు అట్టే దూరం లేదు. గట్టిగా అడుగులేస్తే పదినిముషాలు, అంతే.

మర్నాడు స్కూలు కెళ్ళడానికి పేచీ పెట్టినట్టున్నాడు, మళ్లీ నా తలుపు తట్టేరు తెల్లార్తూనే. నేను మాత్రం ఏం చెప్పగలను? వాళ్ళ భాష నాకు రాదు, నా మాట వాళ్ళకర్థం కాదు. వాళ్ళు రకరకాలుగా చేతులూపుతూనూ, ముఖకవళికలతోనూ నాకు వివరించడానికి ప్రయత్నిస్తున్నారు. నేను చిదానందసాములారిలా మొహం పెట్టుకు వింటున్నానే కానీ ఎంతసేపు ఈ వీధి భాగోతం? అవతల నాకు వేళయిపోతోంది. ఆ కుర్రాడి చెయ్యి పుచ్చుకు నాకారు చూపించేను పదమంటూ. వాడేం అనుకున్నాడో మారు మాటాడకుండా వచ్చి కారులో కూర్చున్నాడు.

నేను వాళ్ళనిగురించి ఆలోచిస్తున్నాను. తండ్రి గాస్ స్టేషనులో పని చేస్తున్నాడు. తల్లి మా చుట్టుపక్కల నాలుగిళ్ళలో క్లీనింగ్ లేడీ. 1970 లనాటి పాతకారొకటి కొన్నారు 500 డాలర్లకి. ఆ కారుకి కొత్త బాటరీ కావాలి, టైర్లు కావాలి, కార్బొరేటరు కావాలి.

నెల రోజులతరవాత ఓ సాయంకాలం ఊరుకోలేక వాళ్ళింటికెళ్ళేను ఏం చూస్తున్నారో చూద్దాం అని. నన్ను చూడగానే ఆవిడమొహం మతాబాలా వెలిగింది లిప్తపాటు. వాళ్ళదేశంనించి తెచ్చుకున్నవేవో చూపిస్తోంది. నాలుగు ఇంగ్లీషు ముక్కలు పట్టుబడ్డాయి. చురుకైనఆవిడలాగే ఉంది. తమదేశంలో ఇంజినీరుట. ఇదా వీళ్ళ అమెరికన్ డ్రీం అనిపించి నా ప్రాణం ఉసూరుమంది.

ఇంటికొచ్చేసరికి ఎనిమిదవుతోంది. గోపు ఎదురుచూస్తున్నాడు నాకోసం. కాలేజీలో మొదటేడు చదువుతున్నారు. నా వెనక పదేళ్ళకి పుట్టేడు కానీ అభిప్రాయాల్లో, ఆలోచనల్లో నేను ఒక తరం వెనకుంటే వాడు రెండు తరాలు ముందున్నాడు. వెరసి మూడు తరాల అంతరం మామధ్య అన్నమాట. పట్నంలో ఇంగ్లీషుమీడియం స్కూల్లో చదువు వెలగబెట్టి అమెరికాకి వచ్చేడు. అమెరికన్ యాస కూడా అక్కడే నేర్చేసుకు దిగేడు. యాతావాతా చెప్పొచ్చేదేమిటంటే ఇంగ్లీషుయాసతో తెలుగు మాటాడే borderline bilingual.

"ఎక్కడున్నావింతసేపూ?" అన్నాడు నన్ను చూడగానే.

వాడు కాలేజీనించి ఇంటికొచ్చేవేళకి నేను సాధారణంగా వంట పూర్తి చేసి టీవీ చూస్తూనో పుస్తకం పుచ్చుకునో ఎదురవుతాను మరి.

"పొరుగింటికెళ్ళేను పిచ్చాపాటీ కబుర్లకి," అన్నాను.

వాడు నవ్వేడు, "ఏఁవిటి మాటాడేరు ఇంతసేపు? నీకు ఆవిడభాష రాదు. ఆవిడకి నీమాట అర్థం కాదు."

"ఏం ఇక్కడ జనాలు కుక్కలతోనూ మొక్కలతోనూ ఊసులాడతారు. ఆపాటి చెయ్యదేమిటి సాటి మనిషి" అన్నాను విసుగ్గా.

ఫిల్ ఇంచుమించు రోజూ పేచీ పెడుతూనే ఉన్నాడు స్కూలికెళ్ళడానికి. ఒకరోజు కమిలిన మొహంతో వచ్చేడింటికి. మరోరోజు ముక్కులోంచి రక్తం కారుకుంటూ, మూడోరోజు కుంటుకుంటూ.

వారంరోజులనాడు యెనీనా ఇంటికొచ్చింది ఫిల్ తల్లిదండ్రులతో మాటాడ్డానికి కానీ కొత్తగా సాధించిందేమీ లేదని నాకు సులువుగానే అర్థమయింది నాకు. ఆవిడ మంచి టీచరే పాపం నిజంగా పిల్లలంటే బోలెడు అభిమానం. వాళ్ళకి ఇంగ్లీషు నేర్పాలని మహ ఆరాటపడిపోతోంది. ఆవిషయంమీద అందిన పుస్తకంవల్లా చదువుతోంది. వర్కుషాపులకి వెళ్తోంది. ఇంగ్లీషు రెండోభాషగా చర్చించే కాన్ఫరెన్సులన్నిటికీ హాజరవుతోంది. ఆవిడకి తిండీ, నిద్రా నిద్రలో కలలూ కూడా ఈ ఈయస్సెలే! ఫిల్‌కి ఇంగ్లీషు నేర్పడం ఆవిడకొక పెద్ద పరీక్షగా తయారయింది. అందులో ఫెయిలయితే ఆవిడకి మహా అవమానం. అటువంటి పరాజయం ఆమెగారు భరించలేదు.

స్కూలయింతరవాత వాడిని కూర్చోబెట్టి అనేకరీతుల పాఠాలు చెప్పడానికి ప్రయత్నించింది. అలా ఆవిడ తనకొక ప్రత్యేకతనివ్వడం వాడికయితే బాగుంది. ఆవిడతో కాలక్షేపం చెయ్యడానికి వాడికేం అభ్యంతరం లేదు కానీ నోట పరాయి భాష పలకడం మాత్రం మహ సంకటంగా ఉంది రోజుకి రోజూ. ఏ రోజు చూసినా ఫిల్ కళ్ళలో బాధ కొట్టొచ్చినట్టు కనిపిస్తూ నన్ను కూడా కలవరపెడుతోంది.

ఆఖరికి ఆరోజు కూడా వచ్చింది. వాడిని స్కూల్నించి తగిలెయ్యడానికి సిద్ధం అయేరు ప్రిన్సిపాలుగారు. కుర్రాడు మేకలు నరుక్కునేకత్తి తీసుకెళ్ళేట్ట స్కూలికి!

యెనీనా పిల్లవాడితల్లిదండ్రులతో మరోసారి మాటాడి చూస్తానని ఆయనకి నచ్చచెప్పి వాళ్ళింటికి మళ్ళీ వచ్చింది. ఆవిడ వచ్చేవేళకి నేను ఇంట్లోనే ఉన్నాను. నేను ఉండేలా చూసుకునే వచ్చిందావిడ. అక్కడ జరుగుతున్న విషయాలు నాకు వివరంగా చెప్పి, పిల్లాడిని ఎలాగైనా కాపాడమని వేడుకుంది. తెలివైనవాడంది. వాడు మెయిను స్ట్రీములో కలిసిపోయేలా చేయడమే తనధ్యేయం అంది. ఇంగ్లీషు చక్కగా మాటాడడంవల్ల కలిగే లాభాలూ, మాటాడలేకపోతే వచ్చే నష్టాలూ, కష్టాలూ, తను తన ధ్యేయం సాధించడానికి పడుతున్న అవస్థలూ – అన్నీ ఎంతో విపులంగా చెప్పింది నాకు. ఆ అబ్బాయిదేశ సంస్కృతీ, సంప్రదాయాలూ, ఆచారాలూ, వ్యవహారాలూ, పండుగలూ, దేవతలూ, పిండివంటలూ – సమస్తవిషయాలూ సేకరించి ఫ్లాష్ కార్డులు తయారు చేసిందిట. ఎంత చేసినా ఫిల్ ఏమాత్రం ఉత్సాహం చూపడంలేదు వాటిలో.

ఓపినంతసేపు విన్నాన్నేను. ఇదీ అని స్పష్టంగా చెప్పలేను కానీ నాకెందుకో ఫిల్ ప్రవర్తన విపరీతంగా తోచలేదు.

"కుర్రాడికి కొంచెం టైమివ్వండి," అన్నాను మరేం తోచక.

యెనీనా మళ్ళీ అందుకుంది – కోర్సు కంటెంటూ, స్థానిక ఆచారాలూ, మర్యాదలూ, ... ఇక్కడి సినిమాలూ, సంగీతం, హిప్ హాప్, జాతీయనాయకులూ, సంబరాలూ – ఫిల్‌కి ఇవీ పట్టలేదుట. ఆఖరికి సింగెలాంగ్ కాసెట్లు ఇచ్చింది. వాడు మరీ అంత పసిపిల్లాడు కాదని తోచలేదావిడకి. ఆ మాట వాడలనలేదు కానీ ఆ మొహం చెబుతోంది.

యెనీనా ఉభయభాషాప్రావిణ్యంవల్ల లభించే ఆనందం, సౌభాగ్యంగురించి ఉపన్యసిస్తోంది. ఆఖరి అస్త్రంగా "మీరు ఇంట్లో మీ భాష మాటాడకండి. ఇంగ్లీషే మాటాడాలని కట్టడి చెయ్యండి," అంది. ఆ వెంటనే ఒక హ్రీంకారంతో గది ప్రతిధ్వనించింది ".... ..." ఫ్రిబుయమే అరిచేడు ఒంట్లో ఉన్న శక్తినంతటినీ కూడగట్టుకుని. వాడు పలికిన వాక్కు శిష్టజనవ్యావహారికం కాదు కనక ఇక్కడ రాయలేను.

అందరం నిర్ఘాంతపోయేం క్షణకాలంపాటు. తరవాత మొహమొహాలు చూసుకున్నాం. కుర్రాడితండ్రి ఏదో అరిచేడు. బహుశా మాటలు తిన్నగా రానియ్ లాటివాచకం కావచ్చు.

"ఇంగ్లీషు రాలేదన్నారు. అదుగో ఇంగ్లీషు," అన్నాను నేను. అలా అనడం మర్యాద కాదని నాకు తెలుసు. నా అభిప్రాయం పిల్లలు మనం అనుకున్నదానికంటె వేగంగానే భాష నేర్చుకోగలరనీ, మనం అనుకోని పద్ధతులలో నేర్చుకుంటారనీను.

"అది నేను నేర్పిన మాట కాదు," అంది యెనీనా పాలిపోయినమొహంతో నీరసంగా. తనసెక్కడ తప్పు పడతారో అని ఆవిడభయం. మళ్ళీ తన సిద్ధాంతం అందుకుంది. తల్లిదండ్రులు కూడా ఇంగ్లీషు

నేర్చుకోవలసిన అవుసరం ఉంది కనక ఇంట్లో అందరూ ఇంగ్లీషే మాటాడ్డం సమంజసం అని నొక్కి వక్కాణించింది.

నాకు ప్రాణం చాలుకొస్తోంది.

"మీరు వాళ్ళకి నచ్చచెప్పండి. వాళ్ళు ఈదేశంలో బతకడానికి ఇంగ్లీషు చాలా అవుసరం," అంది నావేపు తిరిగి. ఆవిడకి కూడా ఓర్పు నశిస్తోంది.

నేను తెలివిగా తప్పుకున్నాను, "అదంతా చెప్పడానికి కావలసిన భాషాపాటవం నాకు లేదు," అంటూ. అంతకు మించితే నేను మాట తూలగలను. అప్పుడు నాభాష ఆవిడకి శ్రవణానందం కాకపోవచ్చు.

"కానీ మీరు వాళ్ళతో మాటాడుతున్నారు కదా!"

దాంతో నాకు అరికాలిమంట నెత్తికెక్కింది. పళ్ళు గిట్టకరిచి అత్యంత శాంతంగా అన్నాను, "నేనీమాట అంటే బాగుండదని ఇంతసేపూ ఊరుకున్నాను. భాష సంస్కృతిలో భాగం. చాలా ముఖ్యమైన భాగం. ఈ దౌర్భాగ్యపునేలమీద వాళ్ళకి మేమూ మనుషలమే అనుకోడానికి తమదైన భాష కావాలి. ఆభాషకి ఇల్లొక్కటే గతి. ఆ ఇంట ఆమాత్రం స్వేచ్ఛ వాళ్ళకి అవుసరం. మీరు ఇంట్లో కూడా ఇంగ్లీషే మాటాడాలని ఆంక్ష పెడితే ఏం చెప్పను? మీరు వాడిని ఉభయభాషాప్రవీణగా కాదు కేవలమూ ఇంగ్లీషే మాటాడే ఏకభాషాజీవిని చేస్తున్నారు." అనేసి నాకు పనుందని చెప్పి అక్కడ్నుంచి బయట పడ్డాను.

ఇంటికొచ్చేనే కానీ మనసంతా మహ చిరాగ్గా ఉంది. అన్నం అడుగంటింది. కూర ఉప్పు కషాయం. పులుసు చిక్కని వార్నిష్‌లా తయారయింది.

"ఏమైంది?" అనడిగేడు గోపు, ఫ్రిజ్‌లోంచి టీవీడిన్నరు  తీసి మైక్రోవేవులో పెట్టుకుంటూ.

"ఆ పంతులమ్మ వాడిని ఉభయభాషాప్రవీణుడిని చేస్తుందిట."

"అయితే తప్పేమిటి?"

"ఆవిడ వాడికి రెండు భాషలు నేర్పడంలేదు. వాడి సంస్కృతిని నాశనం చేస్తోంది సమూలంగా. నీకూ నాకూ ఆ పుట్టించినవాడికీ తెలుసు ఇక్కడ ఉన్నాక ఇంగ్లీషు రాక చస్తుందా? తల్లిభాష మరిచిపొమ్మని ఆవిడ పనిగట్టుకు పోరు పెట్టాలా? మరిచిపోకుండా నిలబెట్టుకోడమే బ్రహ్మప్రళయం అవుతుంటే."

"అలా అంటున్నావు కానీ నీకూ తెలుసు అది నిజం కాదని, " అన్నాడు గోపు, సంస్కృతి నాశనం అవుతుందన్న నామాటనుద్దేశించి.

నేను మళ్ళీ అందుకున్నాను, "నిన్న మాఆఫీసులో ఎమిలీ నాకో వ్యాసం చూపించి నా అభిప్రాయం అడిగింది. ఎవరో పెన్సిల్వేనియాలో ప్రొఫెసరుట వసుధైకకుటుంబానికి ప్రాతిపదికగా సకలజనులూ ఒకేమూసలోంచి వచ్చిన అచ్చుల్లా ఒక్కలా ఆలోచించాలనీ, లోకంలో విజ్ఞానం అంతా అందరూ పంచుకోవాలనీ."

"అది నీకు తప్పుగా తోచిందా?" అన్నాడు గోపు నన్ను ఎత్తిపొడుస్తూ. అందర్నీ తప్పు పట్టడమే నాకు పరమావధి అని వాడి అభిప్రాయం.

"లేదు. ఆ తరవాతివాక్యమే నన్ను శివాలెత్తిస్తోంది. ఏమన్నాడు తెలుసా? ఆ అధమాధమ తరగతి దేశాలన్నీ తమకున్న పుంజీడు పుస్తకాలూ కంఠస్థం చేసి అవే మళ్ళీ మళ్లీ వల్లె వేసుకుంటూ అజ్ఞానతిమిరంలో కొట్టుకుంటున్నారూ,  వాళ్ళకి మనం పుస్తకాలూ, కంప్యూటర్లూ, విడియోగేములూ సరఫరా చేసి, మన ఫుట్బాలూ, బేస్బాలూ, చదరంగంలాటి ఆటలు నేర్పి వాళ్ళని విజ్ఞానవంతులని చేయాలి అని."

"చదరంగం కూడా ఆయనే కనిపెట్టేనంటాడేమిటి?" అన్నాడు గోపు. అప్పటికి తోచిందివాడికి అవతలివాడి వాదనలలో అవకతవకలు.

"అదే మరి. పుస్తకాలు లేకుండా జ్ఞానం సముపార్జించొచ్చని ఆయనకి తెలీదు. ఆమధ్య ఓ కుర్రాడు ఉద్యోగానికి అర్జీ పెట్టుకుంటూ, తనకి తెలుగొచ్చని రాసుకున్నాడు. ఏ మాత్రం వచ్చో నన్ను చూడమన్నారు. తీరా చూస్తే అతగాడి నోట్లోంచి ఒక్కముక్క కూడా ఊడిపడలేదు. మా క్లాసులో చెప్పిందంతా పుస్తకంలో ఉంది, పుస్తకం ఇంట్లో ఉంది అన్నాడు."

గోపు నామానానికి నన్ను వదిలేశాడు ఆ సమయంలో అదే క్షేమమనుకుని కాబోలు.

నేను నాగదిలోకి వెళ్ళిపోయేను.

000

కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాను ఏం తోచక.

ఫ్రెబుయమే మాయింటిముందు కొంచెం ఎడంగా తచ్చాడుతున్నాడు. పది నిముషాలయేక గోపు బాస్కెట్ బాల్ తీసుకుని బయటికొచ్చేడు. రెండుసార్లు బంతి హూప్‌లోకి విసిరి, ఫిల్‌ని రమ్మన్నట్టు చెయ్యూపి బంతి విసిరేడు. ఫిల్ దానికోసమే ఎదురు చూస్తున్నట్టు ఎగిరి బంతి అందుకున్నాడు. చురుకైన కుర్రాడే. బంతి సునాయాసంగా హూప్ లోకి విసురుతున్నాడు. వారిద్దరిమధ్య మాటల్లేవు ఉండీ ఉడిగీ గుడ్, వవ్ లాటి ఊతపదాలు తప్పిస్తే, మనిషికీ మనిషికీ మధ్య ఉదయించే స్పందన తప్పిస్తే.

గోపుకి నామనోవేదన అర్థం కాదు. వాడికి చాలా సులభంగా వచ్చేసింది ఈ జోడుగుర్రాలసవ్వారీ. ఈదేశంలో అడుగెట్టకముందే ఈదేశపు వ్యవహారాలూ ఆహారాలూ కరతలామలకం చేసేసుకున్నాడు సవ్యసాచిలా. మనదేశంలో ఇంగ్లీషుమీడియం స్కూల్లో తెలుగు పలికినప్పుడల్లా చీవాట్లు తింటూ, ఫైనులు కట్టుకుంటూ ఇంగ్లీషు పాండిత్యం సాధించేశాడు. కానీ ఎంత చెడ్డా దేశంలో ఉంటే ఎక్కడో అక్కడ తెలుగు వినిపిస్తూనే ఉంటుంది కనక వాడితెలుగు ఫిల్ ఇంగ్లీషుకన్నా చూపువాసి మెరుగు. నాబాధ – పరాయిగడ్డమీద బతుకు వెళ్ళదీసుకుంటున్నప్పుడు భాషే మన సంస్కృతి. ఇల్లొక్కటే అది మనగల ప్రదేశం. తమ మట్టి కానిచోట తమ అస్తిత్వాలని నిలుపుకోడానికి ఆఖరిమజిలీ. కిటికీలోంచి చూస్తున్నాను వాళ్ళిద్దర్నీ. తమ ఉనికి మరిచి హాయిగా ఆడుకుంటున్నారు. దేశం, భాష, రంగు, నమ్మకాలు, ఆచారాలు – ఏవీ వారికి స్పృహ ఉన్నట్టు లేదు. కేవలం ఇద్దరు పిల్లలు – అంతే! నామనసు అట్టడుగు అగాధాల్లోకి జారిపోతోంది. వీళ్ళిద్దరూ అమెరికన్ బంగారం పండించుకుంటారు. అందుకు సందేహం లేదు. ఉభయభాషాప్రవీణులు కూడా అవుతారు – కనీసం కడుపు మండినప్పుడు!

000

(తొలిసారి ఇంగ్లీషులో నా వెబ్ సైట్ thulika.net లో, సెప్టెంబరు 2002లో bilingual kid అన్న పేరుతో ప్రచురింపబడింది. దీనిమీద ఇతర సైటులలో చర్చలు జరిగేయి. )

# 5. పలుకు వజ్రపుతునక

రాము పుట్టినరోజు. ఉమ పిల్లాడికి చక్కగా తలంటి పోసి, కొత్తబట్టలు తొడిగి, తీపి తినిపించి, వెళ్లి ఆడుకో అంది.

రాము కదల్లేదు.

వాళ్లు అమెరికా వచ్చి ఆరునెలలయింది. విజయ్‌కి మిల్వాకీలో సాఫ్టువేరు ఇంజినీరుగా ఓ పెద్దకంపెనీలో ఉద్యోగం వచ్చింది. వాళ్లఆఫీసరే ఒక పెద్ద ఎపార్ట్‌మెంట్ కాంప్లెక్సు చూపించి, ఆప్రాంతం పిల్లలకి క్షేమం అనీ,

అన్నివిధాలా సౌకర్యం

అనీ చెప్పేడు. వర్తులాకారంలో ఎనిమిది బిల్డింగులున్నాయి ఆకాంప్లెక్సులో. విజయ్‌కీ, ఉమకీ కూడా బాగానే వుందనిపించింది. బిల్డింగులమధ్య ఆటస్థలంలో పిల్లలు ఆడుకోవచ్చు కనక సురక్షితంగా వుంటారు అనుకున్నారిద్దరూను.

ఉమకి హైస్కూలు చదువు అవగానే  పెళ్లి చేసేరు. తీరిచిదిద్దినట్టున్న కన్నూ ముక్కూ తీరు చూసి కోరి చేసుకున్నారు అత్తవారు. సాంప్రదాయకమైన కుటుంబంలో పెరగడంచేతా, చిన్నతనంలోనే అత్తారింటికి వచ్చేయడంచేతా ఉమ అణుకువగా మెలుగుతూ అందరిచేతా అవుననిపించుకుంటూ జరుపుకొచ్చింది దేశంలో వున్నన్నాళ్లూను. అంతేకాక, పుట్టింటా, అత్తింటా కూడా కలకల్లాడుతూ ఇంటినిండా జనమే ఏవేళ చూసినా. అటు పుట్టింట నలుగురు తోబుట్టువులూ, ఇటు అత్తారింట ఆరుగురు - అందరిమధ్యా, ఇంగా ఇరుగుపొరుగులమధ్యా మెసలడంచేత ఏకాంతం అంటే ఏమిటో తెలీకుండా పెరిగింది. రాము పుట్టేవేళకి చిన్నాడబడుచుకి పదకొండేళ్లు. వాళ్లు అమెరికా వచ్చేవరకూ వాడిని ఒక్కక్షణం వదిలేదు కాదా అమ్మాయి. ఆలాటిది ఇప్పుడు ఇక్కడ రెండుగదుల్లో నాలుగ్గోడలమధ్య పోకయినపంజరంలో పక్షిలా వుంది బతుకు. తనకే ఊపిరాడ్డంలేదు. ఇహ రాముమాట చెప్పాలా? “చిన్నత్తని తీసుకొచ్చేసుకుందాం” అంటాడు అస్తమానం, తల్లిఒళ్లో వాలిపోయి.

“చిన్నత్తని ఇక్కడికి తెచ్చేసుకుందాం,” అన్నాడు రాము. పుట్టినరోజుపూటా వాడికోరిక అది.

“అలాగేలే. తరవాత చూద్దాం. చాలాదూరం కదా. ఇప్పటికి వెళ్లి జానీతో ఆడుకో” అంది ఉమ నెమ్మదిగా.

రాము మాటాడలేదు. ఉన్నచోటునించి కదల్లేదు. అవును మరి. జానీ వాళ్లూ ఇంగ్లీషులో మాటాడతారు. రాముకి ఒకటి, రెండు పొడిముక్కలు పట్టుబడ్డాయి కానీ అవి చాలవు వాళ్లతో మాటాడడానికి.

"పోనీ, పద. సుభానుతో ఆడుకుందువుగానీ," అంది ఉమ మళ్లీ వాడిని కదల్చడానికి ప్రయత్నిస్తూ.
సుభాను హిందీ మాటాడతాడు. రాముకి అది కాస్త మెరుగు. అయిష్టంగానే బయటికి నడిచేడు.
ఉమ ఆలోచిస్తూ కూచుండిపోయింది, ఈచిక్కు విడేదెప్పుడో అనుకుంటూ.
ఇంతలో ఫోను మోగింది. ఉలికిపడి, లేచి, ఫోను తీసి "హలో" అంది.
"హై" అంది షామియానా అవతల్నించి. ఆవిడ రెసిడెంటు మేనేజరు. అద్దెలు వసూలు చెయ్యడం,
ఏవాటాలోనయినా ఫానో, స్టవ్వో పాటయిపోతే పనివాళ్లని పిలిపించి మరామత్తులు చేయించడం ఆవిడఉద్యోగం.
"హై" అంది ఉమ మళ్లీ, ఇంకేం అనాలో తెలీక. ఆవిడపిలుపుకి కారణం తెలీడంలేదు. తాను అద్దె బాకీ లేదు.
తమయింట్లో మరమ్మత్తులేవీ లేవు.
షామియానా చెప్పింది, రాము ఒక్కడూ బయట తిరుగుతుంటే చూసిందిట. అలా పిల్లల్ని ఒక్కరినీ బయట,
ఆలనా పాలనా లేకుండా వదిలేయరాదని చెప్పడానికి పిలిచింది.
"వాడు కాశ్మీరావాళ్లఇంటికి వెళ్లేడు," అంది ఉమ.
"లేదు. ఇక్కడ మాయింటిదగ్గర ఒక్కడూ వున్నాడు," అంది షామియానా.
ఉమ "సరే, నేను వెళ్లి చూస్తాను" అని ఆవిడకి చెప్పి, ఫోను పెట్టేసి, బయల్దేరింది కొడుకుకోసం.
రాము తమ పక్కబిల్డింగుకి కాస్త అవతల గొంతుక్కూర్చుని గడ్డిపూలు చూస్తున్నాడు.
ఉమప్రాణం చివుక్కుమంది. వాడిదగ్గరికి వెళ్లి, నెమ్మదిగా, "ఇక్కడ కూర్చున్నావేం? సుభానుయింటికి
వెళ్లలేదా?" అనడిగింది.
వెళ్లేడుట. అక్కడ పిల్లలిద్దరూ దెబ్బలాడుకున్నారు. "నేన్నీతో ఆడను, ఫో" అనేసి రాము వచ్చేశాడు.
"మరి తిన్నగా ఇంటికి వచ్చేయాలి కానీ ఇక్కడ కూర్చోడం ఏమిటి?"
"ఇంటికి తిన్నగానే వస్తున్నాను. ఇదుకో ఈపువ్వులు చూడు. కోసుకోనా?"
ఉమకి చిన్నగా నవ్వొచ్చింది. సరే పద అంటూ ఇంటికి తీసుకొచ్చింది.
తల బద్దలయిపోతోంది. కాఫీ పెట్టుకుందాం అని ఫ్రిజ్‌లో చూస్తే పాలు లేవు. పొద్దున్న విజయ్‌తో చెప్పింది.
అతను రాత్రి వచ్చేటప్పుడు తెస్తానని చెప్పేడు. కానీ అతను ఏరోజూ తొమ్మిదిలోపున రాలేదు ఇంటికి.
ఒక్కక్షణం ఆలోచించి, "పోనీ, నేనే వెళ్లి తెచ్చేసుకుంటే పోలే" అనుకుంది. ఇంటివెనకనించి అడ్డదారంట
వీధిచివరనున్న స్టోరుకి వెళ్తే పావుగంట కూడా పట్టదు.
రాము బయట పిల్లలతో సైకిలు తొక్కుకుంటున్నాడు. కాని మేనేజరుమాట గుర్తుకొచ్చింది. ఇప్పటికే ఆవిడ
నాలుగుమార్లు హెచ్చరించింది. తనకి అది మహా చిరాగ్గా వుంటోంది. తను ఇంట్లో వున్నప్పుడు కూడా
"అన్‌సూపర్వైజుడు" అంటూ ఒకటే సొద. అయిదేళ్లపిల్లాడు ఉరుకులూ పరుగులే కానీ తల్లికొంగు
పట్టుకుకూర్చుంటాడా? అయినా ఎంతమంది పిల్లలు బయట ఆడుకోడంలేదు? వాళ్లతల్లులేరీ? వాళ్లని ఈ

మేనేజరు మహాతల్లి ఇలాగే సతాయిస్తోందా? ఉమకి ఇదంతా గందరగోళంగా వుంది. ఎవరిని ఏమని అడగాలో తెలీడంలేదు. ఆవిడతో ఎందుకొచ్చినపేచీలే అనుకుని, రాముని పిలిచింది స్టోరుకి వెళ్దాం రమ్మని.

"నేను రాను" అన్నాడు వాడు.

"కాండీబారు కొనిపెడతా, రా."

"నేన్రాను. నువ్వే తీసుకురా."

ఉమకి అసలే తలనొప్పిగా వుందేమో, వాడితో వాదించే ఓపికలేక, సరే పదినిముషాల్లో వచ్చేస్తాను కదా అనుకుంటూ గబగబా అడుగులేయసాగింది.

తిరిగొచ్చి, పాలూ నీళ్లూ కలిపి కప్పులో పోసి మైక్రోవేవులో పెట్టబోతుంటే మళ్లీ ఫోను.

"హలో."

"ఇందాకా రాముని చూశాను. నువ్వెక్కడున్నావని అడిగితే తెలీదన్నాడు," అంది షామియానా.

ఈవిడకి మరీ అంత క్షణాలమీద ఈవార్త ఎలా తెలిసిందో అర్థం కాలేదు. "వాడికి తెలుసు. నేను చెప్పే వెళ్లేను," అంది ఉమ నీరసంగా.

"ఏమో మరి. వాడు తెలీదన్నాడు."

ఉమ మరోసారి ఏవో జవాబులు చెప్పుకుని, ఫోను పెట్టేసింది. రాము ఆట ముగించి ఇంటికొచ్చేడు. ఉమ వాడిని దగ్గరికి పిలిచి, "నీతో ఎవరైనా మాటాడేరా?" అనడిగింది.

"హా" అన్నాడు వాడు బుజాలు ఎగరేసి. టీవీ పెట్టుకుంటూ. వాడికి ఆప్రశ్న అనవసరంగా తోచింది.

ఆచుట్టుపక్కల చాలామంది తల్లులకి రాము అంటే ముచ్చట. తల్లినుండి పుణికిపుచ్చుకున్న విశాలమయిన కళ్లూ, పాలబుగ్గలూ, బొద్దుగా ముద్దొస్తూ వుంటాడు. అంచే దారినపోయే ఆడవాళ్లు ఆగి వాడినోమారు పలకరించి, కదాచితుగా ఓ చాక్లెటు చేతిలో పెడుతుంటారు. అంచేత ఎవరైనా మాటాడేరా అంటే మాటాడేరనే అంటాడు. తల్లిప్రశ్నలో అంతరార్థం తెలుసుకునేవయసు కాదుకదా వాడిది. ఉమకి కూడా వాడిని గుచ్చిగుచ్చి అడగాలనిపించలేదు.

ఉమకి రాను రాను మేనేజరువరస మహాసంకటంగా వుంటోంది. అక్కడికీ విజయ్‌తో చెప్పింది. తన ఖర్మకాలి, ఆ చెప్పినసందర్భంలో మాత్రం తనదే తప్పు. వాడిని ఒక్కణ్ణీ వదిలేసి బజారుకెందుకెళ్లేవూ అంటూ అతను తననే కేకలేశాడు. పైగా ఈదేశంలో ఆచారాలు, పద్ధతులు వేరు. మనజాగ్రత్తలో మనం ఉండాలి అంటూ సుద్దులు బోధించేడు.

ఉమ "అది కాదు. నాపిల్లాడిమంచిచెడ్డలు నాకు తెలీవా? నేను అంత నిర్లక్ష్యం చేస్తున్నానా?" అంటూ ఎంత మొత్తుకున్నా వినేనాథుడు లేకపోయాడు.

రాము మధ్యాహ్నం కిండర్‌గార్టెన్‌నించి వచ్చి టీవీలో కార్టూనులు చూస్తున్నాడు.

ఉమ మాసినబట్టలు సంచీలో వేసుకుని పక్కబిల్డింగులో లాండ్రీ చేసుకోడానికి వెళ్లింది. వాళ్లవరసలో మూడు బిల్డింగులమధ్య వున్న బిల్డింగులో వాషర్లూ, డ్రయర్లూ వున్నాయి. రాముకి గట్టిగా చెప్పింది ఫోను తియ్యొద్దనీ, తలుపు తియ్యొద్దనీ,

బట్టలు వాషింగ్‌మెషీనులో పడేసి, రాగానే రాముని అడిగింది ఎవరైనా వచ్చేరా అని.

లేదన్నాడు వాడు.

ఉమకి తనమీద తనకే చిరాకేసింది. తనెందుకు వీళ్లకి భయపడ్డం? తల్లిగా తనబాధ్యతేమిటో తనకి తెలీదా? వీళ్లెవరు తనకి పాఠాలు చెప్పడానికి? ఆవిడ అలా ఆలోచనల్లో వుండగానే, తలుపు తట్టినచప్పుడు అయింది. వచ్చే అంటూ లేచి, తలుపు తీసి చూస్తే, ఎదురుగా మేనేజరు నిలబడి వుంది.

తనని చూస్తూనే, "ఓ, నువ్వు ఇంట్లో లేవనుకున్నాను," అంది మేనేజరు ఒకడుగు వెనక్కేసి.

"ఎందుకనుకున్నావు లేనని?" ఉమ విస్తుపోయింది.

"కాటరీనా చెప్పింది. ఆవిడ వచ్చి, మీఅమ్మ ఏదీ అని అడిగితే, రాము తెలీదన్నాడుట."

ఉమకి ఒళ్లు భగ్గున మండింది. "కాటరీనా ఎవరు?"

"ఎదురుబిల్డింగులో వుంటుంది. నువ్వు చూసే వుంటావు. తెల్లగా, పొడుగ్గా వుంటుంది. ఆవిడే."

"ఆవిడకేంపని ఇక్కడికి రావడానికి?"

"ఏమో, నాకేంతెలుసు? నీస్నేహితురాలనుకున్నాను. రాముని ఒంటరిగా వదిలేసి వెళ్లకు. ఆవిడ కనక సరిపోయింది. ఏదొంగో అయితే ఏంకాను? నీక్కావలిస్తే, మనబిల్డింగులోనే బేబీసిట్టర్లున్నారు," అనేసి గబగబా వెళ్లిపోయింది మేనేజరు ఉమ జవాబు చెప్పేలోపున. అసలు తను జవాబు చెప్పేస్థితిలో లేదు.

మర్నాడు ఉమ రాముని కిండర్‌గార్టెన్‌లో వదిలేసి, బస్టాండులో నిలబడింది లైబ్రరీకి వెళ్లి పుస్తకాలు తెచ్చుకోడానికి.

నిన్నటిసంఘటన ఇంకా ఎదలో ముల్లై బాధిస్తూనే వుంది. ఎంత దులుపుకుతిరుగుదాం అనుకున్నా తనవల్ల కావడంలేదు.

"హలో" అన్న మాట వినిపించి అటు తిరిగి చూస్తే పాలా చిరునవ్వుతో కనిపించింది, ఆవిడభర్త కూడా విజయ్ పనిచేసే కంపెనీలోనే పని చేస్తాడు.

ఉమకి క్షణకాలం పట్టింది ఆవిడని గుర్తు పట్టడానికి. హలో అంది ఆలోచిస్తూనే. వాళ్లు వచ్చినకొత్తలో ఎప్పుడో ఒకసారి కంపెనీపిక్నిక్‌లో కలిశారు. పాలా ఒకసారి ఇండియా వెళ్లిందిట. అంచేత ఆవిడకి ఇండియా అన్నా ఇండియనులన్నా మాచెడ్డ అభిమానం.

"బావున్నావా?" అంది పాలా.

"బాగానే వున్నాను," అంది ఉమ నిరామయంగా.

పాలాకి నమ్మకం కుదరలేదు. ఉమమొహంలోకి తేరి చూస్తూ, “ఆర్యూ ఓకే?” అనడిగింది కంసర్న్‌తో.
ఉమ లోలోపల ఉడికిపోతోందేమో. “నో, ఐయాం నాటోకే.” అంది
వాళ్లెక్కవలసిన బస్సొచ్చింది. ఉమ ఎక్కేవరకూ ఆగి, పాలా కూడా ఎక్కి తనపక్కనే కూర్చుంది. ఉమ ఎందుకో మనసులో మథనపడుతోంది అన్నది స్పష్టమే. ఏవిధంగానేనా ఆమెని ఓదార్చాలని వుంది పాలాకి. తనని తొలిసారిగా పిక్నిక్‌లో చూసినప్పుడే మంచి అభిప్రాయం ఏర్పడిపోయింది ఆవిడకి.
“ఏమయింది?” అనడిగింది చనువుగా.
ఆఒక్కమాటతో ఇంతవరకూ ఆచిపట్టుకున్న బాధంతా వెల్లువలా పెల్లుబికింది, “మనరెసిడెంటు మేనేజరు. ఆవిడకి నేనంటే ఏదో కక్షలా వుంది,” అంది చిరాగ్గా.
“ఏమంటుంది?”
“నేనేదో పిల్లాడిని గాలికొదిలేసి ఊరంట బలాదూర్ తిరుగుతున్నట్టు ఒకటే నస. అయిదేళ్ల పిల్లాడు ఆ వున్న ఒక్కగదిలోనూ నామొహం చూస్తూ ఎంతసేపు కూర్చోగలడు మీరే చెప్పండి. బయట ఆడుకుంటుంటే సూపర్విజను లేదంటూ ఒకటే పోరు ఆవిడ. నాకిక్కడ అత్తా ఆడబిడ్డలూ లేని సరదా తీరిపోతోంది,” అంది ఉమ విసురుగా.
“ఏంటీ?” పాలాకి అర్థం కాలేదు.
ఉమకి నవ్వొచ్చింది. చిన్నగా నవ్వుతూ, “వాడు పదిమంది మధ్య పెరిగాడు. మాది పెద్దకుటుంబం. ఇరవైనాలుగ్గంటలూ వాడెక్కడున్నాడో అనుకుంటూ నేనొక్కదాన్నే ఆరాటపడాల్సిన అవుసరం వుండేది కాదు మాకక్కడ. బావమరుదులపిల్లలూ, మా అన్నదమ్ములపిల్లలే కాక, ఇరుగూ పొరుగూ కూడా ఇంట్లో పిల్లల్లాగే మసుల్తారు రోజంతా. ఎవరెక్కడుంటే అక్కడే తినేస్తారు. మాకు పట్టింపుల్లేవు. ఇక్కడికొచ్చేక, ఒక్కసారి పరిస్థితి మారిపోవడంతో నాకే అయోమయంగా వుంది. పసివాడికెలా వుంటుందో ఊహించుకోండి. నాపిల్లవాడి మంచిచెడ్డలు నాకు తెలీవా? ఈవిడ చెప్పేదేమిటి?”
పాలాకి తెలుగుదేశం, ఉమ్మడికుటుంబాలగురించి కొంతవరకూ తెలుసు. ఆవిడ ఆంధ్రదేశంలో ఆరునెలలు ఉండి చాలా విషయాలే గమనించింది.
“ఆవిడతో మాటాడి చూడరాదూ?” అంది సలహాగా.
“ఏం చెప్పను? చెప్పినా వినేట్టు కనిపించడంలేదు. ఎంతసేపూ ఏవో ఇక్కడిరూల్సే మాటాడుతుంది. నిన్నటికి నిన్న లాండ్రీ చేసుకోడానికి పక్కబిల్డింగుకి వెళ్లాను. రాము ఇంట్లో టీవీ చూస్తున్నాడు. తను వచ్చి చూసిందిట. మీఅమ్మ ఏదీ అంటే వాడు జవాబు చెప్పలేదుట. లాండ్రీకీ, బాత్రూంకి వెళ్లడానికీ కూడా నాకు ఈవిడఅనుమతి కావాలాయేం?”
“అది హెరాస్మెంట్,” అంది పాలా.

ఉమకి ఆమాట కఠినంగా వినిపించింది. "హెరాస్మెంటు అని కాదుగానీ..." అంది మాట సాగదీస్తూ. ఆవిడ తనమీద పడి కొట్టడం, తిట్టడం చెయ్యలేదు కదా.
కాని ఇక్కడ  కొట్టడం, తిట్టడంలో వున్న నాజూకుతనం ఈఅమ్మాయికి ఇంకా అర్థంకాలేదు అనుకుంది పాలా ఉమని అనునయంగా చూస్తూ, ఎందుకంటే, ఈదేశంలో "నువ్వు చవటవి" అనరీదేశంలో. "వేరొకరు మిమ్మల్ని చవటగా గుర్తించడానికి అవకాశం వుంది" అంటారు డొంకతిరుగుడుగా.
ఉమ రెండునిముషాలు ఊరుకుని, మళ్లీ మొదలెట్టింది, "నాలుగురోజులకిందట నాస్నేహితురాలు మీనాని పిలిచి, రాము ఒక్కడూ ఎక్కడయినా కనిపిస్తే తనకి చెప్పమని చెప్పిందిట మనమేనేజరు. అది చాలనట్టు ఆకాటరీనా ఒక్కర్తీ."
"కాటరీనా ఎవరు?"
"మాఎదురుబిల్డింగులో వుందిట. ఎప్పుడేనా కనిపిస్తుంది. ఇద్దరుపిల్లల్ని బేబీసిట్ చేస్తుంది."
"ఆవిడేమంటుంది?"
"ఇదే నోది. రాము వాళ్లింటికి వెళ్లేడుట. మీఅమ్మ ఏంచేస్తోందంటే తెలీదన్నాడుట. ఆఅడగడంసొంపు చూడండి. ఎక్కడుందంటే ఇంట్లో వుందంటాడు. ఏంచేస్తోందంటే ఏమో అంటాడు కదా."
ఆవిడ మరో బేబీసిటింగ్‌కోసం చూస్తోందేమో అనుకుంది పాలా. "అది హెరాస్మెంటే," అంది.
బస్సు ఆగింది. పాలా లేస్తూ, "నాస్టాపు ఇదే. టేక్ కేర్. ఆరెసిడెంటుమేనేజరుతో మాటాడు" అంది, ఉమభుజంమీద నెమ్మదిగా తట్టి.
ఉమ ఆలోచనలో పడింది. అన్నయ్యకాలేజీలో విద్యార్థులు ఒకరినొకరు ఏడిపించుకునేవారు. ఒకొక్కప్పుడు దురంతాలకి కూడా దిగేవారు. తనకి తెలిసినంతవరకూ అదీ హెరాస్మెంటు. కానీ ఇక్కడ హెరాస్మెంటు ఒక సాంఘికన్యాయానికి సంబంధించినవిషయంలా వుంది. పాలా మాటలు విన్నతరవాత. ఇంతకుముందు ఒకసారి మీనా కూడా అదే అంది. ఆవిడ ఈదేశం వచ్చి ఎనిమిదేళ్లయింది. స్థానిక నుడికారం ఆవిడకి బాగానే పట్టుబడింది. "I don't know why but she is on your case. I'd give her a piece of my mind, if I were you," అంది కనుబొమలు ముడిచి.
ఉమ ఇంటికి వచ్చిందే కానీ మనసు మనసులో లేదు. ఇదేదో తాడో పేడో తేల్చుకునేవరకూ తనకి మనశ్శాంతి లేదు. ఆమేనేజరు మహాతల్లికి "ఎ పీసాఫ్ మైండి"చ్చుకుంటే తప్ప దారిలోకి వచ్చేలా లేదు. ఉమ విసురుగా లేచి, రాముని మీనావాళ్లింట్లో వదిలేసి, తిన్నగా షామియానాదగ్గరికి వెళ్లింది. ఆవిడ చిప్పులు నవుల్తూ,, ఏవో కాయితాలు చూసుకుంటోంది. ఉమని చూసి, హాయ్ అంది చిరునవ్వుతో.
"నేన్నీతో మాటాడాలి,"
"నేనిప్పుడు పనిలో వున్నాను. రేపు మాటాడుకుందాం."

"ఇప్పుడే మాటాడాలి"

"ఏవిషయం?"

"రామువిషయమే. నువ్వు వాడితో మాటాడొద్దు. వాడిని నానాప్రశ్నలు వెయ్యడానికి వీల్లేదు. నీకేమయినా అడగాలనుంటే నన్నడుగు. అంతేగానీ వాడికి నీడొంకతిరుగుడు ప్రశ్నలన్నీ అర్థంచేసుకునే వయసులేదు. వాడికేం తెలుస్తుంది?"

చివరిప్రశ్నతో షామియానా ఉలికిపడింది, "ఏంటి నువ్వంటున్నది?"

"మాఅబ్బాయికి ఇంగ్లీషు బాగా రాదు. అందుచేత వాడినేమీ అడగొద్దు అంటున్నాను. నీవరస చూస్తుంటే హెరాస్మెంట్‌లా వుంది,"

షామియానా ఒక్క ఉదుటున ఎగిరిపడి, కుర్చీలో నిటారుగా కూర్చుని, "ఓహ్, నో, నో. హెరాస్మెంటేమిటి, అదేంలేదు. నేను నీమంచికోసమే చెప్తున్నాను. నీకు ఈదేశం కొత్తకదా. ఇక్కడిరూల్సు నీకు తెలీవని చెప్పేనంతే. Good Samaritan law లేదూ. అలాటిదే," అంది గబగబా.

ఆవిడమొహం కళలు తప్పడం ఉమ స్పష్టంగా చూసింది కానీ ఆ "లా" ఏమిటో తెలీదు. అలా అని వదిలేయడానికి ఇది సమయం కాదు. "వాట్ లా? సరే. పద. పోలీసుస్టేషనుకి వెళ్లి అదేదో తేల్చేసుకుందాం. తగువు తీరిపోతుంది," అంది ఉమ దబాయింపుగా.

"నో, నో. పోలీసులమాటెందుకూ ఇప్పుడు? ఇందులో హెరాస్మెంటు ఏమీ లేదు."

"ఏమో మరి. నాప్రాణానికి హెరాస్మెంటులాగే వుంది," అంది ఉమ హుందాగా వెనుదిరిగి.

రాత్రి విజయ్ రాగానే చెప్పాలనుకుంది కానీ అతను చాలా ఆలస్యంగా వచ్చేడు.

మర్నాడు ఉదయం విజయ్ లేచి, ఆఫీసుకి వెళ్లడానికి తలుపు తీశాడు. తలుపుమీద ఒకకాయితం కనిపించింది ఉమపేరుతో. ఇదేమిటో అనుకుంటూ తీసి తనకిచ్చేడు.

తను విప్పి చూస్తూ షామియానా అంది.

"ఏమంటుంది?"

ఉమ అతనికి చదివి వినిపించింది.

డియర్ ఉమా,

నిన్ను బాధపెట్టడం నావుద్దేశం కాదు. ఇది కేవలం ఒక మిసండర్‌స్టాండింగ్. నువ్వు పొరపాటు అర్థం చేసుకున్నావు. అసలు నువ్వంటే నాకు చాలా ఇష్టం. అందుకే నీకు మారూలులు తెలియచెప్పాలని చాలా తాపత్రయపడ్డాను. గుడ్ సమరిటన్‌లాటిదే ఇది కూడా. దయచేసి, జరిగిందంతా మరిచిపోవలసిందిగా కోరుతున్నాను,

- షామియానా.

విజయ్‌కి అర్థం కాలేదు. “అసలేమయింది?” అన్నాడు మళ్లీ మొదటికొస్తూ.

ముందురోజు జరిగినభాగోతం అతనికి వినిపించింది.

“గుడ్ సమరిటన్ లా ఏమిటి?”

“ఏమో, ఓనిముషం ఆగితే అదీ చెప్తాను,” అంది ఉమ చిరనవ్వుతో కంప్యూటరుముందు కూర్చుని.

రెండునిముషాల్లో అది కూడా అర్థమయింది. ఆ గుడ్ సమరిటాన్ లా తనకి వర్తించదసలు. అది డాక్టర్లు విపత్కరపరిస్థితుల్లో ఇచ్చిన ట్రీట్‌మెంటు సరిగ్గా చెయ్యలేదంటూ ఆ పేషంటు ఆడాక్టరుని కోర్టుకి ఈడ్చడానికి వీలులేకుండా చేసిన చట్టం అది. షామియానా తనఅజ్ఞానాన్ని మరొకసారి వాడుకోడానికి ప్రయత్నించింది. స్థానికవిషయపరిజ్ఞానానికున్న బలం ఇదీ అనుకుంది ఉమ.

అయితే, షామియానా తనమీద ఎందుకలా నల్లేరుమీద బండిలా విరుచుకుపడుతోంది అన్నసంగతి అర్థం కాలేదు. కాటరీనాకి మరొక బేబీసిటింగ్ కుదర్చడానికా? కేవలం వాగాడంబరంతో తన ఆధిక్యం ప్రదర్శించుకోడానికా? తను కూడా మరోదేశంనించి వచ్చిందే కనుక ఎవరిమీదో తీర్చుకోలేనికక్ష తనమీద తీర్చుకుంటోందా? - ఎక్కడో తంతే ఏవో రాలినట్టు!

ఇలాటి మనస్తత్త్వాలకి ఏదో పేరు పెట్టి వివరణలివ్వగల మహాపండితులు కూడా ఎక్కడో వుండేవుంటారు. తనకి మాత్రం షామియానాలాటివారిని “లైనులో పెట్టగల”నాలుగు ముక్కలు నేర్చుకోవలసినఅవుసరం అర్జెంటుగా కనిపిస్తోంది.

చిన్నప్పుడు అమ్మ తన్నిగురించి అంటూండేది, “నోట్లో నాలుకలేదు. ఎలా బతుకుతుందో” అని. అవసరాన్నిబట్టి నాలుక అదే మొలుస్తుంది అనుకుంది తృప్తిగా నవ్వుకుంటూ.

(ఎపివీక్లీ.కాం లో ప్రచురితం. జనవరి 2005)

# 6. అత్యంత సన్నిహితులు

వారంరోజులుగా రాళ్ళు పేల్చినఎండ తగ్గుముఖం పట్టినట్టుంది. రాత్రి కుండపోతగా కురిసిన వాన తగ్గి తుంపర్లు మాత్రం పడుతున్నాయి సన్నగా.

ఆస్పత్రిపక్కమీద పడుకుని సుమిత్ర కిటికీలోంచి చూస్తూ ఆలోచిస్తోంది. మామూలుగా అయితే నాలుగున్నర మైళ్ళు నడిచేసును ఇలాటిసమయాల్లో, కాలికి కట్టూ, మెళ్ళో పట్టెడా, పక్కఎముకల్లో పోట్లూ లేకపోతే. కదిలినప్పుడల్లా ప్రాణం జివ్వున లాగేస్తోంది. ఒళ్ళంతా పచ్చి పుండు. అలాగే నెమ్మదిగా రవంత ఓపిక తెచ్చుకుని పక్కకి తిరిగింది కిటికీదిశగా.

000

సుమిత్ర అమెరికా వచ్చి ఏడాదిన్నర అయింది. పోస్ట్ డాక్‌గా వచ్చింది. రాగానే వాళ్ళ ప్రొఫెసరు ఆనతిమీద మరో పోస్టుడాకు ఆవిడకి ఇల్లు చూపించడానికి తీసుకెళ్ళేడు తనకారు తీసుకుని. మొదట యూనివర్సిటీకి దగ్గరయితే బాగుండుననుకుంది కానీ అక్కడ స్టూడెంటుబాబులగదులు ఎలా ఉంటాయో చూసేసరికి కడుపులో దేవినట్టయింది. అమెరికాలాటి గొప్పదేశంలో ఇళ్ళు ఇంత ఛండాలంగా ఉండగలవని ఎవరేనా చెప్తే ఏదో కుళ్ళుబుద్ధితో అలా అంటున్నారని అనుకునివుండును. కానీ తను కళ్ళారా చూసి, కళ్ళు తిరిగి, పదండి అంటూ అక్కణ్ణుంచి గబగబా బయటికి వచ్చేసింది ఇల్లు చూపుతున్న అమెరినబ్బాయితో సహా. యూనివర్సిటీకి దగ్గరయితే గదులు దరిద్రంగా ఉంటాయని తెలిసినతరవాత కొంచెం దూరంలో మరో వాటా చూపించేడతను. అది బాగానే ఉంది అద్దె కొంచెం ఎక్కువే అయినా. బస్సు గుమ్మందగ్గర ఆగుతుంది కనక కారుండాలన్న బాధ లేదు. కారున్నా పార్కింగుబాధ తప్పదు కదా. ఇదే నయం. ఇలా చాలా కారణాలు చూపించి ఆ వాటాలో ప్రవేశపెట్టేసేడు అతను సుమిత్రని.

సుమిత్ర ఆసాయంత్రమే బయల్దేరింది కూరా నారా, పాలూ పళ్ళూ తెచ్చుకోడానికి. బస్సెక్కబోతూంటే పొరుగాయన కనబడి, “కాస్త దూరమే అయినా ఉడ్మన్సులో కూరలూ పళ్లూ తాజాగానూ చవగ్గానూ ఉంటాయని,” చెప్పేడు. ఆయనకీ కారు లేదు. తాను బస్సులో వెళ్ళి టాక్సీలో వస్తానని చెప్పేడు. కావలిస్తే మీరు కూడా నాటాక్సీలో రావచ్చనీ, ఖర్చు పంచుకుందాం అనీ చెప్పేడు. సుమిత్రకి అది బాగానే ఉందనిపించింది. అలా కంతకాలం సాగింది.

త్వరలోనే అది సుఖదాయకం, శాంతిదాయకం కాకుండా పోయింది. పొరుగాయన “ఇదుగో, ఈ పక్కనే,” “ఒక్కనిముషం,” “మరొక్క వస్తువు మరొక్కదుకాణంలో,” ్ంటూ కూరలదుకాణంనుంచి మరో చోటికీ, మరోపనికీ తిరగడం, ఇద్దరికీ అనుకూలమయిన సమయాలు కుదరకపోవడం – ఇలా ఏవేవో ఆటంకాలు

రావడం మొదలయింది. అలాటిరోజుల్లోనే సుమిత్రకి కారోటి కొనుక్కుంటే పోదూ అనిపించింది. ఆమధ్య అమెరికా సందర్శించిన ఓ తెలుగురచయిత్రి అమెరికాలో కారులు కారుచౌక అని చదవడం గుర్తొచ్చింది సందర్భోచితంగా. అయిదువందలడాలర్లు పారేస్తే బంగారంలాటి కారొస్తుంది, అమెరికాలో కారులేనివారిని కానం అంటూ రాసిందావిడ.

అఫ్కోర్స్ కారులేనివారు అమెరికాలో చాలామందే ఉందురు అని సుమిత్రకి అచిరకాలంలోనే తెలిసిపోయింది కానీ కారులు కారుచౌక కావని అంత తొందరగా తెలీలేదు. అదుగో, అలాటి సందిగ్ధావస్థలో ఉండగానే సుమిత్రకి శ్యామల తటస్థపడింది ఓ సాయంత్రం షికారుకెళ్ళినప్పుడు. శ్యామల తనపిల్లల్నిద్దర్నీ, పొరుగింటి పిల్లాడినీ పార్కుకి తీసుకెళ్తోంది.

“అట్ల దౌడు తీయకురా.”

తేటతెలుగుపలుకు విని ఉలిక్కిపడి అటు చూసింది సుమిత్ర.

సుమిత్ర తనవేపు చూడ్డం శ్యామల చూసింది. చూసి చిరునవ్వు నవ్వింది.

సుమిత్ర ఉక్కిరిబిక్కిరి అయిపోతూ, “మీరు తెలుగువాళ్ళా?” అంది.

అమెరికాకి వచ్చినకొత్తలో చాలామందికి అలాగే ఉంటుంది. తెలుగుమాట వినిపిస్తే ఉలికిపడతారు. ప్రాణం లేచొస్తుంది. అలా అయిన వారిపరిచయం అలతికాలంలోనే నువ్వంటే నువ్వనుకునేవరకూ వచ్చేసింది. అది సుమిత్ర ఓ కారు కొనేస్తే పోదూ అనుకుంటున్నసమయం కూడాను.

శ్యామల స్వయంగా కారు నడపదు. వాళ్ళకి కారు లేదు. ఎప్పుడేనా కొనుక్కోక తప్పదు కదా అని కారులమీద చాలా రిసెర్చి చేసి పెట్టుకుందావిడ భర్త సురేష్ ఆఫీసుకెళ్ళిపోయేక, పెద్దపిల్లాడిని స్కూల్లో వదిలేసొచ్చేసేక, చిన్నదాన్ని నిద్ర పుచ్చే రోజు కంప్యూటరులోనూ దినపత్రికలలోనూ చూసి సమాచారం తీసి పెట్టుకుంది.

శ్యామల సుమిత్రకి చెప్పిందేమిటంటే అయిదు వందలకి వచ్చే కారులు మనం నడిపేలా ఉండవు. మనం నడపలేం వాటిని. మనకి నమ్మినబంటు హనుమంతునివంటి కారు కావాలి. కంటికి నదరుగా కాకపోయినా చూడగానే అదిరిపడేలా ఉండరాదు. మైలేజి తక్కువుండాలి. మైళ్ళు ఎక్కువివ్వాలి. …

ఆ తరవాత ఓ వారాంతం శ్యామలే మళ్ళీ పిలిచింది, “పద. ఊరికే చూసొద్దాం. చూడగానే కొనేయాలనేం రూలు లేదు కదా,” అంది. సుమిత్ర కూడా అదొక కాలక్షేపంగానూ ఉంటుంది, విజ్ఞానదాయకంగానూ ఉంటుందిని సరే, పదమంది.

అలా సుమిత్ర కారు కొనడం అయిపోయింది. కారు కొన్నతరవాత సుమిత్రే శ్యామలని పిలుస్తూ వచ్చింది బజారుకీ, పార్టీలకీ, సినిమాలకీ వెళ్ళినప్పుడల్లా.

000

రోజులెప్పుడూ ఒక్కలాగే ఉండవు అన్న సుజనవాక్కుని నిరూపించడానికేనేమో అన్నట్టు శ్యామలావాళ్ళూ ఇల్లు మారేరు. అదీ ఊరికి ఉత్తరంగా ఆరు మైళ్ళదూరం వెళ్ళిపోయేరు మంచి వాటా ఎక్కువ వసతులతో తక్కువ అద్దెకి దొరికిందని.

సుమిత్రకి కారుంది కనక తనే తరుచూ వాళ్ళింటికెళ్ళడం ఆనవాయితీ అయిపోయింది. ఆవిషయంలో సుమిత్ర ఏమీ బాధ పడలేదు కూడాను. రెండోసారి సుమిత్ర వాళ్ళింటికెళ్ళినప్పుడు మాటలసందర్భంలో శ్యామల అంది, “అన్నీ బాగానే ఉన్నాయి కానీ బజారుపనే ఇబ్బంది అయిపోతోంది. మరీ దూరం అయిపోయింది.” సుమిత్ర, “నిజమే. ఎలాగా వచ్చేను కదా, పద. కనీసం ఈవారం కావలసినవి తీసుకొచ్చువుగుందువు గాని,” అంది.

శ్యామల ఒప్పుకోలేదు, “బజారు దాదాపు మీయింటిదగ్గర. అక్కణ్ణించి ఇక్కడికొచ్చి, మళ్ళీ అంతదూరం వెళ్ళి, మళ్ళీ ఇక్కడికొచ్చి నన్ను దింపి మళ్ళీ మీయింటికెళ్ళడం అంటే నీకారు మాటెలా ఉన్నా రోడ్డు అరిగిపోతుంది,” అంది నవ్వుతూ.

సుమిత్ర ఊరుకోలేదు. “ఫరవాలేదులే. పాలవాడుకలా వారం వారం హాజరవుతాననడం లేదు కదా. వచ్చినప్పుడు చేస్తాను. నేన్రానప్పుడు నీతిప్పలు నీకెలాగా తప్పవు,” అంటూ బలవంతం చేసింది.

ఆవిధంగా వారిద్దరిమధ్య రాతకోతలు లేని ఓ ఒప్పందం కుదిరిపోయింది. కానీ శ్యామలకి మొహమాటంగానే ఉంటోంది. అవునూ, కాదూ, ఫరవాలేదూ అంటూ జరుపుకొస్తున్నారు. బజారుకో, పేరంటానికో సుమిత్ర తనని తీసుకెళ్లినప్పుడల్లా కనీసం గాస్ మనీ అయినా తీసుకోమని శ్యామల అడుగుతూనే ఉంది. ఈదేశంలో అది మామూలే, అందులో తప్పు లేదని కూడా చెప్తూ వస్తోంది. ఆఖరికి అవిడని సంతోషపెట్టడానికి సుమిత్ర ఒకటి, రెండుసార్లు ఓ రెండు డాలర్లు పుచ్చుకుంది.

OOO

రోజులెప్పుడూ ఒక్కలాగే ఉండవు అనుకోడానికి ఆస్కారమిస్తూ రెండోసారి మరో చిన్న వ్యధ సంభవించింది. ఊరిపొలిమేరల్లో కొత్తగా ఇల్లు కట్టుకున్న రాధాస్వామినాయుడుగారి భార్య సీతాలక్ష్మిగారు ఊళ్ళో ఉన్న తెలుగువారినందర్నీ పిలిచేరు గృహప్రవేశానికీ, సత్యనారాయణవ్రతానికీను. సుమిత్రని పిలిచి, ఆమాటా ఈమాటా మాటాడి, “మీరు శ్యామలగారిని తీసుకురాగలరా?” అనడిగేరు.

“అలాగేనండీ. దాన్దేముంది. అలాగే పిలుచుకొస్తాను,” అంది సుమిత్ర.

ఆరోజు కుదర్లేదు కానీ మర్నాడు శ్యామలని పిలిచి, సీతాలక్ష్మిగారింటికి వస్తున్నావా అనడిగి, “అయిదుగంటలకి రానా?” అనడిగింది. ట్రాఫిక్ టైం కదా, దూరం కదా అని. అలాగే అంది శ్యామల. అనుకున్నట్టుగానే సుమిత్ర వచ్చింది. శ్యామలా, పిల్లలూ కారెక్కేరు. సురేష్ ఊళ్ళో లేడుట.

సీతాలక్ష్మిగారింట్లో అందరూ గలగల హలోహలోలు చెప్పుకుంటుండగా, ఒకావిడ, "కాంతిమతిగారు వచ్చినట్టు లేదే," అంది.
ఆ పక్కనున్నావిడ, "రాలేదు. ఆమె డ్రైవు చెయ్యరు కదా. వాళ్లాయన ఊర్లో లేరంట," అని వివరించింది.
"మీరెట్ల వచ్చినారు? మీరు గూడ డ్రైవు చెయ్యరు గద," అనడిగింది మొదటావిడ శ్యామలవేపు తిరిగి.
"సుమిత్రతో వచ్చేను."
"మంచామెనే మీకు దోస్తు దొరికినది. నేనయితే అసలు పోడమే మానుకుందు," అని, అక్కడితో వదిలిపెట్టకుండా సుమిత్రవేపు తిరిగి మెచ్చుకోలుగా, "మీకు నిండ ధైర్యం హైవేమీన కూడ డ్రైవు చేస్తురు. నేనయితే డ్రైవు చేస్తును గానీ పిల్లగాండ్ల స్కూలూ, షాపింగూ – అంతే. ఆపైన ఏడకి పోవాలనినా రెడ్డిగారే," అంది. మళ్ళీ శ్యామలతో, "మీరు మాయింటికి ఎప్పుడూ రానేలేదు. షైవారం రండిమీ. సుమిత్రగారూ, మీరున్ను రండిమీ ఆమెను తోడుకొని," అంది తనమంచితనం తెలుపుకుంటూ.
శ్యామలకి ఏం చెప్పాలో తోచలేదు. తెల్లబోయి చూస్తూ ఊరుకుంది. సుమిత్ర చూద్దాంలెండి అనేసి, లేచి కిటికీదగ్గరికెళ్ళి బయటికి చూస్తూ, "మీమందారచెట్టు బాగా పూస్తోందండీ," అంది సీతాలక్ష్మిగారితో.
"ఆ, ఈరోజు ఎండ బాగుంది కదా అని బయట పెట్టేను. కాస్త చల్లబడితే మళ్లీ ఇంట్లోకి తెచ్చేసుకోవాలి. నాకు మొక్కలంటే ప్రాణం. అసలందుకే పెద్ద పెరడుండేలా చూసుకున్నా ఇల్లు కట్టించేప్పుడే.."
"అవునండి. ఈదేశంలో మొక్కలూ, కుక్కలే కదా జనాలకి తోడు," అన్నారు మరెవరో.
కబుర్లు మలుపు తిరిగినందుకు సుమిత్రా, శ్యామలా కూడా హమ్మయ్య అనుకున్నారు స్వగతంలో.
ఆరోజు తిరిగి ఇంటికి వస్తున్నప్పుడు శ్యామల అట్టే మాటాడలేదు. సుమిత్రకి కూడా ఏం మాటాడాలో తోచడం లేదు.
శ్యామలనీ, పిల్లల్నీ వాళ్ళింటిదగ్గర వదిలిపెట్టి, "రేపు పిలుస్తాలే," అన్చెప్పి సుమిత్ర ఇంటికి వెళ్లిపోయింది. వాళ్ళిద్దరిమనసుల్లోనూ వారూ వీరూ చేసిన అనవసర ప్రసంగంతాలూకు నీడలు సన్నగా పరుచుకుంటున్నాయి అసురసుంధ్యవేళ చీకట్లలా. శ్యామల ఏమనుకుంటోందో అని సుమిత్రా, సుమిత్ర ఏమనుకుంటోందో అని శ్యామలా మధన పడుతున్నారు. ఇదమిత్థంగా చెప్పలేని తెరల్లేచేయి వారిద్దరిమధ్యా.

ooo

సుమిత్ర ఎమర్జెన్సీగదిలో మంచంమీద పడుకుని ఉంది కళ్ళు మూస్తూ, తెరుస్తూ. తన ఇక్కడకి ఎలా వచ్చిందో, ఎందుకిక్కడ ఉందో, చుట్టూ ఉన్నవాళ్ళెవరో, వాళ్ళేం అడుగుతున్నారో స్పష్టంగా తెలీడం లేదు. ఏవో ప్రశ్నలు ఒకరితరవాత ఒకరు … తెలీడం లేదు.
ఇంతలో తలుపుదగ్గర అలికిడి అయి అటు తిరగబోయింది కానీ మెడకున్న పట్టెడ తిరగనివ్వలేదు. జివ్వుమంది మెడ.

"కదలకు," ఎవరో హెచ్చరించేరు.
శ్యామల నిదానంగా అడుగులో అడుగులేసుకుంటూ వచ్చి, పక్కన నిలబడి, "ఎలా ఉంది?" అనడిగింది.
"హుమ్. బాగానే ఉన్నాను," అంది సుమిత్ర నీరసంగా.
ఇద్దరికీ కొంచెంసేపు మాట తోచలేదు. శ్యామల నర్సుని అడిగింది వివరాలు.
ఆ అమ్మాయి డాక్టరుతో మాటాడమంది.
శ్యామల సరేనని, సుమిత్రచేతిని సున్నితంగా తనచేతిలోకి తీసుకుని, "రెస్టు తీసుకో. డాక్టరుతో మాటాడి వస్తాను," అని చెప్పి బయటికి వెళ్ళింది.
సుమిత్ర సరేనన్నట్టు కనురెప్పలాడించింది.
అరగంట తరవాత శ్యామల తిరిగొచ్చి చెప్పింది, "డాక్టరు ఫర్వాలేదన్నారు. ఈ రాత్రికి ఇక్కడ ఉండమన్నారు. రేపు ఇంటికెళ్ళిపోవచ్చునేమో అన్నారు."
మరో అరగంట కూర్చుని, "పడుకో, రేపు వస్తాను," అని చెప్పి వెళ్ళిపోయింది. మర్నాడు పన్నెండు గంటలకి వచ్చింది. డాక్టరుతో మాటాడిందిట, ఆయన ఇంటికి తీసుకెళ్ళిపోవచ్చునని చెప్పేరుట. నాలుగు రోజులు బెడ్ రెస్టు కావాలని కూడా చెప్పేరని చెప్తూ, క్లాజట్లోంచి బట్టలు తీసి సుమిత్రకి అందించింది. రిలీజ్ కాయితాలమీద సంతకాలూ, రిలీజ్ పాఠాలు అయేక, సుమిత్ర ప్రతి పేషంటులాగే నాకు రెండు చక్రాలకుర్చీ వద్దని కాస్త గొడవ చేసి, అది హాస్పిటల్ రూల్సని చెప్పించుకుని, దాన్లో కూచుంది.
బయటికి వచ్చేక, "నువ్వు ఇక్కడుండు. కారు తీసుకొస్తాను," అని, వెళ్ళి పది నిముషాల్లో వచ్చింది కారు తీసుకుని. సంచీ ట్రంకులో పడేసి, ముందుసీటు తలుపు తీసి, సుమిత్రకి చెయ్యందించి, కూర్చున్నతరవాత సీటుబెల్టు పెట్టి, అటు తిరిగొచ్చి డ్రైవరుసీటులో కూర్చుంది.
సుమిత్ర కారు బయల్దేరేక, నిన్నట్నుంచీ తనని వేధిస్తున్న, తాను అడగాలనుకుంటున్న ప్రశ్న అడిగింది, మరింక ఉండబట్టలేక, "నీకెలా తెలిసింది?"
"వాళ్ళ రికార్డులో అత్యంతసన్నిహితులు [next of kin] పేరు ఉంటుంది కదా. ఎప్పుడో నువ్వొచ్చినకొత్తలో ఇచ్చింది. అది చూసి వాళ్ళు నన్ను పిలిచేరు. ఒక్కదానివి మీఇంట్లో ఎలా ఉంటావు. మాయింటికెళ్దాం," అంది శ్యామల నిష్కల్మషంగా. సుమిత్ర కాదనలేదు.
ఇద్దరిమనసులూ తేలిక పడ్డాయి. ఆస్పత్రినించి వేరుగా తమయింటికే తీసుకెళ్ళింది శ్యామల సుమిత్రని. సుమిత్ర కారు దిగుతుంటే ఆంటీ అంటూ పిల్లలు పరుగెత్తుకొచ్చి ఒక్క ఉదుటున మీద పడబోయేరు. సురేష్ వాళ్ళని పట్టుకుని ఆపి, "జాగ్రత్త, నెమ్మదిగా దిగండి," అంటూ ఆప్యాయంగా ఆహ్వానించేడు.

000

(ఆగస్టు 2007 సిలికానాంధ్ర వారి సుజనరంజని ప్రత్యేకసంచికలో ప్రచురితం.)

# 7. అక్షరం పరమం పదం

అక్షరం అంటే క్షరము కానిది అని అర్థంట. అంటే శాశ్వతంగా వుండిపోయేదని, దానికి ఏనాటికీ చెరుపూ, మరుపూ వుండవనీనుట.

యస్సెల్సీ డింకీ కొట్టింతరవాత, సెప్టెంబరులో అయిందనిపించుకుని మరుసటేడు కాలేజీలో చేరేవరకూ మాఅమ్మ వెనక తచ్చాడుతూ నేను నేర్చుకున్న పాఠాలు చాలా వున్నాయి.

వాటిల్లోముఖ్యంగా చెప్పుకోదగ్గది కూరగాయలమ్మి సంద్రాలుదగ్గర నేర్చుకున్నవి ప్రతిరోజూ తెల్లార్తూనే నవనవలాడే వంకాయలూ, నూగు నూగు నేత బెండకాయలూ, గోరాన్తే కమిలిపోతాయమ్మాలాటి హెచ్చరికలతో ఆనపకాయలూ నిండినతట్టతో ముంగిట్లోకొచ్చి, హావభావాల్తో రసవత్తరంగా, సంద్రాలు వినిపించిన కథలు. నేను స్కూల్లో నేర్చుకున్ననీతులకన్నా స్థిరస్థాయిగా నా ఎదలో పాదుకుపోయినవి ఆ సంద్రాలు సుభాషితాలే.

'ఏటుండిపోతాత్తల్లీ'అంటూ మొదలెట్టి, తాను కిరస్తానీ పాదరీమాటల్నమ్మి ఆళ్లలో కలిసిపోయి, అక్కడ వాళ్లు ఒరగబెట్టిందేం లేదని తెలుసుకుని, తిరిగొచ్చి, అత్తమ్మచేత మొహంవాచేలా చీవాట్లు తిని, పోసపొమ్మనుకుని, అందిన బస్సెక్కేసి, సింవాచెలంసివార్ల టీకొట్టు జీరుసాయిబుపంచన చేరి పొద్దు పుచ్చుకుంటున్న వైనం నాకు ఏరోజుకారోజు కొత్తే.

ooo

సంద్రాలు జాలారాళ్లింట పుట్టింది.

"చేపలమ్ముకోకుండా, కూరలమ్ముకుంటున్నావేమిటి?" అనడిగానోరోజు. దానికంత పనస చదివింది ఈదురుగాలిలో పూలతీవెలా వూగిపోతూ.

"అదేనమ్మగారూ, పిదపకాలం పిదపబుద్ధులు. మావోడొట్టుకొచ్చిన సేపలమ్ముకొని, కమ్మంగ వొండి ఆడికింతెట్టి నానింత కతికి మారాజుల్లా బతికినోల్లం. నలుగురు బిడ్డల్ని కంటి. ఆ దొరబాబొచ్చి వూదరెట్టేసినాడూ, "మిమ్ముల్ని ఈపెద్దిల్లోల్లు సరింగ సూసుకోట్నేదూ, మీరూ మడుసులే గంద, మీకైన ఆరికైన గిల్లితే రగతంవే గంద కారత్తది, ఆల్లకేం పాలు గారవు గంద, మీరూ ఆల్లూ అందురూ సమానంవే గంద, మిమ్ముల్నేల ముంగిట్లోకి రానీరూ" అంటా. ఆమీన "కిరస్తవంవుచ్చీసుకో, మేంవణ్ణంఎడతం, గుడ్డలెడతం, మాఇల్ల మాసరిసమంగ కూనోసెట్టుకుంటం," అంట వూ౹ ఊదరెట్టీసినాడు. మాం గుబగుబలాడిపోయ్నం. నామగోడు సేన్రాను పొమ్మన్నడు. మాఅత్తమ్మ ను పోతే పో, పోరగాల్లని తీసికెల్తానికీల్లేదంది.

ఆడివాక్కుల్నమ్మి నాను పోతిని. తీరా సేస్తే ఏటుందక్కట మాత్తరం. మీఇల్ల మీ ఇల్ల సేసుకునే దాసీకంపే ఆడికీ సెయ్యనంవయిందంతే. ఏరాయయైతేనేం పల్లూడకుంతానికని..."

నాకు సంద్రాలు మాటలు సగం అర్థం అయేయి, సగం కాలేదు. ఆ వాగ్ధార చూస్తే మటుకు, "ఏబళ్లో చదువుకున్నావు, చెప్పు, సేనూ అక్కడే చదూకుంటాన"న బుద్ధేసేది నాకు.

"నాస్పెపతన్న యినుకో. నివ్వు సాచ్చాత్తు మాలచ్చి అస్మంటి ఆతల్లికి బుట్టేవు. ఆయమ్మని మార్సేస్కోగలవా? సేవు. మీయమ్మే మీయమ్మ. మరేయమ్మా మీయమ్మ గానేదు. అసుమంటిదే మతఁవూని. ఎక్కన్నో ఏదో వున్నాదని పరువులెత్తితే ఏటున్నది, ఏంసేదు, దిబ్బ. ఉన్నదాన్లసే సుకం సేసుకోవాల. అద్గదీ నిజింపైన తెలివి. నివు గొప్ప సదూలు సదూకుంతన్నవు. ఇమానంలో ఏలండనో వమిరికవో ఎల్పోతవు కడుపు సేతట్టుకుని."

నాకు నవ్వొచ్చింది కాని కడుపు సేతట్టుకుని అన్నమాటతో కాస్త ప్రాణం చివుక్కుమంది.

"ఎలా తెలుసు?" అన్నాను.

"అదంతా నాకెరికే. నాకన్నీ తెలస్తయ్ బుల్లెమ్మా. ఈతట్ట సెల్లిపోనంక, అప్పల్సాంవి కొట్టుకాడ కూసుంట బస్సుకోసం. ఆడ జనాలు వూసులాడుకుంతరు, వాలిండియరేడియనాగే," అంది కొంటెగా నవ్వుతూ.

సంద్రాలుకి నలుగురు పిల్లలు. వాళ్లని బళ్లో వెయ్యలేదేం అన్నాను మరోరోజు.

"మాకేల సదుగుల్తల్లీ. ఆబోగాలన్నీ తమనాటోరికి తగుతవి. రెక్కాడితే గాని డొక్కాడని బతుగులు మాంవి. డొక్కలోకి సంగటెల్తేనే రెక్కలాడే పేనాలు. ఆల్లు నలువురూ నాల్రూకలెస్తే, నానో నాలుగట్టుకొస్తె తలో ముద్దా మింగుడడతది. సేకుంటే అందురం పస్తులే. మాబిడ్డలే మాకు ఆస్తి బుల్లెమ్మా," అంది.

విద్యలేనివాడు వింతపశువు, విద్యవలన కలుగు వినయంబు అంటూ చదవడానికి నాకు నోరు రాలేదు. తాను మతం వుచ్చుకున్నంతమాత్రాన తనబతుకేం రంగేళీ బతుకయిపోలేదనీ, అధికంగా ఒరిగిందేం లేదనీ, జ్ఞానోదయం అయి ఇంటికి తిరిగొచ్చేసింది సంద్రాలు. కాని అప్పటికే దానిమొగడు మరో జూనియర్ సంద్రాలుని తెచ్చేసుకుని సెటిలయిపోయేడు.

దాంతో కనిపించిన బస్సెక్కేసి, సింహాచలం సివార్ల దిగిన సంద్రాలుకి జిగినీసాయిబు తగిలేడు. "నాకింత గంజి కానొయ్యి, నీకింత నోటిస్తాను" అన్నాడు వాడు. తలూపింది సంద్రాలు. అయితే సంద్రాలుకి ఆ టీకొట్టు వెనక కమ్మలగుడిసెలో కూచుని జిగినీసాయిబు తెచ్చిన డబ్బుల్తో కాలచ్చేపం సేసుకుంటా కూకోడం నచ్చలేదు. అంచేత, దొడ్లో నాలుగు పాదులు పెట్టి, ఆకూరలు నాలుగు వీధులంట తిరిగి అమ్ముకు, వచ్చిన డబ్బుల్తో "నానూ ఓమడిసినేనని" గర్వంగా తలెత్తుకు తిరుగుతున్నాది.

ooo

"ఏటుండిపోతాదంటూనే మళ్లీ ఈతాపత్రయం అంతా ఏమిటి?" అన్నాను మరోరోజు నవ్వుతూ.

కూరలవ్యాపారం ఎందుకూ, టీకొట్టుమీద వచ్చిన ఆదాయం ఇద్దరికీ సుష్టుగా సరిపోతుంది గదా అన్నాట్ట జిగినీసాయిబు. అందుకని అడిగానామాట.

"మడుసులం గంద. ఆపరమాతుముడేటి సెప్పినాడూ నీడూటీ నువ్ సేసుకుంట వో. ఆపైయవ్వారంవంత నాన్ సూసుకుంతనన్నడు గంద. అంటే ఏటీ. నువ్వు మడిసి జలమెత్తనందుకు నీకో దరమం వున్నాది. అది నువ్ సేసుకోవాల. అంతే గానీ అదేటీ, ఇదేటీ అంట లాపాయంటులు నాగరాదు," అంటూ లాపాయింట్ పాఠాలు చెప్పేసింది నాకు ఏకటాకీని.

000

అర్ధశతాబ్దం దాటినా సంద్రాలు భాషణలు నామనసులో చెక్కు చెదరకుండా అలానే వున్నా.యి ఈనాటికీనూ నిన్నో మొన్నో విన్నట్టు..

నీర్కావిపంచెలా వెలవెలబోతున్న నింగీ, ఆనింగిలోకి తొంగి చూస్తూ, బోడికొమ్మల్తో అస్థిపంజరాల్లా వాకిట్లో నిలబడ్డ మేపుల్ చెట్లు, మీద పడుతున్న మంచుతో బూడిద పూసుకుని తపోనిష్ఠలో వున్న పరమయోగుల్లా నిలబడి కాలగతికి అద్దం పడుతున్నాయి.

చెప్పుకోదగ్గ కారణంలేకుండానే నామనసు మొద్దు బారిపోయింది. వేడి వేడి పకోడీలు సేవిస్తూనో, వెచ్చగా ముసుగుదన్ని ఏలోకాల్లోకో తేలిపోతూనో పొద్దుపుచ్చుకోవలసిన సుందర సమయం. సంద్రాలు గుర్తొచ్చింది ఏటుండిపోద్దల్లీ అంటూ, అసందర్భంగానే.

అమెరికాలో దిగడి ముప్పై ఏళ్లు దాటుతోంది. గత ఇరవై యేళ్లలోనూ ఏడు కంప్యూటర్లు అయేయి. అయిదున్నర ఇంచీల ఫ్లాపీలనుంచి అరచేతిలో ఆమలకములవలె ఇమిడిపోయే సీడీలదాకా సాంకేతిక ఇంద్రజాలంలో పడి కొట్టుకుపోతున్నాను ఏటివాలులో ఓటుపడవలా... ఏటా పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న "న్యూ అండ్ ఇంప్రువుడు" గాడ్జెట్టుల అడుగులకి మడుగులొత్తుతూ, నాతిచరామి అనుకుంటూ నడవకపోతే నా రాతలు కాలదోషం పట్టిపోతాయేదేమోనని భయం. అయిదురకాల తెలుగుఫాంటులు మార్చాను నిత్యనూతనంగా వచ్చిపడుతున్న సిస్టములవత్తిడికి గిలగిల్లాడుతూనే.

ఈవైరాగ్యానికి అసలు కారణం నిన్న నా బాసురుడి సతాయింపు. అ-నుంచి క్షవరకూ తెలుగు నేర్చిన ఓఅమెరికను ఓచిన్న కంపెనీ మొదలుపెట్టాడు భారతీయభాషలలో వున్న సాహిత్యాన్ని డిజిటలైజు చేసి, సర్వాంగసుందరంగా ఫార్మాటింగు చేసి, చక్కని ముఖపత్రంతో శాశ్వతంగా పదిలపరుస్తాం అంటూ. ఆయన మార్కెటింగ్ చూసుకుంటానన్నాడు. నాకు బిజినెస్ బుర్ర లేనందున నేను అతని దగ్గర చేరేను. నాపని పైన చెప్పిందంతా చెయ్యడం.

తెలుగువాళ్లు బోలెడు డాలర్లు గుమ్మరించి మాచేత ఈపని చేయించుకోడం ఎంచేతో నాకు అర్థంకాదు. దేశంలోనే తెలుగువారిచేతే చేయించుకోవచ్చు కదా. అవుట్సోర్సింగులో ముచ్చట్లు అనుభవించడానికా? అలా చేస్తే కానీ ప్రపంచీకరణ అనిపించుకోదనా? తెల్లవారిచేతిలో తెలుగు మరింత తెల్లమవుతుందనా? ఏమో మరి. ఇంతకీ నాకు వచ్చిన తెలుగుపుస్తకంలో భాష పరమఘోరంగా వుంది. "ఆయన పచ్చి శాకాహారము తినిపించబడవలసిన అవుసరము కలిగెను. స్నీనము చేపించుటకు ఇతరులు లేక పరివేషకులు వస్తువులు తెచ్చి ఇచ్చుడకు కవలసిన వస్తు సందాయంనకు వారు దుకానములో తీసుకొనిరాకుండుటకు..." ఇలా తలా తోకా లేని వాక్యాలూ, ముద్రారాక్షసాలూ పుష్కలంగా వున్నాయి.

నేను బాసుబాబుకి ఆమాట చెప్పి, "తప్పులు దిద్ది పంపమని అడగండి" అన్నాను.

దానికి ఆయన కోపం తెచ్చుకోకుండా, స్వరం బాగా తగ్గించి, కాస్త ముందుకి వంగి, "నీకు ఇచ్చినపని చెయ్యడమే నీవంతు. మనం వారిని తప్పులు పట్టరాదు" అన్నాడు, మళ్లీ ఏం అనుకున్నాడో, "నేను వాళ్లని అడుగుతాను, ఈలోపల నీపని మొదలుపెట్టు" అన్నాడు.

మంచి కాపీ వచ్చింతరవాత ఒకేసారి చెయ్యొచ్చు కదా అంటే అతనికి నచ్చలేదు. ఆయనగారి నిజబాధ ఆ తప్పులు నేను పట్టేననేమో. నేనేదో నాపాండిత్యం ప్రదర్శించేస్తున్నాననకుంటున్నాడేమో.... మిడిమిడి భాషాపరిజ్ఞానంగలవారితో మామూలుగా వచ్చే చిక్కే ఇది.

అంతర్జాలంలో తెలుగు ముంగిళ్లు చూస్తూ కూచున్నాను. తెలుగుపుస్తకాలన్నీ డిజిటలైజు చేస్తున్నారుట, వాటిని శాశ్వతం చేసి కాపాడుకోడానికి. నాకు నవ్వొచ్చింది. నేను కూడా ఆదోవలోనే నడుస్తున్నాను మరి. అసలు మనదేశంలో 19వ శతాబ్దంలో ముద్రణ మొదలు పెట్టినప్పుడు వాళ్లవుద్దేశ్యం మన జ్ఞానసంపద ఎక్కువమందికి అందుబాటులోకి తీసుకురావాలని. శాశ్వతంగా వుంటుందన్నది రెండోకారణం. ఇప్పుడు ఆ అభిప్రాయానికి తకరారొచ్చింది. - కాయితాలు చెదలుతినేస్తాయనీ, వానల్లో వరదల్లో ఆనవాలు లేకుండా కొట్టుకుపోతాయనీ డిజిటలైజు చేస్తున్నారు. అలా చేస్తే దేశంలోనే కాక ఖండఖండాంతరాలకి విస్తరిల్లుతాయనీ, అవి పరమ శాశ్వతం అయిపోడానికి మరి ఇహ ఢోకా లేదనీ అభిజ్ఞుల అబిప్రాయం.

నిజంగా??

నాకు దిగులు ముంచుకువస్తోంది. ...

నేను కూడా కంప్యూటరుయుగం వచ్చేసింది కదాని నాకథలు శాశ్వతం చేయడంకోసం నీలితెరకెక్కించడం మొదలుపెట్టేను.

ముందు మరోమాట చెప్పాలి. నేను ఇరవై ఏళ్లకిందట. ఓసంస్కృతం నేర్చిన అమెరికనుప్రొఫెసరుగారు తయారుచేసిన తెలుగుఫాంట్స్‌తో టైపు చేసి ఐదుంబావు అంగుళాల ఫ్లాపీలమీద పదిలపర్చుకుంటూ వచ్చేను. ఆఫాంట్స్ వాడకం అట్టే కాలం నిలవలేదు. కంప్యూటరు అప్‌గ్రేడు చేసుకున్నప్పుడే పోతన

ఫాంటులు వాడడం మొదలుపెట్టేను. ఆతరవాత శ్రీఫాంట్స్ బావున్నాయని ఓసుమిత్రుడు ఇండియావెళ్లినప్పుడు కొనుక్కొచ్చి ఇస్తే, అవి వాడేను. మధ్యలో ఇంకేవో వాడేను. ఐందుబావుఫ్లాఫీలు పోయి మూడున్నర అంగుళాల ఫ్లాపీలొచ్చేయి.

ఇప్పుడు నాకంప్యూటరులో అసలు ఫ్లాపీడ్రైవే లేదు. దానికోసం వేరే ఫ్లాఫీ డొక్కు కొనుక్కోమన్నారు. నేను కొన్న శ్రీఫాంటులతో పీడీయఫ్ చేసినకథలు ఈనాడు కొన్ని సరికొత్త కంప్యూటరులు అపార్థం చేసుకుని అక్షరాల్ని గజిబిజిగా ఆలికేస్తున్నాయి బాబిగాడు వేసే ముగ్గుల్లా.  ప్రోగ్రామరులు వున్న ఫాంటులని శాశ్వతంగా వాడే ప్రయత్నం చెయ్యడానకి బదులు కొత్త కొత్త ఫాంటులు రాసిపారేస్తున్నారు. ఇప్పటికి అయిదు రకాలు వాడిన నన్ను ఈసాంకేతికులు మరో ఫాంటు రాసేం --దీనికి తిరుగులేదు, దీనికిదే సాటి, వాడి చూడండంటున్నారు.

నాబాధ - నాపాత కథలు ఎంతకని మళ్లీ మళ్లీ టైపు చేసుకుంటూ కూర్చోనూ? నావల్ల కాదు.

చిన్నప్పుడు ఎంతో ఆసక్తిగా బట్టీపట్టిన గీతం పాడుకోవాలనిపిస్తోంది. "ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు, … చక్రవర్తి అశోకుడేడీ, … జగద్గురు శంకరుండేడీ". నిరుడుకురిసిన హిమ సమూహములని వదిలిపెట్టి, పద పదమంటూ ముందుకు తోసుకుపోయాడు శ్రీశ్రీ మరోప్రపంచానికి …. పదికాలాలపాటు నిలబెట్టుకుని తరతరాలా వారసత్వపుహక్కుగా అనుభవించవలసిన మిద్దెకి ఉద్వాసన చెప్పి, నేను ఎడతగని న్యూ … ఇంప్రూవ్డ్ … ఎండ్ అల్టిమేట్ … అనుక్షణం మారిపోతున్న సంస్కృతికి దాసోహం అనుకుంటూ, నిత్యనూతనమైన వింతలకోసం, నాలుగుక్షణాల మెరుపులకోసం ఆత్రపడిపోతూ దినములు గడుపుతున్నాను.

ఏది శాశ్వతం అనుకుంటూనే ఏదో ఒకటి చెయ్యకపోతే పొద్దు పోదు. ప్రతివాణ్ణీ జీవితంలో పదిహేను నిముషాలపాటు కీర్తికాంత వరించి తీరుతుందంటారు అమెరికనులు. అందులో శాశ్వతం ప్రస్తావన లేదు. నిరుడు కురిసిన హిమసమూహములూ, నిన్నటి వార్తలూ పట్టించుకునే ఓపికలేదు. .. మనబతుకులు ఇవాళా, రేపటితో ముడిపడి వున్నాయి. నాడూటీ నేను చేసుకుంటూ పోవాలి. అంతే.

సంద్రాలు ఎదురుగా నిలబడి ఏటుండిపోత్తల్లీ అంటూ ఎత్తిపొడిచినట్టయింది. సంద్రాలు నోట వెలువడిన మాటే "అక్షరం" అనిపిస్తోంది ఈనాటి వెబ్‌జాలంలో చిక్కుకుపోయిన నాకు. నాడూటీ నేను సేస్కుంటా పోవాల. అంతే. తెలివొచ్చింది. ఆ చెత్తపుస్తకం తీసుకుని వున్నదున్నట్టు టైపు చెయ్యడం మొదలెట్టాను. మాబాసుకి కావలసింది నావేళ్లు కీబోర్డుమీద తకతకలాడుతున్నాయా లేదా అన్నదే కదా.

000

(నామాట- ఇది ఎందుకు రాసిందన్న సందేహం కొందరికైనా రాకమానదు. ఆసందేహనివృత్తికోసం -- మనసంస్కృతిలో వున్నచోట వుండడం, వస్తువు పదికాలాలపాటు మనడం కోరుకుంటారు. ఆధునికయుగంలో కదలిక పురోగమనానికి సంకేతం. కదుల్తూంటే పైకి పోతున్నట్టే లెక్క [moving is moving up]. పురోగమనంపేరుతో ఒకొక్కప్పుడు మనం పనికిమాలినపనులు కూడా చేస్తున్నామేమో, చేయాల్సొస్తుందేమో అనిపిస్తుంది నాకు. - మార్చి 2008. ఈమాట.కాం లో ప్రచురితం.)

# 8. శివుడాజ్ఞ

ఆరోజు మంగళవారం. శివరావుపూజకి దీపాలు, పువ్వులూ, కర్పూరం సమకూరుస్తోంది సుమన. కానీ మనసంతా మరోచోట వుంది.

రెండు రోజులక్రితం అత్తయ్యగారు మిల్వాకీనించీ ఫోన్ చేశారు ఇక్కడికి వచ్చి మూడు రోజులయిందనీ, మరో వారం రోజులు వుండొచ్చనీ. ఆమాట  తెలిసిందగ్గర్నుంచీ ఆమెని మళ్లీ చూడాలని ఒకటే తహతహగా వుంది. ఆమాట శివరావుకి చెప్పింది కూడాను. అంతకుముందు అత్తయ్యగారు న్యూయార్కునించి ఫోను చేసినప్పుడు కూడా చెప్పింది అతనికి.

“అలాగే. తప్పకుండా ఆవిడని చూడ్డానికి వెళ్దాం” అన్నాడతను. అతనికి తెలుసు ఆ అత్తయ్యగారంటే సుమనకి ఎంత అభిమానమో. పైగా దేశం వదిలి ఇంత దూరం వచ్చేక ఆవూరి కాకి కనిపించినా తుళ్లిపడుతుంది హృదయం. దూరాలు మనుషుల్ని ఎంత దగ్గర చేస్తాయో తెలియాలంటే కొన్నాళ్లు విదేశీవాసం చెయ్యాలి. అందులోనూ అమెరికా అయితే మరీ తేలిక అయినవారికోసం ఆర్తి స్పష్టం కావడానికి.

శివరావు స్నానం చేసి, బట్టలు మార్చుకుని దేవీస్తవం చదువుకుంటూ గదిలోకి వచ్చేడు. అమెరికా వచ్చి ఆరేళ్లయింది. మూడుగదుల వాటా తీసుకుని అందులో ఒకగది పూజగదిగా అమర్చుకున్నారు. సుమనకి అంత పట్టింపుల్లేవు కానీ శివరావుది నిప్పూ నీళ్లూ కడిగే వంశం. నిత్యపూజలవల్లే తాను ఇంత అభివృద్ధి సాధించేనని గట్టిగా నమ్ముతాడు అతను.

“శనివారం ఏమయినా పనుందా?” అనడిగింది సుమన తనలో తను మాటాడుకుంటున్నంత నెమ్మదిగా.

శివరావు దేవీస్తవం ఉచ్చరిస్తూ తలూపేడు అవునో కాదో తెలీకుండా.

సుమన వూరుకుంది. ఆసమయంలో అడగడం తనదే పొరపాటు. జవాబులు వచ్చే సమయం కాదది. కానీ మనసు ఆచుకోలేక అడిగింది. నిజానికది ప్రశ్న కాదు. మొన్నటినించీ సూచా వాచా తెలియజేస్తూనే వుంది రానున్న శనివారం మిల్వాకీ వెళ్తే బాగుంటుందని.

చిన్నప్పుడు చల్లటి సాయంసమయాల చక్కని కథలు చెప్పిన అత్తయ్యగారు మిల్వాకీ వచ్చేరు. అంతకుమున్ను న్యూయార్కులో వుండగా ఆవిడే ఫోను చేసి చెప్పేరు. అంతకుపూర్వం కథ ఏమిటంటే- అత్తయ్యగారు కాలిఫోర్నియాలో వున్న కొడుకు రాంబాబుని చూడ్డానికి వచ్చారు. అక్కడినించీ న్యూయార్కు వచ్చేరు కోడలి అన్నగారు ఈస్టుకోస్టు చూపిస్తాను రమ్మని పిలిస్తే.

ఆకోడలి అన్నగారి ఇంటిలో తెలుగుజ్యోతి పత్రిక తీసి చూస్తూంటే సుమన పేరు కనిపించింది. ఆవిడ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిపోతూ "అయ్యో, ఈ పిల్లిక్కడుందా? మాఅమ్మాయిలాటిదే. ఇంతప్పటినుండీ తెలుసు నాకు ఈ పిల్లని. మాయింటికి రోజు వచ్చేది," అన్నారావిడ ఎడంచేయి గాలిలో మూడడుగులు ఎత్తి చూపుతూ.

ఆవెంటనే ఆయింటాయన చకచకా ఇంటర్నెట్టెక్కేసి, జాలంలో గాలంవేసి సుమన అజా పజా ఎక్కలాగి, అక్కడ కనిపించిన నెంబరుకి ఫోను చేసేడు.

సుమన ఇంట్లోనే వుంది. ఫోను తీసి హలో చెప్పింది.

వెంటనే అవతలినుండి "మీచిన్ననాటి నేస్తం ఇక్కడున్నారు, వుండండి ఫోను ఆవిడకి ఇస్తాను" అని సుమన జవాబుకి ఎదురుచూడకుండానే అవతలివేపు మాయమయిపోయేడు.

సుమన ఈ స్నేహితురాలెవరయి వుంటారు చెప్మా అనుకుంటూ తికమక పడుతూ, ఎదుటనున్న గోడా, ఆపక్కనున్న కిటికీ, ఆకిటికీలోంచి కనబడుతున్న చెట్టూ, చెట్టుమీద పిట్టా చూస్తూ కూచుంది ఫోను పట్టుకుని అయిదు నిముషాల పాటు. గోదారీ గట్టుందీ పాట కూడా గుర్తొచ్చింది. గోదావరి కనపళ్లేదు కానీ ...

మరో అయిదు నిముషాల తరవాత మళ్లీ ఆయనే వచ్చి, "హలో సారీ" చెప్పి, "ఉండండి ఇప్పుడే వస్తున్నారు" అని చెప్పి మళ్లీ ఫోను బల్లమీద పెట్టేశాడు.

సుమనకి అయోమయంగా వుంది. తన స్నేహితులందర్నీ పేరు పేరునా తలుచుకుంది కానీ ఎవరా అన్నది తెగలేదు. తన స్నేహితులయితే తనకి ఆర్నెల్లముందే తెలిసేది. వాళ్లక్కడ ఇండియాలో వీసా అందుకోగానే, ఇంకా అంతకుమున్నే తనకి ఆఘుమేఘాలమీద వార్త అందజేసి వుండేవాళ్లు,

ఆఖరికెలాగైతేనేం, ఫోనులో హలో వినిపించింది. రవంత పెద్దతనం వుంది గొంతులో.

సుమన "హలో" అని "ఎవరండీ" అంది సందేహిస్తూ.

"నేనమ్మా, అత్తయ్యగారిని. గుర్తున్నానా? రోజు సాయంకాలాలు మాయింటికి వచ్చేదానివి."

"అత్తయ్యగారా! అయ్యో మిమ్మల్ని మర్చిపోతానా, ఎప్పుడొచ్చారు? ఎక్కడున్నారు?" అంది హడావుడిగా ముందు ఉలికిపడి, తరవాత ఎగిరి గెంతేసినంత పన్చేస్తూ. కాళ్లు భూమ్మీద ఆన్లేదు మరింక.

"అవునమ్మా. రాంబాబు ఇప్పుడు కాలిఫోర్నియాలో వున్నాడు కదా. ఇల్లు కొనుక్కున్నాడు. గృహప్రవేశానికి వచ్చేను." అన్నారు. ఆవిడ కూడా ఆపిల్ల తనని గుర్తు పెట్టుకున్నందుకు పొంగిపోయారు.

"బాగుందండీ. మీ గొంతు వింటుంటే నాకు మళ్లీ మీ వంటింటిలో కూర్చున్నట్టే వుంది," అంది సుమన.

"నువ్వెక్కడున్నావు. ఇక్కడికి దగ్గరేనా?" అని అడిగారావిడ.

“లేదండీ. మాకు న్యూయార్కు చాలా దూరం. మీరు షికాగో వస్తే చెప్పండి. మేమే వస్తాం మిమ్మల్ని చూడ్డానికి” అంది సుమన.

“చికాగోనా. లేదు, చికాగోలో మావాళ్లెవరూ లేరు. మీకు మిల్వాకీ దగ్గర కాదా?”

“మిల్వాకీ ఇంకా దగ్గర అత్తయ్యగారూ. చెప్పండి ఎప్పుడొస్తున్నారు?” అంది సుమన ఉత్సాహంగా.

“ఇంకా తెలీదమ్మా. అక్కడ మా పెత్తండ్రి మనవరాలు వుంది. రమ్మని తెగ పిలుస్తోంది. ఆఅబ్బాయికి అదేదో కంపెనీలో వుద్యోగం. తనేమో ఇద్దరు పిల్లలని చూసుకుంటూ ఇంట్లోనే వుంటోంది. రమ్మని మరీ మరీ పిలుస్తోంది కానీ నేనే ఆలోచిస్తున్నా. ఏమిటో ఈ తిరగడాలు.. నానా హైరానాను.” అన్నారావిడ ఆయాసపడుతూ.

“రండి. తప్పకుండా రండి. నాక్కూడా మిమ్మల్ని చూడాలని చాలా వుంది. నేను మిల్వాకీ వచ్చి మావూరు తీసుకు వస్తాను. మాయిల్లు కూడా మీరు చూడాలి. … ప్రయాణాలు … అవునులెండి. అనుకుంటాం కానీ ఇక్కడా ప్రయాణాలు అంత తేలిగ్గా సాగవు.” అంది సుమన హడావుడిగా,

అత్తయ్యగారిని మళ్లీ చూడాలని మాచెడ్డ తహతహగా వుంది. జరక్కపోవచ్చన్న నిస్పృహ కూడా వెనువెంటే తన్నుకొస్తోంది ఎదలో. పెద్దావిడ, ఆవిడని ఇబ్బంది పెడుతున్నానేమో అని కూడా అనిపించింది ఒక్క క్షణం.

అవును, ఇక్కడ చెప్పుకోడానికి కార్లున్నాయి, విమానాలున్నాయి. విశాలంగా రోడ్లున్నాయి. లేనిది మాత్రం టైము. రోజుకి ముప్ఫైయారు గంటలున్నా చాలని వుద్యోగం శివరావుది, ఆపైన సంఘసేవా. ఎవరింట్లో ఏపూజా ఏవ్రతం అయినా ఈయనగారికి పనే. ఏరోజు చూసినా రానున్న మూడువారాలకి బుక్కయిపోయుంటాడు.

ఇప్పుడు అత్తయ్యగారు మిల్వాకీ వచ్చారు. రాగానే ఫోను చేసారు. ఆవిడ పెత్తండ్రి మనవరాలు, రత్నమాల, కూడా ఎంతో చనువుగా “ఆవీకెండు తప్పకుండా రండ”ని మరీ మరీ చెప్పింది.

శివరావు ఏవారం ఏంచేస్తాడో సుమన అడగడం మానేసి చాలా రోజులయింది. తనకేదేనా ఆలోచన వున్నా లాభం సున్నా, ముందుగా చెప్పినా ఒకటే చెప్పకపోయినా ఒకటే. అతనికెప్పుడూ హఠాత్తుగానే పనులు తగులుతుంటాయి. ఒకొక్కప్పుడు, వూళ్లో అయితేనూ, తెలుగువాళ్లయితేనూ తను కూడా వెళ్తుంది. లేకపోతే అతన్ని తోలేసి, తనపనేదో తను చూసుకుంటుంది. సుమనకి కథలూ, కవితలూ, కంప్యూటరులో తెలుగు బ్లాగులూ, ఆరేళ్ల పండు. … ఇదే లోకం.

పూజా, బ్రేక్ ఫాస్టూ అయేక, బట్టలు మార్చుకుంటూ అన్నాడు, “ఈవారం పడదేమో. ఇంకా తెలీదు కానీ మా బాసు ఏదో కొత్త ప్రాజక్టుగురించి మాటాడదాం,” అన్నాడు.

అంటే ఆరోజంతా గోవిందా. గాల్ఫ్ కోర్స్‌లో తప్ప మాటాడలేడా బాసురుడు. పెద్దాయనతో పని కనక వారెక్కడికి రమ్మంటే అక్కడే హాజరవాలి, రాచనేతికి కొంగు పట్టమని ...

మళ్లీ అతనే, "ఏం, ఏమైనా పనుందా?" అని అడిగేడు.

"లేదు. వూరికే అడిగేను" అంది సుమన. ఎలాగా జరగదని తెలిసి ఎందుకు చెప్పడం తన మనసులో మాట అనిపించింది. పైగా ఆతనికి ఆమాత్రం గుర్తు లేనందుకు కాస్త నొప్పి కలిగింది కూడా. పండుని కేకేసింది స్కూలికి టైమవుతోందంటూ.

శుక్రవారం రాత్రి ఎనిమిది గంటలకి వచ్చేడు శివరావు ఆఫీసునుంచి. వస్తూనే హుషారుగా "హనీ" అన్లేదు కానీ అంత సరదాగానూ చెప్పేడు, "రేపు మిల్వాకీ వెళ్దాం".

సుమన తెల్లబోయింది.

"ఇంత రాత్రమప్పుడు పిలిచి తెల్లారి వస్తున్నాం అంటే వాళ్లేం అనుకుంటారో. వాళ్లకి వీలవుతుందో లేదో కనుక్కోవాలి కదా" అంది.

"మనమేమీ వాళ్లింట్లో తిష్ఠ వెయడం లేదు కదా. వూరికే చూసి వచ్చేద్దాం. మహా అయితే ఓ గంటసేపు కూర్చుంటామేమో. లంచికి వాళ్లనేం ప్రయత్నాలు చెయ్యొద్దని చెప్పు. అందరం రెస్టారెంటుకు వెళ్దాం." అన్నాడు శివరావు. అతని ధోరణి చూస్తే రెస్టారెంటులో ఎవరికేం కావాలో ఆర్డరు చేసేసేడేమో కూడా అనిపిస్తుంది ఎవరికైనా.

సుమన కొంచెంసేపు ఆలోచించి, "సరే పిలిచి చూద్దాం, వాళ్లు కానీ వీల్లేదంటే తగువు తీరిపోతుంది" అనుకుంటూ ఫోను చేసింది.

రత్నమాల ఫోను తీసి, "తప్పకుండా రండి" అంది ఆప్యాయంగా.

"సరేనండీ. మేం వచ్చేసరికి పదకొండవుతుందేమో. మీరేం లంచి ప్రయత్నాలు చెయ్యకండి. నాకు అత్తయ్యగారిని చూడడమే ముఖ్యం" అంటూ సుమన నొక్కి నొక్కి చెప్పింది.

"అలా అనకండి. మీరు మాఇంటికి వూరికే రమ్మంటే వస్తారేమిటి. అత్తయ్యగారికోసమే అయినా వస్తున్నారు కదా. మా ఇంట్లోనే లంచి. కాదంటే నేను ఒప్పుకోను. అత్తయ్యగారిచేతే చెప్పిస్తాను కావలిస్తే," అంది ఆపేక్ష వుట్టిపడుతూ.

సుమనకి ఆఅమ్మాయి కలుపుగోలుతనం నచ్చింది. హాయిగా అనిపించింది.

మర్నాటి ప్రయాణానికి కావలసినవి సమకూర్చడం మొదలు పెట్టింది.

రాత్రి ఒకంతట నిద్దర పట్టలేదు. ఆనాటి అత్తయ్యగారిల్లూ, ఆవిడ చెప్పిన కథలూ చెప్తూ వేసిన పోపు ఘుమఘుమలూ కూడా నిన్నో మొన్నోలా వుంది తలుచుకుంటుంటే. ఆఖరికి ఏరెండు గంటలకో రెప్పలు బరువెక్కుతుండగా, ఇంటిముందు కారు ఆగిన చప్పుడు వినిపించింది.

పక్కకి తిరిగి చూస్తే శివరావు గాఢనిద్రలో వున్నాడు. ఎవరై వుంటారు చెప్మా అనుకుంటుండగానే, టింగ్ టింగ్ మంటూ గంట మోగింది. పక్కనున్న భర్తని కుదిపి లేపుతూ, "ఎవరో వచ్చినట్టుంది" అని అతనికి చెప్పి, తను లేచి వెళ్లి తలుపు తీసింది.

ఎదురుగా ప్రకాశం, హైస్కూల్లో శివరావు క్లాసుమేటు, నిలబడి వున్నాడు నవ్వు మొహంతో. ఇంటిముందు కారులో వెనకసీటులో తల్లిదండ్రులు కాబోలు వడలిన మొహాలతో కూర్చుని చూస్తున్నారు దీనంగా.

"సారీ, మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్టున్నాను" అన్నాడతను విచారిస్తూ.

"లేదు లెండి. ఈవేళలో చేసే పని ఏంవుంటుంది కనక, రండి," అంటూ సుమన తలుపు బార్లా తీసింది.

ప్రకాశం వెను దిరిగి కారుదగ్గరికి వెళ్లి, తల్లిదండ్రులని దిగమని చెప్పి, డిక్కీలోంచి సూట్‌కేసులు దింపసాగేడు. శివరావు కూడా మంచం దిగి హాల్లోకి వచ్చేడు.

ప్రకాశం మళ్లీ సారీ చెప్పి, తల్లిదండ్రులని విస్కాన్సిన్ డెల్స్‌కి తీసుకెళ్లి వెనక్కి వెళ్తున్నాం అని చెప్పేడు. నాలుగు రోజులయింది. తిరుగు ప్రయాణంలో పెద్దవాళ్లు సొమ్మసిల్లి పోయారని గ్రహించి, ఈపూట ఇక్కడ పడుకుని రేపు వెళ్దాం అని ఆగేడుట.

"మంచిపని చేసావు. ఈవిధంగానేనా నిన్ను చూడడం అయింది. రా, రా." అంటూ హడావుడిగా ఆహ్వానించేశాడు శివరావు.

పెద్దవాళ్లిద్దరూ "హమ్మయ్య" అంటూ నిట్టూర్చారు. వాళ్లకి ప్రాణం లేచొచ్చింది నిజమైన ఇల్లు కనిపించేసరికి. మొత్తంమీద అందరూ ఆకబురూ ఈకబురూ చెప్పుకుంటూ పక్కలెక్కేసరికి నాలుగయింది.

అందరికంటె ముందుగా లేచి, కాఫీ, పెడుతున్న సుమనకి మిల్వాకీ ప్రయాణం సంగతి గుర్తొచ్చింది. అప్పటికే ఎనిమిది దాటింది. హడావుడిగా రత్నమాలని పిలిచి, అనుకోకుండా చుట్టాలొచ్చారనీ, ఇవాళ రాలేమని, పావుగంటసేపు క్షమాపణలు చెప్పుకుంది.

"ఫరవాలేదండీ. ఇలాటివన్నీ నాకు అలవాటే. ఇరవై ఏళ్లనుంచీ వున్నాను కదా. మీకింకా కొత్తలా వుంది. మరేం బాధ పడకండి. వీలయినప్పుడే రండి." అంది రత్నమాల.

తెల్లారి ఒకొకళ్లూ లేచేసరికి తొమ్మిది దాటింది.

పండు తెల్లారే లేచేడు టీవీలో కార్టూనులు చూసుకోడానికి వచ్చి, కొత్తవాళ్లని చూసి, హాల్లోకి గుమ్మందగ్గరే నిలబడిపోయేడు. "ఫరవాలేదులే, రా" అన్నాడు శివరావు.

ప్రకాశం తండ్రి "రా. పేరేమిటి" అని దగ్గరికి పిలిచేరు చనువుగా.

"పండు" అని సిగ్గుపడుతూ చెప్పి, టీవీదగ్గరగా కూర్చున్నాడు.

"టీవీకి అంతదగ్గరగా కూర్చోవద్దని చెప్పేనా" అంటూ శివరావు మందలించేడు.

కాఫీలూ, ఫలహారాలూ అయేసరికి పదకొండు.

"ఏమిటో వాడి చాదస్తం. ఇది చూడాలి, అది చూడాలి అంటూ ఒకటే రభస. మాకేమో వచ్చే కాలమా, పోయే కాలమా. ఎక్కడ్నుంచి వస్తుంది అంత ఓపిక" అంది తల్లి, కొడుక్కి వినబడకుండా ఓకన్ను అటేసి.

ఒకరితరవాత ఒకరు స్నానాలూ, ధ్యానాలు ముగించేసరికి లంచి టైమయింది. ఏకంగా అదే బేక్‌ఫాస్టు అదే లంచి అంటూ, సుమన కాస్త భారీ ఎత్తున వంటలు మొదలు పెట్టింది.

లంచి అవగానే వెళ్తాం అంటూ ప్రకాశం లేచేడు కానీ శివరావు ఒప్పుకోలేదు. "ఇంతకాలం అయింతరవాత వచ్చేరు. అమ్మా, నాన్నగారూ రెస్టు తీసుకున్నట్టు వుంటుంది. ఈరాత్రికి వుండి వెళ్లండి" అంటూ ఇన్సిస్టు చేసేడు. ప్రకాశం మొదట కొంచెం మొహమాటపడినా సరే నన్నాడు అమ్మ మొహం చూసి. ఆవిడకి ఇంకా అలసట తీరలేదు..

సాయంత్రం మాటలమధ్యలో మిల్వాకీలో కొత్తగా కట్టిన ఆంధ్రాగుడి మాట వచ్చింది.

ప్రకాశం తల్లివేపు తిరిగి, "గుడికి వెళ్దామా. రేపు ఏకాదశి కదా" అని అడిగేడు, తల్లి ముందురోజు అన్నమాట గుర్తొచ్చి. అతనికి ఇలా అవసరం అయినప్పుడు తిథి వార నక్షత్రాలు గుర్తొస్తాయి. శివరావుతో మరోపూట గడపగలగడం అతడికి సంతోషమే.

శివరావుకి కూడా ప్రాణం లేచొచ్చింది. "అవునండీ. అందరం కలిసి వెళ్దాం. ఏమంటావు" అంటూ సుమనవేపు తిరిగి "అటునించి అటే మీ అత్తయ్యగారిని కూడా చూసి రావచ్చు" అన్నాడు.

ప్రకాశం "రండి. అందరం నావాన్‌లో వెళ్దాం సరదాగా" అన్నాడు. కొత్తవాను. అమ్మా, నాన్నలకి సుఖంగా వుంటుందని వాళ్లు వచ్చేముందే కొన్నాడు. దాన్ని ఈవిధంగా సద్వినియోగం చెయ్యడం అతనికి ఆనందదాయకం.

ప్రకాశం తల్లి సందిగ్ధంగా తలూపింది.

సుమన ఇరకాటంలో పడింది. ఇలాటిసమయాల్లో సరేనంటే తప్పు కాదంటే ముప్పు.

“మీ వానులో వెళ్తే మళ్లీ మమ్మల్ని దిగబెట్టడానికి మీరు ఇంతదూరం వెనక్కి రావాలి కదా. మీకెందుకు శ్రమ” అని ప్రకాశంతో అని, “పొద్దున్నే వాళ్లకి రావడం వీలు పడదని చెప్పేను. వాళ్లు మరో పనేదేనా పెట్టుకోవచ్చు. మళ్లీ ఇప్పుడు వెళ్తే బాగుంటుందా” అంది శివరావుతో.

”ఫరవాలేదండి. మిల్వాకీ ఎంతదూరం కనక. గంట ప్రయాణం. మరేం చెప్పకండి. పదండి” అన్నాడు ప్రకాశం.

శివరావు “దానికేంవుంది. వస్తున్నాం అని చెప్తాం. వాళ్లకి వీల్లేకపోతే ఆమాట వాళ్లే చెప్తారు కద. పోనీ, నేను మాటాడతాలే రత్నమాలగారితో” అన్నాడు. తాను గొప్ప ప్రోబ్లమ్ సాల్వరునని గట్టినమ్మకం అతనికి.

ఆదివారం తెల్లారి లేచి అందరూ కలిసి ప్రకాశం వాన్‌లో మిల్వాకీ వెళ్లడానికి నిశ్చయం అయిపోయింది.

ప్రకాశం జీపీయస్ సెట్ చేసేడు పకడ్బందీగా.

శివరావుకీ, ప్రకాశానికీ ఉత్సాహం పట్ట పగ్గాల్లేకుండా వుంది.

ప్రకాశం అమ్మా నాన్నగారికీ ఎప్పుడెప్పుడు ఇల్లు చేర్తామా అని వుంది.

పండుకి ఎక్కడికో వెళ్తున్నాం అన్న సరదేయే తప్ప ఎక్కడికి ఎందుకు అన్న విచారం లేదు.

సుమనకి మనసు ఎలా వుందో చెప్పడం కష్టం.

000

ఆలయంలో అర్చన చేయించి, ప్రసాదాలు పుచ్చుకుని, బయటపడేసరికి ఒంటిగంటవుతోంది.

“మీదయవల్ల మేం కూడా ఏకాదశిపూట భగవంతుని దర్శనం చేసుకున్నాం” అన్నాడు శివరావు పరమానందంగా.

“మాదేం వుంది నాయనా. ఆంతా ఈశ్వరేచ్ఛ. మిమ్మల్ని ఇలా చూస్తాం అని మేం అనుకున్నామా” అంది ప్రకాశం తల్లి.

“శివుడాజ్ఞ లేందే చీమయినా కుట్టదు.” అన్నారు ప్రకాశం తండ్రి.

“చీమ ఎందుకు కుట్టదు?” అని అడిగేడు పండు ఏదో కథలా వుందని.

“శివుడు ఆజ్ఞ ఇవ్వాలన్నమాట. శివుడు చీమతో నువ్వు ఇప్పుడు కుట్టొచ్చు అని చెప్తే కుడుతుంది. లేకపోతే కుట్టదు” అన్నారాయన.

“మరి ఎలా తెలుతుంది మనకి శివులాగ్న ఎపుడయిందో?” అన్నాడు పండు.

“చీమ కుట్టినప్పుడు తెలుతుంది.”

“శివులాజన లేదని ఎలా తెలుతుంది?”

"కుట్టకపోతే ఆజ్ఞ లేదన్న మాటే."

"చెప్పే ఓపిక మీకుండాలి కానీ వాడయి ఆపడండి ప్రశ్నలు" అంది సుమన నవ్వుతూ.

"పిల్లలు కదమ్మా. అలా అడక్కపోతే మొద్దులంటాం మనమే." అన్నారాయన నవ్వుతూ. ఎనిమిదిమంది మనవలు ఆయనకి మరి.

000

రత్నమాల గారింటిముందు కారాగింది. ఆవిడ అందరినీ నవ్వుతూ ఆహ్వానించింది లోపలికి. హాల్లో కూర్చున్నాక జూస్, కోక్ తెచ్చిచ్చింది.

సుమన కళ్లు అత్తయ్యగారికోసం వెతుకుతున్నాయి.

**ముగింపు - 1**

"మా నానమ్మని ఒక్కపూటలో మిస్సయేరు మీరు. ఈరోజు వుదయమే కాలిఫోర్నియాకి ప్లేను ఎక్కించి వచ్చేను." అంది రత్నమాల నెమ్మదిగా.

సుమన, "ఆహా. అలాగా. ఫరవాలేదు లెండి." అంది వెలితిపడ్డ మనసుని దాచుకుంటూ.

"మీరు పొద్దున ఫోను చేస్తే ఏం చెప్పాలో తోచలేదు. ఆవిడ లేరు, రావద్దు అని చెప్పలేను కదా" అంది రత్నమాల క్షమాపణ ధ్వనిస్తూ.

"బుధవారం వెళ్తానన్నారు ఫోనులో మాటాడుతున్నప్పుడు," అంది సుమన అప్పటికీ సందేహం తీరక.

"అవును, బుధవారానికే బుక్ చేసేం. నిన్న మామామయ్య, ఇక్కడే వుంటారులెండి, వచ్చి తను ఈరోజు కాలిఫోర్నియా వెళ్తున్నాననీ, నానమ్మ ఈరోజే బయల్దేరితే తోడుంటాననీ చెప్పేడు. ఎయిర్‌లైన్‌కి ఫోన్ చేస్తే - అది కూడా మామయ్యే చేసేరులెండి - లక్కీగా టికెట్టు మార్చడానికి వీలేనని తెలిసింది. అంచేత ఆవిడ వెళ్లిపోతానంటే నేను సరేనన్నాను. మామయ్య తోడు మంచిదే కదా అని" అంది రత్నమాల.

"పోన్లెండి. అదీ మంచిదే. ఇలాగైనా మీ పరిచయం అయింది కదా. మా వూరు రావాలి మీరు" అన్నాడు శివరావు.

"అవునండీ. తప్పకుండా రండి. నేను కూడా ఇంట్లోనే వుంటాను," అంది సుమన. అత్తయ్యగారిని చూడలేదన్న కొరతే తప్ప పాపం రత్నమాల ఆదరణలో లోపం లేదు మరి

తిరుగు ప్రయాణంలో మధ్యసీటులో కిటికీపక్కన కూర్చుని ఆలోచిస్తోంది సుమన శివరావుకీ రత్నమాలకీ మధ్య జరిగి వుండగల సంభాషణ.

"ఆనుకోకుండా ప్రయాణం అయేమండీ ఇవాళ. నాస్నేహితులతో మిల్వాకీగుడికి వస్తున్నాం."

"అలాగా. అక్కడినించి మాయిల్లు ఎంతో దూరం లేదు. మాయింటికి రావాలి మీరు,"

"ముందు రామని చెప్పేం కదా అంటోంది సుమన"

"దానికేంవుందండీ. మనలో మనకేమిటి. ఫరవాలేదు రండి."

"నేనూ అదే అన్నానండీ తనతో."

లేదా మరో స్క్రిప్టు -

"అనుకోకుండా ఈరోజు మిల్వాకీ ప్రయాణం తగిలిందండీ. గుడికి వస్తున్నాం. ..."

"ఇంకేం మరి. రండి మాయింటికి కూడా."

"మీకు ఫరవాలేదంటేనే వస్తాం. అట్టే సేపుండం లెండి"

"గుమ్మంలో అడుగెట్టకుండానే బేరాలు పెడుతున్నారేమిటండీ. మీరసలు రండి. తరవాత చూద్దాం"

"లంచి మీరేం చెయ్యకండి రెస్టారెంటుకి వెళ్దాం."

"ముందు మీరు రండి. తరవాత చూద్దాం భోజనాల సంగతి."

.అదీ కాకపోతే మరోలా సాగి వుండొచ్చు సంభాషణలు. కానీ ...

ఎన్ని స్క్రిప్టులు రాసుకున్నా "సుమనకి అత్తయ్యగారిని చూడాలని చాలా ఆతురతగా వుంది"లాటి మాటలు భర్తనోట వచ్చినట్టు తోచడం లేదు ఆఅమ్మాయి బుద్ధికి.

అదే క్షణంలో ముందుసీటులో కూర్చున్న శివరావు వెనక్కి తిరిగి, సీట్లసందులోంచి చెయ్యి పెట్టి, సుమన మోకాలిమీద దరువేస్తూ అన్నాడు, "డిసెంబరులో ఇండియా వెళ్తాం కదా. అప్పుడు నిన్ను తప్పకుండా విశాఖపట్నం తీసుకెళ్తాను. మీఅత్తయ్యగారిని తప్పకుండా కలుసుకుందాం. ఎంతదూరం కనక, రాజమండ్రిలో రాత్రి రైలెక్కితే తెల్లారేసరికి విశాఖలో వుంటాం."

సుమనకి నవ్వొచ్చింది కానీ నవ్వలేదు.

"శివులాన లేదంతే," అన్నాడు పండు రెండు చేతులూ గాల్లోకి ఎత్తి వదిలేస్తూ.

సుమన బాబువైపు ఓసారి చూసి, భర్తతో సరేనన్నట్టు తలూపి, కిటికీలోంచి చూడసాగింది మహోద్వేగంతో దూసుకుపోతున్న పోతున్న పొలాల్నీ, ఆ పొలాల్లో సినిమాబొమ్మల్లా కదులుతున్న పశువుల్నీ ....

**ముగింపు - 2.**

అందరూ కూర్చుంటుండగా అత్తయ్యగారు పక్కగదిలోంచి వచ్చేరు.

సుమన మనసు ఎగసిపడింది ఆమెని చూడగానే. రాజరాజేశ్వరీ దేవిలాటి నిండువిగ్రహం. వయసు ఛాయలు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నా అట్టే మార్పు లేదు అత్తయ్యగారిలో.

ఆదే చిరునవ్వు, అవే కళ్లు ఆపేక్షలు చిప్పిలుతూ. తల మాత్రం బాగా నెరిసిపోయింది. తనకి గుర్తున్నంతవరకూ మంచి నిగనిగలాడే నల్లని కురులు. కొబ్బరినూనె రాసి చక్కగా దువ్వి బిగించి ముడి వేసుకుని మల్లెచెండు తురుముకునేవారు.

సుమన అలా చూస్తూ ఎంతసేపు వుండిపోయిందో. ..

అత్తయ్యగారు దగ్గరగా వచ్చి, మునివేళ్లతో చుబుకం పుచ్చుకుని, "ఏదీ చూడనీ, నీ మొహం. పెద్దదాన్ని అయిపోయాను కదూ, కళ్లు సరిగా ఆనవు. బాగున్నావా. వీడు నీకొడుకా. బాగున్నాడు నీపోలికే ..." అంటూ ఆపకుండా పేరు పేరునా వరసగా అందర్నీ పలకరిస్తుంటే, సుమన కళ్లు చెమర్చాయి.

"ఆఁ", "అవునండీ," "ఆయనే మావారు", "వీడే మాఅబ్బాయి" అంటూ... పొడి పొడి మాటలతో జవాబు చెబుతోంది.

ఎన్నో అడగాలనుంది. ఏదో చెప్పాలనుంది. ఒక్కమాట కూడా రావడంలేదు నోటికి. ..

శివరావూ, ప్రకాశం, వాళ్ల నాన్నగారు వాళ్లకలవాటయిన టాపిక్కులో పడిపోయారు. ప్రకాశం తల్లి సోఫాలో ఒదిగి కూర్చుంది మౌనంగా. ఆవిడకి మొహమాటంగా వుంది ఏం చెప్పడానికైనా చెయ్యడానికైనా.

రత్నమాల భర్త ఇంట్లో లేకపోయినందుకు క్షమాపణలు చెప్పుకుని, సుమన, అత్తయ్యగారివేపు చూసి నవ్వుతూ, అంది, "మీడయలాగులు బాగున్నాయి. పదండి. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. లంచి తిన్నతరవాత మాటాడుకుందురు గానీ" అంది వంటింటిలోకి దారి తీస్తూ.

పండు రహస్యంగా, "నేను టీవీ చూసుకోవచ్చా" అనడిగేడు శివరావుని.

"ఎక్కడికొచ్చినా అదేనా. నీకలరుబుక్కులో రంగులెయ్యి" అన్నాడు.

వంటింటివేపు నడుస్తున్న రత్నమాల వెనక్కి తిరిగి, "చూసుకోనీండి. పిల్లలు కదా. మాపిల్లలు వుంటే బాగుండు. ముగ్గురూ ఆడుకునేవాళ్లు. స్కూళ్లకి వెళ్లిపోయారు" అంది రిమోటు అందిస్తూ.

వంటింట్లో "ఏమైనా సాయం చెయ్యనా?" అనడిగింది సుమన.

"చెయ్యడానికేం లేదండి. మరో అయిదు నిముషాల్లో అంతా రెడీ. మీరిద్దరూ కబుర్లు చెప్పుకుంటుండండీ." అంది రత్నమాల.

అత్తయ్యగారు సుమన పక్కన కుర్చీలో కూర్చుని, “ఎంతకాలానికెంతకాలానికి చూశాన్నిన్ను. ఎంత ఎదిగిపోయావు” అంటూ మొదలుపెట్టి, నుదుటిమీద ముంగురులు సవరిస్తూ, “నల్లగా, ఒత్తుగా బారెడు జుత్తు, ఒకంతట లొంగేది కాదు జడ వెయ్యడానికి. కత్తిరించేసేవు. మీఆయన కత్తిరించేసుకోమన్నాడా?” అన్నారు.

“లేదండీ. ఆయనేం అనలేదు. నాకే ఏదో సుళువు అనిపించి” అంటూ అసంపూర్తిగా వదిలేసింది.

“అయితే, ఒక్క బిడ్డతో సరిపెట్టేశావన్నమాట. ఎంచేతా .. సుబ్బరంగా సంపాదించుకుంటున్నారు... కడిపెడు బిడ్డల్ని కనాలి గానీ. ఒక కన్ను కన్నూ కాదు, ఒక బిడ్డ బిడ్డా కాదు అనేవారు మాఅత్తగారు.”

తెల్లబోయింది సుమన. ఇలాటి సంభాషణ తను ఎప్పుడూ విన్లేదు, వూహించను కూడా లేదు. ఏంచెప్పాలో తోచక వూరుకుంది.

“అబ్బాయి ఎంత సంపాదిస్తున్నాడు? ఆపెద్ద కారు మీదేనా? .. నువ్వు ఎందుకు వుద్యోగం చెయ్యడం లేదు? మీఆయన వీల్లేదన్నాడా?”

సుమన పెంకె పిల్లాడి గుప్పిట్లో ఇరుక్కున్న పిట్టలా ముడుచుకు పోయి, రత్నమాలవేపు చూసింది “పాహి మాం” అని చూపులతోనే వేడుకొంటూ. ఆవిడ తలొంచుకుని సీరియస్‌గా తనపని చూసుకుంటోంది. నవ్వు ఆపుకుంటోందేమో ...

ఆఖరికి సుమన వొంట్లో వున్న శక్తినంతా కూడగట్టుకుని, అత్తయ్యగారివాగ్ధాటికి అడ్డుపడుతూ, “లేదండీ. ఆయనేం అనలేదు. అసలు ఆయనేం అనరు. అన్నీ నా ఇష్టాయిష్టాలే నావరకూ” అంది.

“మరి ఇంకేం? ఇక్కడ బేబీసిట్టరులూ, డేకేరులూ అన్ని సదుపాయాలూ వున్నాయి కదా.”

“మనపిల్లాడ్ని వాళ్లకీ వీళ్లకీ అప్పచెప్పి నేను సాధించేదేం వుంది అనుకున్నానండీ” అంది తనేదో తప్పు చేసినట్టు అవిడ అనుకుంటున్నందుకు నొచ్చుకుంటూ.

“నేనూ అదే అన్నానండీ” అంది రత్నమాల ఇంతసేపటికి నోరు విప్పి.

తరవాత, ప్లేట్లూ, గ్లాసులూ బల్లమీద పెడుతూ, సుమనతో “అందరినీ రమ్మని చెప్పండి. అయిపోయింది.” అంది.

సుమన బతుకు జీవుడా అనుకుని గబుక్కున ఎగిరి గెంతేసి పక్కగదిలోకి పరారీ అయింది.

భోజనాలవేళ పిల్లాడికి తినిపించాలన్న నెపంతో అత్తయ్యగారి పక్కన కూచోలేదు కానీ ఎదురుసీటు అయిపోయింది. తింటున్నంతసేపూ అత్తయ్యగారు సుమనని ఏవో అడుగుతూనే వున్నారు. - అల్లుడుగారికి ఆదాయం ఎంత, తాము వుంటున్న ఇల్లు మనదేనా, ...

సుమన రత్నమాలవేపు చూసింది, “ఇందుకేనేమో ఈవిడ మమ్మల్ని రమ్మని పిలిచింది” అనుకుంది.

రత్నమాల కూడా ఆ చాదస్తం ఆవిడ ఇక్కడికి వేంచేసేకే తెలుసుకుందేమో.

తిరుగుప్రయాణంలో కారులో శివరావు సుమన వేపు తిరిగి, “అత్తయ్యగారిని చూడ్డం అయింది. యూ హేపీ?” అన్నాడు,.

సుమనకి ఏంచెప్పాలో తోచలేదు.

000

(అక్టోబరు 2008. )

# 9. శివుడాజ్ఞ (మరోరకం ముగింపుతో)

(అక్టోబరులో రాసిన శివుడాజ్ఞ కథకి రెండు ముగింపులు ఇచ్చేను తెలుగు తూలికలో. రెండోముగింపుమీద వచ్చిన వ్యాఖ్యలు ఆధారంగా, ఈకథ మార్చి పూర్తి చేసేను. ఈకథ తెలుగుజ్యోతి, డిసెంబరుసంచికలో చూడగలరు. - మాలతి)

ooo

"రేపు మిల్వాకీ వెళ్దాం" అన్నాడు శివరావు.

సుమన అతనివేపు చూసింది "నిజంగానా" అన్నట్టు. శివరావు అనుజ్ఞ అయింది.

చిన్నప్పుడు చల్లటి సాయంసమయాల చక్కని కథలు చెప్పి తనని అలరించిన అత్తయ్యగారు మిల్వాకీ వచ్చేరు. అప్పటికి రెండువారాలుగా అడుగుతోంది శివరావుని మిల్వాకీ వెళ్దాం అని. అతనికి ఎప్పటికప్పుడే ఏదో ఒ పని. ఊళ్లో ఎవరింట ఏపూజ జరిగినా అతనికే పని. సుమనకి దైవభక్తి అంతంత మాత్రమే అయినా అతన్ని కాదనలేక కూడా వెళ్తుంది. పూజకి కాదు ప్రసాదాలకి అనుకో అంటాడతను. ఆరేళ్ల పండుకి ఇల్లు తప్ప ఎక్కడ అయినా సరదాయే.

ఇదే ఆఖరి శనివారం. రేపు వెళ్లకపోతే మరి అత్తయ్యగారిని చూడడం పడదు.

"రేపు మిల్వాకీ వెళ్దాం" అని శివరావు అనగానే ఎగిరి గెంతేసింది సుమన మనసు.. అత్తయ్యగారిని గురించిన ఆలోచనలు ఝుమ్మని లేచేయి. ఆవిడ కాలిఫోర్నియాలో వున్న కొడుకు రాంబాబుని చూడ్డానికి వచ్చారుట. వాళ్లింట్లో తెలుగుజ్యోతి పత్రిక తీసి చూస్తూంటే సుమన పేరు కనిపించింది. ఆవిడ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిపోతూ "అయ్యో, ఈ పిల్లిక్కడుందా? నాకు మాఅమ్మాయిలాటిదే.. ఇంతప్పటినుండీ తెలుసు ఈ పిల్లని. మనింటికి రోజూ వచ్చేది కదుట్రా," అన్నారావిడ కొడుకుతో ఎడంచేయి గాలిలో మూడడుగులు ఎత్తి చూపుతూ. ఆవెంటనే రాంబాబు ఇంటర్నెట్టెక్కేసి, సుమన అజా పజా ఎక్కలాగి, అక్కడ కనిపించిన నెంబరుకి ఫోను చేసేడు. సుమన ఫోను తీసి హలో అంది.

అవతలినుండి "వుండండి, ఫోను మీస్నేహితురాలుగారికి ఇస్తాను" అని బల్లమీద ఫోను పెట్టేసి వెళ్లిపోయాడు. సుమనకి అయోమయంగా వుంది.. ఎవరయి వుంటారు చెప్మా ఈస్నేహితురాలుగారు అని ఆలోచిస్తుండగానే, ఫోనులో హలో వినిపించింది. రవంత పెద్దతనం ధ్వనించింది గొంతులో.

సుమన "హలో" అని "ఎవరండీ" అంది సందేహంగా.

"నేనమ్మా, మంగళగిరిలో అత్తయ్యగారిని. గుర్తున్నానా? రోజూ సాయంత్రాలు మాయింటికి వచ్చేదానివి."

“అత్తయ్యగారా! అయ్యో మిమ్మల్ని మర్చిపోతానాండీ, ఎప్పుడొచ్చారు? ఎక్కడున్నారు?” అంది హడావుడిగా ముందు ఉలికిపడి, తరవాత ఎగిరి గెంతేసినంత పన్చేస్తూ. కాళ్లు భూమ్మీద ఆన్లేదు మరింక.

“అవునమ్మా. రాంబాబు ఇప్పుడు కాలిఫోర్నియాలో వున్నాడు కదా. ఇల్లు కొనుక్కున్నాడు. గృహప్రవేశానికి వచ్చేను.” అన్నారావిడ కూడా ఆపిల్ల తనని గుర్తు పెట్టుకున్నందుకు పొంగిపోతూ.

“బాగుందండీ. మీ గొంతు వింటుంటే నాకు మళ్లీ మీ వంటింటిలో కూర్చున్నట్టే వుంది,” అంది సుమన.

“నువ్వెక్కడున్నావు. ఇక్కడికి దగ్గరేనా?” అని అడిగారావిడ.

“లేదండీ. మాకు కాలిఫోర్నియా చాలా దూరం. మీరు షికాగో వస్తే చెప్పండి. మేమే వస్తాం మిమ్మల్ని చూడ్డానికి.”

“చికాగోనా? లేదు, చికాగోలో మనవాళ్లెవరూ లేరమ్మా. మీకు మిల్వాకీ దగ్గర కాదా?”

“మిల్వాకీ ఇంకా దగ్గర అత్తయ్యగారూ. చెప్పండి ఎప్పుడొస్తున్నారు?” అంది సుమన ఉత్సాహంగా.

“ఇంకా తెలీదమ్మా. అక్కడ మా పెత్తండ్రి మనవరాలు వుంది. రమ్మని పట్టు బడుతోంది. ఆఅబ్బాయికి అదేదో కంపెనీలో వుద్యోగం. తనేమో ఇద్దరు పిల్లల్నీ చూసుకుంటూ ఇంట్లోనే వుంటోంది, ఆలోచిస్తున్నా, ఈప్రయాణాలు హైరాన” అన్నారావిడ ఆయాసపడుతూ.

“రండి. తప్పకుండా రండి. నాక్కూడా మిమ్మల్ని చూడాలని చాలా వుంది. మేమే మిల్వాకీ వచ్చి మిమ్మల్ని మావూరు తీసుకు వస్తాం. మాయిల్లు కూడా మీరు చూడాలి. … ప్రయాణాలు … అవునులెండి. ఇక్కడా ప్రయాసే,” అంది సుమన గలగలా మాటాడేస్తూ,

పండు, “ఎవలూ” అన్నాడు సుమనతో. వాడిక్కూడా అర్థం అయిపోయింది అమ్మ ఎవరో చాలా ఇష్టమయిన స్నేహితురాలితో మాటాడుతోందని.

“అమ్మమ్మ” అంటూ మొదలు పెట్టి వాడికి అరగంటసేపు చెప్పింది తన చిన్ననాటి ఆప్తురాలిగురించి. వాడు వినడం మానేసి చాలాసేపయిందని తను గుర్తించనేలేదు!

అత్తయ్యగారు మిల్వాకీ వచ్చేక మళ్లీ ఫోను చేశారు. ఆవిడ పెత్తండ్రి మనవరాలు రత్నమాల కూడా ఎంతో చనువుగా “శనివారమో ఆదివారమో తప్పకుండా రండ”ని మరీ మరీ చెప్పింది.

సుమనకి ఒహటే ఆరాటం. రాత్రి ఒకంతట నిద్దర పట్టలేదు. ఆనాటి అత్తయ్యగారిల్లూ, ఆవిడ కథలూ చెప్తూ వేసిన పోపు ఘుమఘుమలూ కూడా నిన్నో మొన్నోలా వుంది తలుచుకుంటుంటే. ఆఖరికి ఏరెండు గంటలకో రెప్పలు బరువెక్కేయి.,

OOO

రత్నమాల గారింటిముందు కారాగింది. ఆవిడ అందరినీ నవ్వుతూ ఆహ్వానించింది లోపలికి. సుమనకళ్లు అత్తయ్యగారికోసం వెతుకుతున్నాయి. గుండెలు చిక్కబట్టుకుని కూచుంది.

"అత్తయ్యగారు చీరె మార్చుకుంటున్నారు. వస్తారు," అంది రత్నమాల చిన్నగా నవ్వుతూ.

మరో నాలుగు నిముషాలకి అత్తయ్యగారు పక్కగదిలోంచి వచ్చేరు. రాజరాజేశ్వరీదేవిలాటి నిండువిగ్రహం. వయసు ఛాయలు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నా అట్టే మార్పు లేదు అవిడలో. ఆప్యాయత వుట్టిపడే చిరునవ్వు, ఆపేక్షలు చిప్పిలేకళ్లు. తల మాత్రం బాగా నెరిసిపోయింది. అప్పట్లో మంచి నిగనిగలాడే నల్లని కురులు. కొబ్బరినూనె రాసి చక్కగా దువ్వి బిగించి ముడి వేసుకుని మల్లెచెండు తురుముకునేవారు. రెండో చెండు తనకోసం గుమ్మందగ్గర  పక్కనే బల్లమీద వుంచేవారు క్రమం తప్పకుండా.

సుమన అలా చూస్తూ ఎంతసేపు వుండిపోయిందో. .. అత్తయ్యగారు దగ్గరగా వచ్చి, మునివేళ్లతో చుబుకం పుచ్చుకుని, "ఏదీ చూడనీ మొహం. పెద్దదాన్ని అయిపోయాను కదూ, కళ్లు సరిగా ఆనవు. బాగున్నావా? వీడు నీకొడుకా? బాగున్నాడు నీపోలికే ..." అంటూ ఆపకుండా పేరు పేరునా వరసగా అందరిగురించీ అడుగుతుంటే సుమన కళ్లు చెమర్చాయి.

"ఆఁ", "అవునండీ," "ఆయనే మావారు", "వీడే మాఅబ్బాయి" అంటూ… పొడి పొడి మాటలతో జవాబు చెబుతోంది.

ఎన్నో అడగాలనుంది. ఏదో చెప్పాలనుంది. ఒక్కమాట కూడా రావడంలేదు నోటికి.

అత్తయ్యగారు సుమన పక్కన కుర్చీలో కూర్చుని, "ఎంతకాలానికెంతకాలానికీ  చూట్టం నిన్ను. ఎంత ఎదిగిపోయావు. మళ్లా నేను నిన్ను చూస్తానని కలలో కూడా అనుకోలేదు. దేనికయినా పైవాడి దయ" అంది.

"అవునండీ. నాక్కూడా మిమ్మల్ని చూడాలి అని వుంది కానీ జరుగుతుందని ఎప్పుడూ అనుకోలేదు" అంది సుమన.

"అందుకే అంటారమ్మా శివుడాజ్ఞ లేనిదే చీమయినా కుట్టదని."

"దాని బంగారుకన్నంలో వేలు పెట్టితే కులుతుంది" అన్నాడు పండు.

అత్తయ్యగారు నవ్వుతూ, "ఆహా, అట్లానా. మీ అమ్మ చెప్పిందా. అప్పుడు కూడా శివుడాజ్ఞ అయితేనే కులుతుంది," అన్నారు వాడి బుగ్గ పుణికి.

"ఎలా తెలుతుంది శివులాగిన అయింది అనీ" అడిగాడు పండు. వాడికి కథలంటే మహా సరదా.

అత్తయ్యగారు మళ్లీ బుగ్గ గిల్లి, "నీకూ మీఅమ్మ మాదిరే కతలు కావాలేం" అని నవ్వుతూ, "కుట్టినప్పుడు తెలుస్తుంది," అన్నారు.

"శివులాని లేకపోతే కుట్టదా"

"కుట్టదు."

రత్నమాల వాళ్లిద్దర్నీ చూసి నవ్వుతూ, అంది, "బావున్నాయి మీడయలాగూలు . పదండి. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. భోంచేసితరవాత మాటాడుకుందురు గానీ" అంది వంటింటిలోకి దారి తీస్తూ.

పండు బిక్కమొహం పేసుక్కూచున్నాడు. రత్నమాల వాడిమొహం చూసి, "మాపిల్లలు వుంటే బాగుండు. ముగ్గురూ ఆడుకుసేవాళ్లు. వాళ్ల ఫ్రెండు పుట్టినరోజు. ఉండమన్నాను కానీ విన్లేదు." అంది రిమోటు అందిస్తూ.

వంటింట్లో "ఏమైనా సాయం చెయ్యనా?" అనడిగింది సుమన.

"చెయ్యడానికేం లేదండి. మరో అయిదు నిముషాల్లో అంతా సిద్ధం. మీరిద్దరూ కబుర్లు చెప్పుకుంటుండండీ." అంది రత్నమాల.

భోజనాలబల్లదగ్గర, అత్తయ్యగారు సుమన పక్కనే కూర్చుని, నుదుటిమీద ముంగురులు సవరిస్తూ, "నల్లగా, ఒత్తుగా బారెడు జుత్తు, ఒకంతట లొంగేది కాదు జడేయటానికి. మీఆయన కత్తిరించేసుకోమన్నాడా?" అన్నారు.

"లేదండీ. ఆయనేం అనలేదు. నాకే ఏదో తేలిగ్గా వుంటుందనిపించి" అంటూ అసంపూర్తిగా వదిలేసింది.

"అబ్బాయి బాగానే సంపాదిస్తున్నాడా? రెండు చేతులా నొల్లుకోడానికే కదా వున్నవూరూ, కన్నతల్లీ అన్నీ వదిలేసుకు ఇంత దూరం ఈ పరుగులూ .... ఏమేనా వెనకేస్తున్నావా. చెప్పలేం తల్లీ సిరులు ఎలా వస్తాయో ఎలా పోతాయో. నువ్వు ఎందుకు పని చూసుకోలేదూ? మీఆయన ఒప్పుకోలేదా? ... .అయితే ఒక్క బిడ్డేనా? ఎంచేతా .. సుబ్బరంగా సంపాదించుకుంటున్నారు... కడిపెడు బిడ్డల్ని కనాలి గానీ. ఒక కన్ను కన్నూ కాదు, ఒక బిడ్డ బిడ్డా కాదు అనేవారు మాఅత్తగారు. నాకూ మారాంబాబు ఒక్కడే కదా."

తెల్లబోయింది సుమన. ఈవాగ్ధోరణి తాను వూహించను కూడా లేదు. ఏంచెప్పాలో తోచడంలేదు. పెంకె పిల్లాడి గుప్పిట్లో ఇరుక్కున్న జేగురుపిట్టలా ముడుచుకు పోయి, రత్నమాలవేపు చూసింది పాహిమాం అనుకుంటూ.. ఆవిడ తలొంచుకుని దీక్షగా తనపనేదో తాను చేసుకుంటోంది. నవ్వు ఆపుకుంటోందేమో ...

ఆఖరికి సుమన వొంట్లో వున్న శక్తినంతా కూడగట్టుకుని, అత్తయ్యగారి వాక్ప్రవాహానికి ఆనకట్ట వేస్తూ, "లేదండీ. ఆయనేం అనలేదు. అసలు ఆయనేం అనరు. నాకు సంబంధించినంతవరకూ నా ఇష్టాయిష్టాలే. నాకేం తోస్తే అదే చేసుకుపోతుంటాను" అంది.

"మరి పని ఎందుకు చెయ్యవూ... ఇక్కడ పిల్లల్నాడించేవాళ్లూ కనిపెట్టుకునుండేవాళ్లూ అన్ని సదుపాయాలూ వున్నాయి కదా."

“మనపిల్లాడ్ని వాళ్లకీ వీళ్లకీ ఒప్పచెప్పి నేను సాధించేదేంవుంది అని నేనే చూసుకుంటున్నానండీ” అంది తనేదో తప్పు చేసినట్టు అవిడ అనుకుంటున్నందుకు నొచ్చుకుంటూ.

“నేనూ అదే అన్నానండీ” అంది రత్నమాల ఇంతసేపటికి నోరు విప్పి. తరవాత, ప్లేట్లూ, గ్లాసులూ బల్లమీద పెడుతూ, సుమనతో “అందరినీ రమ్మని చెప్పండి. అయిపోయింది.” అంది. సుమన బతుకు జీవుడా అనుకుని గబుక్కున ఎగిరి గెంతేసి పక్కగదిలోకి పరారీ అయింది.  తిరిగి వచ్చేక, పిల్లాడికి తినిపించాలన్న నెపంతో అత్తయ్యగారి పక్కన కూచోలేదు కానీ పూర్తిగా తప్పించుకోలేకపోయింది. ఎదురుకుర్చీలో కూచున్నారావిడ.

తింటున్నంతసేపూ అత్తయ్యగారు సుమనని ఏవో అడుగుతూనే వున్నారు -- అల్లుడుగారు నిన్ను బాగానే చూసుకుంటాడా? ఆదాయం బాగుందా?  ఇల్లు మనదేనా?

తిరుగుప్రయాణంలో కారులో శివరావు సుమన వేపు తిరిగి, “అత్తయ్యగారిని చూడ్డం అయింది. యూ హాపీ?” అన్నాడు,.

సుమనకి ఏంచెప్పాలో తోచలేదు.

000

సుమన కలం బల్లమీద పెట్టి, చేతిలోని కాగితం మడత పెడుతుంటే శివరావు వచ్చేడు ఆఫీసునుంచి. సుమన చేతిలో కాగితం చూస్తూ “ఉత్తరాలా? ఎక్కడినుంచి?” అన్నాడు.

సుమన మౌనంగా తనచేతిలోని కాగితం అతనికి అందించింది. శివరావు అందుకుని సుమనవైపు చూశాడు. ఆవుత్తరం అత్తయ్యగారినుంచిలా వుంది. అనుమానంగా చూశాడు ఆమెవేపు. చూడమన్నట్టు తలూపింది సుమన.

“చిరంజీవి సౌభాగ్యవతి సుమనకి,

మీ అత్తయ్య దీవించి వ్రాయునది, నేను ఇక్కడ క్షేమం. అక్కడ మీరంతా క్షేమమని తలుస్తాను.

నువ్వు అంత దూరం పని గట్టుకుని నన్ను చూట్టానికి రావటం నాకెంతో ఆనందంగా వుందమ్మా. నిన్ను మళ్లీ చూస్తానని జన్మలో అనుకోలేదురా బంగారూ. నన్ను గుర్తు పెట్టుకుని, చూట్టానికి వచ్చేవు. భగవంతుడు నిన్ను చల్లగా చూడాలి.

నీకు చిన్నప్పటినుండీ ఎంతో మప్పితం. బడి కాంగానే రోజు మాయింటికి పరుగెత్తుకు వచ్చేసేదానివి, గుర్తుందా. నేను నీకోసం ఎదురు చూస్తుంటే మామయ్యగారు నన్ను ఎగతాళి పట్టించేవారు నీ అభిమాన పత్రిక ఇంకా రాలేదా అంటూ. నువ్వు ఆరేళ్లపిల్లవి చూస్తూండగానే నాకళ్లముందే హైస్కూలు ముగించేంత

ఎదిగిపోయేవమ్మా. అయితేనేంలే. నాకెప్పుడూ, ఇప్పటికీ ఆ ఆరేళ్లపిల్లలాగే కనిపిస్తావే చిట్టితల్లీ.. అందుకే నిన్నటిరోజున నిన్ను చూడంగానే ఎన్నో అడగాలని ఆరాటం నాకూ .... "ఎలా వున్నావు?" "ఏం చేస్తున్నావు?" "నీ కాపురం ఎలా వుంది?" "అబ్బాయికి నువ్వంటే ప్రేమేనా?" "బాగా చూసుకుంటున్నాడా?" ... నేనూ అనుకున్నాలే నా ప్రశ్నలు నీకు చిరాకుగా వుంటాయని. ఏం చెయ్యనూ .. నేను నీలా చదువుకోలేదు కదమ్మా. మీకాలపు మర్యాదలూ మన్ననలూ నాకేం తెలుస్తాయి చెప్పూ. మీలా సినిమాలూ, రాజకీయాలూ నాకు తెలీవు. నాకు తోచిన సంగతుల నాకు చేతనయినట్టు మాటాడతాను. మరి నా తాపత్రయం అట్లాంటిది. అంతే. మాటొచ్చింది కనక అడుగుతున్నాను, అబ్బాయి నిన్ను బాగా చూసుకుంటాడా? ఇక్కడ తాగుడూ, వ్యామోహాలూ ఎక్కువట కదా. లేదులే వూరికినే అన్నాను. అబ్బాయి బుద్ధిమంతుడిలాగే వున్నాడు. చూశాను కదా.

నీకు జ్ఞాపకం వుందా? ఓసారి మామయ్యగారు వూరెళ్లి, అక్కడినుంచి వుత్తరం రాసేరు. నాకు చదువు రాదు కదా. నీచేత చదివించుకున్నాను. చదవమన్నానే కానీ పూర్తిగా చదవనివ్వలేదు నిన్ను. నువ్వేం అడుగుతావో, ఏం చెప్పాల్సొస్తుందోనని సగంలో  నీచేతిలోంచి ఉత్తరం పెరుక్కున్నాను. ఇప్పుడు పెద్దదానివయేవు. నువ్వూ కాపురం చేసుకుంటున్నావు. మరి ఇప్పుడు తెలిసిందా?. మీ ఆయనకూడా సరసుడే అనుకుంటాలే. అప్పట్లో మామయ్యగారు తిరిగి వచ్చేక కాస్సేపు పోట్లాడుకున్నాం. "నాకు చదువు రాదని తెలిసి ఎందుకు వుత్తరం రాయటం" అని నేనూ, "అందుకే చదువు నేర్చుకో" అని మీ మామయ్యగారూను. మీరు గుంటూరు వెళ్లిపోయనతరవాత నీకు ఉత్తరం రాయాలని చదువు మొదలు పెట్టాను కూడాను  కానీ సాగలేదమ్మా.

నువ్వు స్కూల్లో చేతిపనుల క్లాసులో చిన్న చదరంత చాప అల్లి తెచ్చావు గుర్తుందా? "అత్తయ్యగారూ, మీరు పూజ చేసుకున్నప్పుడు కూచోడానికి బాగుంటుందని మీకోసం అల్లేనండీ" అంటూ తెచ్చి ఇచ్చేవు. అది అలాగే పదిలంగా అట్టి పెట్టుకున్నాను, తెలుసా? కూచుంటే ఆరిగిపోతుందని గోడవార పెట్టేను కానీ ఎప్పుడూ దానిమీద కూచోనేలేదు. తిరిగి వెళ్లేక దానిమీద కూచుని మీదంపతులపేరున సత్యనారాయణవ్రతం చేయిస్తాను మీరిద్దరూ  పదికాలాలు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో, పిల్లా పాపలతో కళకళలాడుతూ వర్ధిల్లాలని కోరుకుంటూ.

నువ్వు నన్ను చూడడానికి వచ్చేవు. అంతే చాలు తల్లీ నాకు. నిన్ను మళ్లీ చూస్తానని నేను జన్మలో అనుకోనేలేదు సుమా. మళ్లీ ఇంకోసారి చూడలేనేమో కూడాను. ఈజగన్నాటకంలో నాపాత్ర ముగిసే సమయం వచ్చింది. ఆ శివుడాజ్ఞకోసం ఎదురు చూస్తున్నాను. ఆయిన ఆజ్ఞ ఎప్పుడు అయితే అప్పుడు వెళ్లిపోతాను. ఈ పిచ్చి అత్తయ్యగారిమీద కోపం పెట్టుకోకమ్మా. వుండనా మరి.

సదా నీ మేలు కోరుతూ, శుభాశీస్సులతో,

మీ అత్తయ్య

శివరావు కాగితం తిరగా బోర్లా చూసి, కవరుకోసం చూసి చుట్టూ చూసి, సుమన మొహంలోకి చూశాడు. నెమ్మదిగా దగ్గరకొచ్చి, తనపక్కన కూర్చుని, "అత్తయ్యగారి మనసు కనిపెట్టి అద్దం పట్టినట్టు రాసేవు. అచ్చంగా ఆవిడ మాటలే. ఆవిడ ఇది చూస్తే ఎంత మురిసిపోతారో" అన్నాడు.

సుమన పెదవి విరిచి, "రాతలకేముంది చేతల్లో కనిపించాలి గానీ" అంది.

"నువ్వలా గిల్టీగా ఫీలవకు. మనసులో వుండడం కూడా ముఖ్యమే. అదీ లేనివాళ్లెంతమంది లేరు,." అన్నాడు. రెండు నిముషాలాగి, వాతావరణం తేలిక పరచడానికి, "అది సరే కానీ నాకేమిటి తాగుడూ, వ్యామోహాలు అంటగట్టేవు" అన్నాడు దగ్గరగా జరిగి, మొహంలో మొహం పెట్టి చూస్తూ.

సుమన ఒక కన్ను సగం మూసి కొంటెగా నవ్వింది, అతనిగుండెలమీదకి వాలుతూ.

ఇంతలో ఫోను మోగింది "ఛప్, రసభంగం" అంటూ శివరావు లేచి,. ఫోను అందుకున్నాడు. "అయ్యో... ఎప్పుడూ... అలాగే చెప్తానండీ...." అని, ఫోను పెట్టేసి ఇటు తిరిగేడు.

సుమన మొహం పాలిపోయి వుంది. చేతిలో కాయితంమీద కళ్లు నిలిచిపోయాయి. శివుడాజ్ఞ అన్న పదం వేలితో తడమసాగింది.

శివరావు నెమ్మదిగా వచ్చి, సుమన పక్కన కూర్చుని, "అత్తయ్యగారికి రాత్రి గుండెపోటు వచ్చిందిట. ప్రమాదంలేదు. టెస్టులు చేస్తున్నారుట. సర్జరీ అవసరం కాకపోవచ్చుట," అన్నాడు వీలయినంత గబగబా.

సుమనకి కళ్లలో ఉబికివస్తున్న నీటిపొరల్లోంచి "శివుడాజ్ఞ" అలుక్కుపోయి, సరిగ్గా కనిపించడంలేదు. శిరావు చెయ్యి పుచ్చుకుని, "సత్యనారాయణవ్రతం చేద్దామండీ" అంది బొంగురు పోయిన గొంతుతో, జీవితంలో మొదటిసారిగా.

శివరావు వులికిపాటు కప్పి పుచ్చుకుని, "అలాగే. తప్పకుండా చేద్దాం. వచ్చే శనివారం పౌర్ణమి అనుకుంటాను" అన్నాడు.

ooo

(నవంబరు 2008. )

## 10. ఉభయతారకం

"కథలెలారాస్తారండీ" అని అడిగేడు తారకం ఓరోజు.

"ఏముందీ, మామూలుగానే. కాయితంమీద కలం పెట్టి" అన్నాను.

"అద్సరే లెండి, కాయితమ్మీద కలం పెట్టి ఎలా రాస్తారని?"

"నాయనా, అరబ్బీయులు కుడినించి ఎడమకుడికి రాస్తారు. చైనీయులు మీదనించి కిందకి రాస్తారు. నేను మాత్రం ఎడమనించి కుడికే రాస్తాను".

"దేన్నిగురించీ అని?"

"దేనిమీదయినా రాయొచ్చు"

"ఆగోడమీద రాయొచ్చా?"

"ఉహూఁ. గోడమీద రాస్తే పోస్టు చెయ్యడం కష్టం. కాయితమ్మీదే రాయాలి."

"పోన్లెండి, ఈ బల్లమీద రాస్తాననుకుందాం. ఎక్కడ మొదలుపెట్టమంటారు?"

"మొదలుదగ్గర మొదలెట్టి చివరివరకూ రాసుకుపోవడమే?"

"అదే, ఏమని మొదలుపెట్టడం అనీ?"

"నువ్వు ఏవిషయమ్మీద రాద్దాం అనుకుంటున్నావో దాన్తోనే ప్రారంభిస్తే బాగుంటుంది."

"బల్లగురించి ఏముంది రాయడానికి?"

"బోల్డుంది. బల్ల ఏచెక్కతో చేశారో, అది ఏచెట్టునించి వచ్చిందో, ఆచెట్టు పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో చెప్పడం ఒకపద్ధతి"

"అది కుదరదులెండి. నాకు చెట్లూ, పుట్టలూ అర్థం చేసుకునే సహృదయత లేదు."

"పోనీ, ఆబల్ల ఎక్కడ కొన్నావో, ఎంతక్కొన్నావో, ఆదుకాణంవాడు ఆ బల్ల ప్రత్యేకతగురించి చెప్పిన హరికథా అన్నీ రాసేయి."

"అదేంటండి. నేను రాస్తున్నది బల్లమీదా? బల్లలవ్యాపారంమీదా?"

"అదేనయ్యా చెప్తున్నది. కథ అంటే అదే మరి. అడవి వుసిరికాయా, సముద్రపు ఉప్పూ ఓ కొలిక్కి తెచ్చి ముడేయడమే కథ రాయడం అంటే."

"సరే, ఏదో మొదలెడతాననుకోండి. తరవాతేం చెయ్యను?"

"ఆదికీ అంతానికీ మధ్య ఒకటో రెండో సన్నివేశాలూ, సంఘర్షణా పెట్టు. సన్నివేశాలు పకడ్బందీ వుండాలి. సంఘర్షణ ఘనంగా వుండాలి."

"బల్లకి సంఘర్షణ ఏమిటండీ?"

"బాగుంది. కథ రాస్తున్నది నువ్వా నేనా? నీకేం రాయాలనుంటే అదే రాయి." అని మళ్లీ అడక్కుండా, "పాత్ర పోషణ కూడా చెయ్యాలి" అన్నాను.

"సరేలెండి. అదెలా అంటే మళ్లీ 'నువ్వా, నేనా' అంటారు," అంటూ మూతి ముడుచుకు వెళ్లిపోయాడు తారకం.

నాలుగురోజులతరవాత ఓ కథ రాసుకొచ్చాడు. నిజానికి సగం రాసుకొచ్చాడు.

"సగం రాసేనండీ. ఎలా ముగించాలో తెలీడం లేదు." అంటూ.

"బాగుంది. కథ రాస్తూ, రాస్తూ, కలం ముడిచేస్తే అయిపోతుందేమిటి? కథకి ముగింపే ప్రాణం."

"ప్రాణం పోయినప్పుడే ముగింపు అనుకున్నానండీ" అన్నాడు తారకం.

"అలా కాదు బాబూ. కథలో నీ సందేశం ముగింపులోనే తెలుస్తుంది. అక్కడిదాకా చదివిన పాఠకులు ముగింపు చదివి 'ఆహా! అదా సంగతి, నాకింతవరకూ తట్టనేలేదు,' లేదా 'గుర్తే లేదు' అనుకోవాలి."

"ముగింపుకింత కథా కమామీషు వుందని నాకు తెలీదండీ. మీరు చెప్పలేదు మరి." అన్నాడు తప్పు నామీదకే తోసేస్తూ.

నేను కూడా సహజంగానే ఆ పాపభారం నా నెత్తినేసుకుని, "అయ్యో చెప్పలేదూ? మర్చిపోయేను కాబోలు. అసలు నిజానికి కథలు మొదట్లోనే మొదలెట్టక్కర్లేదు. నేను ఒకొకప్పుడు ముగింపు ముందు రాసేసి, తరవాత మొదట్నించీ రాసుకుంటూ పోతాను. అప్పుడయితే, ముగింపు ముందే సిద్ధంగా వుంటుంది కనక మరి చింత లేదు." అన్నాను.

"మరి ఆమాట ముందు చెప్పలేదు కదండీ మీరు" అంటూ మళ్లీ మొదటికొచ్చేడు తారకం.

"సరే ఇప్పుడు చెప్పేను కదా. పో, అలా రాసుకురా" అన్నాను.

"అడగడం మర్చిపోయేను. శైలి మాట కూడా కాస్త ఇప్పుడే చెప్పేయండి. మళ్లీ మళ్లీ ఇన్నిసార్లు తిరగలేను."

"నువ్వెలా రాస్తే అదే నీశైలి."

"ఇంగ్లీషు మాటలు నాకు తొందరాగా వచ్చేస్తున్నాయి."

"సరే. ఇంగ్లీషులోనే రాసేయ్ మొత్తం కథంతా. ఎలాగా నీది సగం తురకం. ఎందుకొచ్చిన తెలుగు, నరకం," అన్నాన్నేను.

"ఇంగ్లీషు నాకంత బాగా రాదండీ."

"అయితే, ఇంగ్లీషులో రాయకు. తెలుగులోనే రాయి."

"అన్నట్టు మరొక్కమాట కూడా అడిగేస్తాను. ముద్దు ముద్దుగా చిట్టీ పొట్టీ వాక్యాలు గిలకమంటారా? పెద్ద పెద్ద సంస్కృత సమాసాలూ, దుష్టసమాసాలూ పెట్టేసి ఘనాపాఠీపండితుల్లా రాస్తే గౌరవమా?"

“పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు ‘అనవసరదాంపత్యం’ అని ఓ కథ రాశారు. చదివేవా?”

“లేదండీ.”

“అందులో మొదటి వాక్యం చాలు కథారచన యవ్వారం తెలియడానికి.”

“చెప్పండి మరి ఆ ఒక్క వాక్యం.”

“కాయితం, కలం తీసుకో. రాసుకో.”

“అక్కర్లలేదండీ. నాకు గుర్తుంటుంది, చెప్పండి.”

”సరే. మళ్లీ చెప్పలేదనకు.” అంటూ చెప్పేను ఆవాక్యం .

## అనవసరపు దాంపత్యం

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

ఉక్కిరిబిక్కిరైన ఆశయాల సూట్‌కేసుతో "శ్రీహరి" హౌరా స్టేషనులో దిగినప్పుడు, చీమలబారులా యిటూ అటూ అన్ని వైపులకు బస్సులు పరుగు లెత్తటం చూసినప్పుడు, ప్రపంచంలోని అన్ని జాతుల మనుష్యులతో కిక్కిరిసి పోయిన ఆ మహానగరానికి గుండెల్లోంచి చల్లగా ప్రశాంతంగా సూర్యుడి బంగారు హస్తాల తాకిడికి తేలిపోతో మిలమిలా మెరిసిపోతో స్వచ్ఛమై పావనమై కదిలి పోతున్న గంగానది (హుగ్లి)ని చూసినప్పుడు యిది నా దేశం, యిది నా సౌభాగ్యం అని వుప్పొంగిపోయి గుండెల్లో యేదో నిండుగా ప్రవహించి కళ్ళలో యేదో క్రొత్త వెలుగుతోచి ఠీవిగా నడచిన శ్రీహరి — గార్డెన్‌రీచ్ ఆఫీసులచుట్టూ ప్రదక్షిణలు కొట్టి కొట్టి, యింతై నలుసంతై చెల్లని రికమండేషను పత్రాల ద్రోహానికి వొళ్ళు మండి పళ్ళుపిండి, బటాణీలు తిని మంచినీళ్ళు త్రాగి స్టేషన్ బెంచీలమీద పడి రాత్రిని నమలబోయి, పోలీసుల పేంబెత్తాల చురకలు తిని, వ్యవస్థను తిడ్తో అవస్థలు పడ్తో, ట్రంకుపెట్టి మోసుకుంటూ, వుదయం మనుష్యుల్ని పీల్చుకుంటూ సాయంత్రం జీవచ్ఛవాల్ని వదిలివేసే ''కలకత్తా జనవనార పొగ గొట్టాల" ఆహ్వానాన్ని స్వీకరించి కదిలిపోయాడు దేశాన్ని తిట్టుగుంటూ.

వాక్యం పూర్తి చేసి, తారకంవేపు చూశాను. మిడతలా కళ్లు మిటకరించి చూస్తున్నాడు, గుటకలేస్తూ. ఎవరేనా చూస్తే అతడిమెదడు పని చెయ్యడం మానేసి చాలాసేపయిందని ఇట్టే గ్రహించీగల్రు.

“నావల్ల కాదులెండి అలా రాయడం. వ్యాఖ్యలో విమర్శలో రాసుకుంటాను” అన్నాడు తారకం దిగులుగా.

"అయ్యో, అలా దిగులు పడిపోకు. కథ రాయాలనుకున్నావు కనక కథే రాయి. అదే వస్తుంది. అదేం బ్రహ్మవిద్యా ఏమన్నానా?" అని కొంచెం ధైర్యం నూరిపోశాను.

"మరోమాట కూడానండీ. పక్కవీధిలో మూడంతస్థులమేడలో నివాసం ఏర్పరుచుకున్న భాగ్యలక్ష్మిగారు అస్తమానం బాధ పడిపోతూంటారండీ, కూర్చుని రాసుకోడానికి తమకి వేరే గది లేదనీ, అంచేతే తాము రాయలేకపోతున్నామనీను. మరి మేం పిల్లా, మేకా వెరసి పదకొండుమందిమి మూడుగదులవాటాలో బతుకు గడుపుకుంటున్నావండీ. నాకు కూడా వేరే గది లేదు.  అదేమయినా ఆటంకం కాగలదంటారా? ." అని ప్రశ్నించేడు తారకం భ్రూకుటి ముడిచి.

"ఉన్నచోటే కూచునో నిల్చునో రాసుకుందూ. లేకపోతే ఏహోటల్లోనో, పార్కులోనో కూచుని రాసుకో," అన్నాను మరి సమాధానాలు చెప్పలేక. హోటల్లోనూ, పార్కులోనూ ఏకాంతం దొరకదు కదండీ అని అడగలేదు తారకం ఎంచేతో మరి.

వారంరోజులు పోయేక మళ్లీ వచ్చేడతను నాలుగు కాయితాలు పుచ్చుకుని.

"ఇదుగోనండీ. కథ రాసేను. మీరు చెప్పినట్టుగా రాయడం నావల్ల కాలేదండీ. నాకు తోచినట్టు రాసేను, చూసి చెప్పండి."

చూశాను. కథ బాగానే వుంది. మంచికథే. వాళ్లింట్లో రాతబల్లతో తన అనుబంధం - అ, ఆలనుండీ యమ్సెట్‌వరకూ, తనూ అక్కయ్యా ఆబల్లదగ్గర కూచుని ఆడుకున్న ఊసులూ, వేసుకున్న తగువులూ, చెప్పుకున్న రహస్యాలూ - ఆర్ద్రంగా వుంది.

నేను వల్లించిన పాఠాలేం పని చేయలేదు. బతికిపోయేను. లేకుంటే ఆబోరు దక్కునా! ఎందుకా? ఎందుకంటే జగన్మోహిని బొమ్మ వేస్తున్నప్పుడు మొహానికి చంద్రుడినీ, ముక్కుకీ సంపెంగమొగ్గా, పెదిమలకి రెండు దొండపళ్లూ వేస్తే ఎలా వుంటుందంటారు? అలాగే తయారవును నాసలహాలు పాటిస్తే.

నాకిలాటి రచయితలంటేనే ఎంతో గౌరవం. బహు మర్యాదగా "మీరు చెప్పండి" అని సలహాలు అడగొచ్చు. నేను అలా "బహు మంచి సలహాలు" ఇచ్చినందుకు ఆనందం కూడా వెలిబుచ్చొచ్చు. ఆ పైన వాళ్ల మనసుకి నచ్చినట్టు, చేతిలో కలం నడిచినట్టు రాసుకుపోవాలి. మంచి కథకుల లక్షణం అదే మరి.

అలా చేస్తేనే ఉభయతారకం!

(ఏప్రిల్ 2009)

# 11. నీకోసం

ఉధృతంగా మంచు కురుస్తుంటే కిటికీలోంచి చూస్తూ కూర్చుంది ధరణి. ఆదివారం కనక సరిపోయింది. లేకపోతే నానా తిప్పలూ అవును ఆఫీసు చేరడానికి. నిన్న దినకర్‌తో వచ్చిన తగువు ఇంకా పచ్చిగానే వుంది. అతనికి మాత్రం పట్టినట్టు లేదు. రాత్రి మంచంమీద వాలినవాడు వాలినట్టే పడి నిద్ర పోతున్నాడు. తొమ్మిదయినా లేచే జాడల్లేవు.

వుండీ వుడిగీ, కువకువలాడుతూ ఆకాశంలో కొంగలు బారులు బారులుగా దక్షిణానికి తరలిపోతున్నాయి "శిశిరం ప్రవేశించనున్నదహో" అని చాటుతూ. తను వాటిని ప్రతియేడూ చూస్తూనే వున్నా ఎప్పటికప్పుడు కొత్తే. ప్రతిసారీ ముచ్చటే ఆ బారులు తీరు. చక్కగా సైనికులు కవాతు చేస్తున్నాట్టు వరసలు ఎలా కడతాయో! ధరణికళ్లు ఆకాశంమీంచి భూమ్మీదకి తిరిగేయి. ఇంటిముందు చెట్లకింద ఉడతలు హడావుడిగా పుట్టల్లోకి కాయలు చేరేస్తున్నాయి. అవి ఒక్క శిశిరానికి చాలినంత మాత్రమే పోగు చేసుకుంటాయిట. వాటికున్నపాటి జ్ఞానం మనిషికి లేదేం? మనిషిని rational animal అనడం అన్యాయం అనిపిస్తోంది చూస్తుంటే. అయినా ఆమాట అన్నది మాత్రం ఎవరు కనక? మనిషే కదా! మనకి మనమే కితాబులిచ్చుకోవాలి మరి! మనం ఇలా అనుకుంటున్నాం అని తెలిస్తే ఆ కొంగలూ, ఉడతలూ నవ్వుకోవా?

ధరణికి తాను అమెరికాకి వచ్చిన తొలిరోజులు గుర్తొచ్చేయి. "నీకేం కావాలేం కావాలి? నీకు ఏమిటి ఇష్టం.? ఏమి నీ కోరిక?" అంటూ పదే పదే అడుగుతూ, తన ఇష్టాయిష్టాలు కనుక్కుంటూ దినకర్ సకలం అమరుస్తూంటే పొంగిపోయింది. కొత్త బల్లలూ, కుర్చీలూ, మంచాలూ కొన్నాడు. కిటికీలకి కొత్త కర్టెనులు అమర్చేడు. ఊళ్లో అందరికీ "మై మిసెస్" అంటూ గొప్పలు పోతూ చూపించేడు. "అబ్బ, ఇతడికి నేనంటే ఎంత ప్రేమా" అనుకోకుండా వుండలేకపోయింది మనసులోనే.

అతను రోజుకి పదిసార్లు చెప్తాడు ఆమె ఎంతో అందంగా వుందనీ, చీరెల్లో రంగారు మెరుపులకి కళ్లు బైర్లు కమ్ముతున్నాయనీ. "ఐ లవ్ యూ" అంటూ ఏకధాటిగా తిరుమంత్రం జపిస్తూనే వుంటాడు. ఓరోజు "నువ్వు చెప్పవేం? డు యూ లవ్ మీ?" అని కూడా అడిగాడు.

"ఏమో నాకు అలా మాటాడడం రాదు. మనం అలా మాటాడం కదా" అంది ధరణి తేలిగ్గా నవ్వేస్తూ.

గృహలక్ష్మి అమెరికనింట అడుగు పెడుతూనే, అతనికి పెద్ద ప్రోజెక్టు తగిలింది. అతను ఎగిరి గెంతేసి, "ఐ లవ్యూ సోఓఓఓ మచ్" అన్నాడు ఆ "సో"ని బారెడు సాగతీస్తూ. "ఇదంతా నీ అదృష్టమే. నువ్వు ముందెప్పుడో

బంగారుపూలు పూజ చేసుకుని పుట్టేవు. అంచేతే నాలాటి మేధావి నీకు లభించేడు." అని కూడా అన్నాడు బోరవిరుచుకుని, ఎదనిండా గాలి పీల్చుకుని.

ధరణి అతనిమాటలకి నవ్వింది మనస్ఫూర్తిగానే.

ఆ ఘనతర ప్రోజెక్టు నాలుగునెలల్లో అంతమయిపోయింది. మరో మంచి ప్రోజెక్టుకోసం వెతకడం మొదలుపెట్టేడు. ఇక్కడ "మంచి" అన్నపదం మనం గుర్తుపెట్టుకోవాలి. తన మేధాసంపత్తిని సవ్యంగా ఉపయోగించుకోగల ప్రోజెక్టు అయితేనే చేపట్టడానికి నిశ్చయించుకున్నాడు. దానికోసం ఎదురుచూస్తున్నాడు.

ధరణికి మొదట్లో ఏమీ అనిపించలేదు కానీ రోజులు గడుస్తున్నకొద్దీ తనఆలోచనలు మరో దిక్కున సాగేయి. చిన్నబెరుకు మొలకెత్తి, నెమ్మదిమీద ననలు తొడిగి, రెమ్మలు తేరి, మహావృక్షమయి ఎదుట నిలిచి వుంది ఇప్పుడు. మొదట్లో రెండో, మూడో ప్రోజెక్టులు ఏవో కారణాలు చెప్పి దాటేసినప్పుడు అది అంతగా బాధించలేదు. "అవున్లే, ఎవరికి మాత్రం వుండదు తమసామర్థ్యాన్ని సవాలు చేయగల ఉద్యోగం కావాలని? అలా ఆశించడంలో తప్పేం లేదు" అనుకుంది. క్రమంగా రోజులూ, వారాలూ, నెలలూ గడుస్తున్నకొద్దీ ... అతను "పని చెయ్యనికాలం" ఎక్కువయేకొద్దీ రాగల అవకాశాలు మరీ తగ్గిపోతాయన్న వాస్తవం కళ్లముందు కదులుతూ గుండెల్ని పిండేస్తోంది. అంత మేధావి దినూకి ఆమాత్రం తెలీదా అన్న సంశయం కూడా కొరుక్కుతినేస్తోంది లోలోపల.

అలాటిరోజుల్లోనే, మైక్రోసాఫ్టు కంపెనీవాళ్లు పిలిచారు ఇంటర్వ్యూకి రమ్మని.

దినూ వెళ్లలేదు.

"అదేం?" అడిగింది ధరణి కళ్లు చికిలించి. మరొకరయితే ఎగిరి గెంతేద్దురు ఇంటర్వ్యూకే.

"ఆ మేనేజరు నాతో పదోక్లాసు చదివేడు. నా ఐక్యూలో సగం లేదు వాడికి. వాడికింద నేను పని చెయ్యడం ఏమిటి? అబ్సర్డ్," అన్నాడు.

ఇంటర్వ్యూకే వెళ్లలేదు. వుద్యోగం వచ్చేసినట్టు మాటాడాతాడేం అనిపించింది కానీ అడగలేదామాట. నాలుగువారాలు పోయేక, మరో కంపెనీవారు పిలిచారు. దానికీ వెళ్లలేదు. ఏం అంటే, తన క్లాస్మేటు అన్నగారు సి.యి.వో.ట అక్కడ. మరోసారి, ఆస్టిన్‌లో ఇంటర్వ్యూకి వెళ్లేడు కానీ ఊరు బాగులేదన్నాడు.

అతనిధోరణి రాను రాను అయోమయం అయిపోతోంది. అసలు అతనికి ఉద్యోగం చేసేవుద్దేశం వుందా అన్న అనుమానం కూడా కలుగుతోంది. ఉద్యోగం పురుషలక్షణం అని నానుడి. నిజానికి ఈరోజుల్లో పురుషులే కాదు స్త్రీలు కూడా నాలుగ్గోడలమధ్యా వూరికే గోళ్లు గిల్లుకుంటూ కూర్చోడం లేదు. ఒంటిమీద చొక్కాలాగ

తలకాయల్ని గోడని కొక్కేలకి తగిలించేసి, బేఖతర్‌గా కూర్చోడంలేదు. అసలు అలా ఎవరు గానీ కూర్చోగలరని ధరణి ఊహించను కూడా లేదెప్పుడూ. తనకి సాధ్యం కావడంలేదు.

చూస్తూండగానే ఏడాది దాటింది. తనకి ఏదో ఒకటి చెయ్యాలనిపిస్తోంది. అత్యవసరంగా. ఉద్యోగం అనండి, కాలక్షేపం అనండి ఏదో ఒకటి చెయ్యాలి.  పైగా దినకర్‌కి కూడా మరో ప్రోజెక్టు కనుచూపుమేరలో లేకపోవడంతో, ఇద్దరూ మొహమొహాలు చూసుకుంటూ ఇంట్లో కూర్చోడం కాస్త చిరాగ్గానే వుంటోంది కూడాను. "ఇదెంత కాలం సాగుతుందో తెలీదు. ఇలా మరో నెల రోజులయిందంటే నాకు పిచ్చెక్కిపోవడం ఖాయం. ఏదో చూసుకోవాలి" అనుకుంది. ఆతరవాత, రెండో ప్రశ్న, దినకర్ ఒప్పుకుంటాడా? అన్నది.

ధరణి అనుకున్నట్టే, అతను మొదట, "ఎందుకంత తొందర? నాకు మంచి ప్రోజెక్టు వస్తుంది. చూస్తూండు. ఇప్పుడేం తిండికి జరక్కుండా పోలేదు కదా." అన్నాడు.

"తిండికి జరగడంలేదని కాదు. నాకిలా ఊరికే కూర్చుంటే పిచ్చెత్తిపోయేలా వుంది. ఏమాత్రమో బుర్రుంది కదా దానికేదో పని ఒప్పచెప్పాలి. అందుకూ" అంది క్షమాపణలు చెప్పుకుంటున్నట్టు.

వాదనలు రెండు రౌండులయేక, సరే నీఇష్టం అన్నాడు అతను.

మొదట యమ్మెస్సీ చేసింది కనక పి.హెచ్.డీ చేద్దాం అనుకుంది. కానీ ముందు యమ్మెస్సీ కోర్సులు కొన్ని మళ్లీ చెయ్యాలన్నారు. దాంతో, అది వదిలేసి, ఉద్యోగాలు చూసుకోడం మొదలుపెట్టింది. తనవిద్యని సద్వియోగం చేసుకునే వుద్యోగాలు షికాగోలోనూ, మినియాపోలిస్‌లోనూ వచ్చేయి కానీ ఆవిడవెంట అతను వెళ్లడానికి సిద్ధంగా లేడు. తనకి న్యూయార్కులోనే కాకపోతే న్యూజెర్సీలో మరో వుద్యోగం వచ్చితీరుతుందని హామీ ఇచ్చేడు. అంచేత భర్తొచోటా, భార్యొకచోటా వుండి, వారాంతాల్లో మాత్రం, కలుసుకుంటూ చేసుకునే కాపురానికి ఇద్దరూ సిద్ధంగా లేరు. అలా మరో ఆర్నెల్లు గడిచేయి. వున్న వూళ్లోనే ఒక బాంకులో కస్టమర్ రెప్ అవకాశం వచ్చింది. గొప్ప సంతృప్తినిచ్చే వుద్యోగం అని కాదు. తన చదువుకి తగిన పని కాదు. ఆసక్తి అసలే లేదు. కానీ .. నాలుగ్గోడలమధ్య కులాసాజైలు జీవితం గడపలేక చేరిపోయింది, ఆ అమ్మాయి చురుకుదనమూ, తెలివితేటలూ గమనించి, మూడునెలలు తిరక్కుండా, బాంకువాళ్లు ఫుల్ టైం సూపర్వైజరుగా చేసేరు. ఆదాయం బాగుంది.

దినూఅభిప్రాయం మాత్రం ధరణి sold herself short అనే. తాను చచ్చినా అలా చెయ్యలేడు.  అలా సరిపెట్టుకోడం అతని తత్త్వంలో లేదు. ధరణి బాంకులో చేరుతున్నానని చెప్పినప్పుడు చిరాకు పడ్డాడు. "నేనయితే చేరను అలాటి కొరగాని పనిలో" అన్నాడు. అతని దృష్టిలో అది పరమహీనం.

ధరణికి మనసంతా గందరగోళంగా వుంది. చిరాగ్గా వుంది. అస్తమానం ఐలవ్యూ అంటూ జపించే ఈమనిషికి తనబాధ ఎందుకు అర్థం కాదు? అసలు ప్రయత్నం కూడా చెయ్యకపోతే ఏం అనుకోడం? ఉన్నఉద్యోగాలే ఊడిపోతున్న ఈరోజుల్లో చేతులు ముడుచుకు ఇంట్లో కూర్చున్న ఈమనిషిని వెతుక్కుంటూ వచ్చి, ఉద్యోగాలిచ్చే కంపెనీలుంటాయా?

ఓరోజు ధరణి పేపరు చూస్తుంటే, ఓ ప్రకటన కనిపించింది. "ఇదుగో. ఇది చూసావా?" అంది పేపరు అతనికి అందిస్తూ, మామూలుగానే.

"ఏంకథ? నువ్వు నాకు ఉద్యోగాలు చూసేదాకా వచ్చింది వ్యవహారం. నేను అంత చేతకానివాణ్ణి అనా?" అన్నాడు దినూ ఉరిమి చూస్తూ.

ధరణి చిన్నబుచ్చుకుంది. "నువ్వు చూసుకోలేవన్నానా? ఏదో చూస్తుంటే కనిపించింది. చెప్పేను."

"నేను చూడలేదని ఎందుకనుకున్నావు?"

"ఇప్పుడే కదా పేపరొచ్చింది. నేను ముందు తీసుకున్నాను కదా"

"అసలు నీమనసులో వున్నమాట చెప్పరాదూ? పనీ పాటూ లేకుండా కూర్చోడం నాకు సరదా అని నీ అభిప్రాయం. అవునా?"

"ఎందుకలా పెడర్థాలు తీస్తావు? నేనేం అన్నానిప్పుడు?."

"మరేమిటో చెప్పు నీబాధ? నేను ఎదురుగా కనిపిస్తుంటే నీకు కష్టంగా వుందా? చూస్తూ వుండు. నీకిప్పుడు ఇలా వుంది కానీ తరవాత నేను హైరాంక్ జాబ్ తీసుకుని, బిజీ బిజీ అయిపోయినప్పుడు, నేను ఇంట్లో కనిపించడమే లేదంటూ బాధ పడిపోతావు. అసలు ఎందరాడాళ్లు 'మావారు ఇంట్లో వుండనే వుండరు' అంటూ ఆరాటడిపోతున్నారో తెలుసా నీకు?"

"సరేలే. నాదే పొరపాటు. నేనింక మాటాడను."

ధరణి లేచి పక్కగదిలోకి వెళ్లిపోయింది. మాటకి మాట తెగులు. తనే ఊరుకుంటే సరి అని ఎంత సర్ది చెప్పుకున్నా గానీ ఎదలో ముల్లయి కెలుకుతూనే వుంది. సంసారం అన్నతరవాత మంచీ, చెడ్డా వుంటాయి. "అరమరికలు లేకుండా" అంటే మనసిచ్చి మాటాడుకోడమే కదా. మరి ప్రతిమాటకీ పెడర్థాలు తీస్తూంటే ఎలా వేగడం? నన్ను అడుగుతాడు కదా నీకేం కావాలి? అని. మరి నాకు మాత్రం అలా వుండదా? అతనికేం కావాలన్న తపనా, అవి తీరడానికి తనకి చేతనయిన సాయం చెయ్యాలన్న కోరికా? అందులో తప్పేమిటి?

ఆలోచనలయితే సవ్యంగానే వున్నాయి కానీ అవి అతనికి ఎలా బట్వాడా చెయ్యాలో తెలీడం లేదు ఆ అమ్మాయికి. అమెరికాలో talk, talk, అంటారు కానీ చెప్పేవారికి చెప్పాలని వుంటే చాలదు. ఎదటివారికి విందాం అన్న దృష్టి కూడా వుంటేనే ఆ "టాకు" సాగేది. అది దినూతత్త్వంలో లేదు.

దినూ ఓ గంట తరవాత శాంతించేడు. "పాపం, ఒఠ్ఠి అమాయకురాలు, అమ్మాయికి లోకజ్ఞానం అస్సలు లేదు," అనుకుంటూ గదిలోకి వచ్చి "సారీ" చెప్పాడు. "నీకే నాసామర్థ్యంలో నమ్మకం లేకపోతే ఎలా చెప్పు?" అన్నాడు తన బాధనంతా గొంతులో పలికిస్తూ.

"నాకు నమ్మకం లేదన్నానా?" అంది ధరణి నెమ్మదిగా.

"అసలు నాపేరే దినకర్. అంటే ఏమిటనుకున్నావు? లోకాన్ని తన దివ్యప్రభలతో చైతన్యవంతం చేసేవాడు. నా తెలివితేటలూ, సామర్థ్యమూ  గుర్తించినవాళ్లు, వాటి విలువ తెలుసుకున్నవాళ్లు - వాళ్లే నన్ను వెతుక్కుంటూ వస్తారు, చూస్తూ వుండు. అప్పుడు నువ్వే విచారిస్తావు, అనవసరంగా అబ్బాయిగారిని ఎంత బాధ పెట్టేనూ నాఅజ్ఞానంమూలంగా అని." అన్నాడు నవ్వుతూ.

ధరణికి అందులో హాస్యం కనిపించలేదు. పైకి హాస్యానికి అంటున్నట్టున్నా, అతడు ఆ మాటలు మనసా నమ్మి చెబుతున్నట్టే వినిపించాయి ఆ అమ్మాయికి.

మళ్లీ దినూయే అన్నాడు, "లేదులే. నువ్వు సదుద్దేశ్యంతోనే చెప్పావని నాక్కూడా తెలుసు. నేనలా విసుక్కోడం పొరపాటే. మళ్లీ ఎప్పుడూ అననులే" అన్నాడు మృదువుగా. ఆ సాయంత్రం "వంట చెయ్యకు. బయట తిందాం" అన్నాడు ఓదార్పుగా. "లే, బట్టలు మార్చుకు రా. హిల్టన్‌లో రిజర్వేషను చేయిస్తాను". ఆపూట భార్యకి హైక్లాసు హోటల్లో ఖరీదయిన భోజనం పెట్టించాలని మహ సరదా పడింది అతడి మనసు.

ధరణి లోపలికెళ్లి తనకి ఎంతో ఇష్టమయిన డ్రెస్ వేసుకుంది - పాలనురుగలాటి తెల్లటి బ్లౌజుమీద నీలినీడల్లా లేతనీలిరంగు పూలు, దానికి తగిన లేతనీలిరంగు పాంటు. తనకి ఆ రంగులు ప్రశాంతంగా ఉంటాయి. మనసు ఉల్లాసంగా వుంటుంది.

అందంగా అలంకరించుకుని వచ్చిన భార్యని రెండు క్షణాలు తేరి చూసి, దినూ "నైస్" అన్నాడు. ఆ అనడం నైసుగా లేదు. ఏదో మొక్కుబడికి అన్నట్టు వుంది.

"ఏం బాగులేదా?" అంది ధరణి అతనివేపు చూడకుండా.

"కెంపురంగు డ్రెస్‌లో నువ్వెంతో అందంగా వుంటావు. అది వేసుకోరాదూ?"

ధరణికి కెంపురంగు ఇష్టంలేదు. ... "మొన్న ప్రకాష్ వాళ్లింటికి వెళ్లినప్పుడు వేసుకున్నాను కదా. అసలీమధ్య ఎక్కడికి వెళ్లినా అదే వేసుకుంటున్నాను అని ఇవాళ ఇది వేసుకున్నాను. సరేలే, మార్చుకొస్తాను. ఏదయితేనేమిటి?" అంది ధరణి లోపలికి వెళ్తూ.

అంతరాంతరాల ఎక్కడో అదే మాట - "ఏదయితేనేమిటి? మార్చుకోనక్కర్లేదులే" అని అతనంటే బాగుండును అనిపించింది. ... అంత సరదా వుంటే మరో డ్రెస్సు తనకిష్టమయిన రంగుడ్రెస్సు కొనివ్వొచ్చు కదా! ఆమాటే ఒకసారి అతనితో అంది కూడాను.

"ఏం, నా ఎంపిక బాగులేదా?" అన్నాడతను. అందంవిషయంలో తనకి తెలిసినంతగా మరెవరికీ తెలియదని అతని అభిప్రాయం. ఆ కెంపురంగు డ్రెస్ నెలరోజుల క్రితం, ఇలాటి తగువే వచ్చినప్పుడు "సర్‌ప్రైజు" బహుమతిగా కొన్నాడు. ఈ నెల రోజుల్లోనూ చాలాసార్లే వేసుకుంది అది. ఇదే సంభాషణ చాలాసార్లే అయింది ఇద్దరిమధ్యా.

ధరణి లోపలికి వెళ్లి బట్టలు మార్చుకుని, దానికి నప్పిన జోళ్లేసుకుని, చేతిసంచీ పుచ్చుకు బయల్దేరింది.

"చూడు ఈ డ్రెస్‌లో ఎంత అందంగా వున్నావో. రెస్టారెంటులో జనాలు భోజనాలు మానేస్తారు నిన్ను చూస్తూ."

"సరేలే. మాటలు నేర్చావు."

మర్నాడు కూడా బోల్డుసార్లు 'సారీ'లు చెబుతూనే వున్నాడు. ఆ సాయంత్రం "ఇవాళ వంట నేను చేస్తాను. వంకాయ వేపుడు నీకు ఇష్టం కదా, చేస్తాను."

"నీకూ ఇష్టమే కదా. నేనే చేస్తాలే, మెంతికారం పెట్టి" అంది ధరణి లేస్తూ.

"రెండు రకాలుగానూ చేసుకుందాం," అన్నాడు దినూ హుషారుగా.

వంకాయ వేపుడూ, మెంతికారం పెట్టీ - కూర రెండురకాలుగానూ చెయ్యొచ్చు. రెండు డ్రెస్సులు ఒక్కసారే వేసుకోగలిగితే ఎంత బాగుండు అనుకుంది ధరణి మనసులో.

ఆమె వంట పూర్తి చేసి, అధికంగా, అతనికి ఇష్టం అని కేరట్ హల్వా కూడా చేసి, బల్లమీద వంటకాలూ, కంచాలూ పెట్టి "రా, భోంచేద్దాం" అని పిలిచింది.

"కూర ఎంతో బాగా కుదిరింది." అని మెచ్చుకున్నాడు. "నీకు కోపం వచ్చినప్పుడు మరీ బాగుంటాయి సుమా నీ వంటలు" అంటూ మేలమాడేడు.

అతనిమాటలకి ఆమె పొంగిపోయింది. ఆమె వంటలకి అతను ఆనందించాడు. వాన వెలిసింది

***

ధరణి గుండెలు కూడదీసుకుని ఓరోజు అంది, "నీకు ఎవరికిందా పని చెయ్యడం ఇష్టంలేదు. నీఅర్హతలకి తగిన ఉద్యోగం చూపించే కంపెనీలు లేవు. వాళ్లెవరో నీ తెలివితేటలు గుర్తించడంలేదని విచారించడం ఎందుకు? నువ్వే ఓ కంపెనీ పెట్టి, ముల్లోకాలకీ నీ సామర్థ్యం వెల్లడి చేసేయొచ్చు కదా. అప్పుడయితే నువ్వు ఎవరికీ జవాబు చెప్పుకోనక్కర్లేదు సరికదా మరో నలుగురికి నువ్వే పని చూపించినవాడివి అవుతావు," అంది.

దినూ ఠక్కున తలెత్తేడు కోడెతాచులా. తను చేతకానివాడని ఎత్తిపొడుస్తోందా? ఇంతలు కళ్లు చేసుకుని ఆమెవైపు చూశాడు. తన భార్య తనని హేళన చేస్తున్నట్టు అనిపిస్తోంది. అతనికి ఒళ్లు భగ్గున మండింది.

"షటప్" అని అరిచాడు.

ధరణి వణికిపోయింది లేమావి చివురులా. గుండెలు దడగడ కొట్టుకున్నాయి. అతనిలో అంత ఔద్ధత్యం ఏనాడూ చూడలేదు. అతనికి ఇంత కోపం వుందని ఎప్పుడూ అనుకోలేదు. ఆమాటకొస్తే అసలు తన జీవితంలోనే ఎరగదు అలాటి కోపం. అమ్మా, నాన్నా తనని ఏనాడూ పల్లెత్తు మాట అనలేదు  పుట్టి, బుద్దెరిగి. కసురుకోడందాకా ఎందుకు, గట్టిగా మాట కూడా అన్నవాళ్లు లేరు. నాన్నకి తనంటే ప్రాణం. ఆయనని తను ఎంతో విసిగించినప్పుడు కూడా "ఇంత పట్టుదల అయితే ఎలా అమ్మా?" అంటూ ఎంతో నెమ్మదిగా చెప్పేవారు. సాటిపిల్లలు "మానాన్న చీరేస్తాడు, మాఅమ్మ కొడుతుంది," అని చెప్పినప్పుడు తనకి ఆశ్చర్యంగా వుండేది. స్కూల్లో టీచర్లందరికీ తనంటే ఎంతో ఇష్టం తను చాలా తెలివైనదీ, బుద్ధిమంతురాలూనని.

ధరణి అతనివేపు కళ్లప్పగించి చూడసాగింది. కాళ్లలో రక్తం గుండెలకి ఎగదన్నింది.

దినూ భార్యకి దగ్గరగా వచ్చి, మొహంలో మొహం పెట్టి, "నాకు నీసలహాలు అక్కర్లేదు, అర్థమయిందా? మళ్లీ ఎప్పుడూ నాతో అలా చెప్పకు, నెవర్, నెవర్," అన్నాడు కరుగ్గా.

అతను అలా మీదమీదకి వచ్చేసి మాటలంటుంటే భూమండలం గిరగిరా తిరిగింది కళ్లముందు. గబుక్కున లేచి పక్కగదిలోకి వెళ్లిపోయింది.

దినూ చేతిలో కాఫీకప్పు విసురుగా బల్లమీద పడేసి పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వీధిలోకి వెళ్లిపోయాడు. కాఫీ ఒలికి కాగితాలు తడిసిపోయేయి. కాఫీ కార్పెట్‌మీద పడి మరకలయేయి.

దినూ ఎక్కడెక్కడో తిరిగి, అర్ధరాత్రి దాటింతరవాత ఇల్లు చేరేడు. అప్పటికి కాస్త మనసు స్థిమితపడింది. గంటన్నరసేపు "సారీ, పొరపాటయిపోయింది, సారీ, టెరిబ్లీ సారీ" అంటూ వదలకుండా విచారం వెలిబుచ్చాడు

మళ్లీ. అసలు తనకంత కోపం వుందని ఇంతవరకూ తనకే తెలీలేదన్నాడు. “మళ్లీ జన్మలో ఎప్పుడూ ఇలా జరగదు, జరగనివ్వను” అన్నాడు.

ధరణి “సరే” అంది ముభావంగా.

***

ఆఫీసులో పరధ్యానంగా వున్న ధరణిని చూసి, “ఏం, అలా వున్నావు?” అనడిగింది స్టెల్లా.

స్టెల్లా ఈమధ్యనే కొత్తగా చేరింది ఆఫీసులో. తనకి తెలీని విషయాలు ధరణిని అడిగి తెలుసుకుంటోంది. ఆవిడకి ఈ తెలుగుఅమ్మాయి అంటే మంచి గురి ఏర్పడిపోయింది అచిరకాలంలోనే. భారతీయ సంస్కృతి మహోన్నతమయినదని ఆవిడ వింది. అప్పుడప్పుడు మన సాంప్రదాయాలగురించి అడుగుతూ వుంటుంది తనని.

“ఏం, అలా వున్నావు?”

ధరణికి ఆమాట చల్లగా, సూటిగా మనసుకి తగిలింది. స్టెల్లా ఎంతో ఆత్మీయురాల్లా కనిపించింది. అమ్మా, నాన్నా, అన్నా, చెల్లీ, ఒకే కంచంలో తిని ఒకే మంచంలో పడుకున్న నేస్తులూ - అందరూ వున్నారు కానీ వాళ్లున్నది భూగోళానికి ఆవలితీరంలో. ఇక్కడ … ఇప్పుడు .., ఈక్షణంలో “అలావున్నావేం? ఏమయింది?” అని అడిగేవాళ్లు లేరు. అలా అడగగల ఒకే ఒక మనిషికి ఆ ధ్యాస లేదు.

ధరణిమనసు కిటకిటలాడింది. తలొంచుకుని “ఏం లేదు. బాగానే వున్నాను” అంది నెమ్మదిగా.

“లంచి టయిమవుతోంది. Early lunch తీసుకుందాం, వస్తావా?” అని అడిగింది స్టెల్లా.

ధరణి నెమ్మదిగా తలూపి, లంచిబాక్సు తీసుకుని లేచింది. ఇద్దరూ కాఫీరూంలో ఓమూల కూర్చున్నారు. ఇంకా లంచిటైం కాలేదు కనక ఎవరూ లేరు ఆ చుట్టుపట్ల.

ధరణి ముందురోజు సాయంత్రం జరిగిన తగువు నాలుగుముక్కల్లో చెప్పి, “నాకేం చెయ్యాలో తోచడంలేదు. మంచి పరువంలో వున్న కుర్రాడు, ఎన్నదగ్గ చదువూ, అర్హతలూ వున్న మనిషి, నిశ్చింతగా  నెలలతరబడి ఇంట్లో ఎలా కూర్చోగలుగుతున్నాడో, అతనితత్త్వం ఏమిటో నాకు అర్థం కావడం లేదు.” అంది ధరణి తనలో తను మాటాడుకుంటున్నట్టు.

“మీదేశంలో అలా పెద్దచదువులు చదువుకున్నవాళ్లు ఏం చెయ్యకుండా ఇంట్లో కూర్చోడం చేతకానితనం అనుకోరా? తప్పుగా భావించరా? అందులోనూ మగాళ్లు?”

“అదేం లేదు. రెండుతరాల పూర్వం మీకూ అంతే కదా. మాక్కూడా మగాళ్లు breadwinners, ఆడవాళ్లు homemakers అనే సాంప్రదాయం. ఇప్పుడిప్పుడే మారుతోంది. మా అమ్మమ్మ అయితే ‘ఉద్యోగం పురుషలక్షణం అనీ, ఆడదానిసంపాదన కూచుని తింటావుట్రా’ అనీ దులిపేసి వుండేది వెనకటిరోజులయితే. మాఅమ్మ కాలం వచ్చేసరికి కొంత మారింది. మాఅమ్మ ఉద్యోగం చేస్తున్నా, ఇంటిబాధ్యతలన్నీ ఆవిడవే. ఇప్పుడు మగవాళ్లు కూడా ఇంటిపనుల్లో ఓ చెయ్యేస్తున్నారు. అయితే మీలాగ ఇంకా వేరు వేరు ఎకౌంట్లు లేవు. కానీసం ఇప్పటికి లేదు, నీడబ్బూ, నాడబ్బూ అని.” అంది ధరణి. ఇలా మాటాడుతుంటే తనకే కొన్ని విషయాలు స్పష్టమవుతున్నాయి అనుకుంది ఆశ్చర్యపోతూ!

“ఇక్కడ మగాళ్లు ఇంట్లో వున్నా ఏదో ఓ పని చూసుకుంటారు కానీ వూరికే కూర్చోరు, ఏది కానీ తమకి తాము సమకూర్చుకోవాలి కానీ వాటంతట అవే సమకూడుతాయనో, ఎవరో చేసి పెడతారనో ఎదురుచూస్తూ కూర్చోరు. ఈమధ్య stay at home dads సంఖ్య పెరుగుతోంది. అదీ పిల్లలుంటేనూ, భార్యలకే మంచి వుద్యోగాలు అయితేనూ అలా చేస్తున్నారు. అప్పుడు కూడా వూరికే కూర్చోరు. తమతెలివితేటలు ఉపయోగించుకోగల పని ఏదోఒకటి  చూసుకుంటారు సాధారణంగా,” అంది స్టెల్లా రెండుతరాల పూర్వంమాట తప్పించేసి.

ధరణి కొంచెంసేపు ఊరుకుని, నెమ్మదిగా ఎటో చూస్తూ, “నేను క్షమాపణలు చెప్పుకున్నాను,” అంది.

“అతను ఏమన్నాడు?”

ధరణి అడ్డంగా తలూపింది ఏమీ లేదు అన్నట్టు. “మళ్లీ తరుచూ చెప్తాడు నేనంటే చాలా లవ్వుందని.”

“మాటంటే ఏం లాభం? క్రియలో కూడా కనిపించాలి కదా. మీద వాన పడితే కింద నేల తడి కాదా?” అని ఓ క్షణం ఆగి “నేనయితే కౌన్సిలింగుకి వెళ్దాం రమ్మంటాను” అంది స్టెల్లా.

“అది కుదిరేది కాదు. తనకంటే మేధావి లేడు అనుకునేవాడికి మరొకరిని సలహా అడగడానికి కూడా నామోషీయే కదా.  అహం అడ్డొస్తుంది.”

“క్రమంగా అతనికే తెలుస్తుందిలే” అంది స్టెల్లా ఓదార్పుగా.

ధరణి తలూపింది. ఇద్దరూ లేచారు.

ఆ సాయంత్రం పని అయింతరవాత ఇంటికి బయల్దేరింది కానీ వెళ్లాలంటే వుత్సాహంగా లేదు. దారిలో వున్నపెద్ద లేక్ పక్కనించి కారు పోతుంటే కాస్సేపు ఆగుదాం అనిపించింది. నెమ్మదిగా కారు రోడ్డువారకి తీసి, దిగి, నీళ్లకి కొంచెం ఎడంగా కూర్చుంది. దూరాన నీళ్లలో తెరచాపలెత్తి పడవల్లో షికార్లు కొడుతున్నారు

కొందరు. అట్టే లోతు లేనిచోట పిల్లలు ఈతలాడుతుంటే, తల్లులూ, తండ్రులూ నిలబడి, వాళ్లమీద ఓ కన్నేసి, కబుర్లు చెప్పుకుంటున్నారు.

ధరణి ఎడతెగని ఆలోచనలతో సతమతమవుతోంది. నిన్నరాత్రి దినూ పడుకోబోతూ, "ఇదంతా ఎవరికోసం? నీకోసం కాదూ?" అన్నాడు. నాకోసమేనా? జీవితంలో నేను కోరుకుంటున్నది ఏమిటి? నిఝం నిఝంగా? అమెరికాకి రాకుండా, దేశంలోనే వుండివుంటే, ఏమయేది? ఈసరికి ఏకాలేజీలోనో రీడరయివుండును. ఈ బొచ్చెలు కడుక్కోడం, బట్టలుతుక్కోడం లేకుండును. అవే తనకి కావలసినవి అని అనుకుందా ఎప్పుడయినా? రీడరయితే, అధికంగా ఏం వొచ్చును? సంఘంలో పేరూ, డబ్బుతో వచ్చే సౌఖ్యాలూ వచ్చును, ... తరవాత? ఏమో. ఇక్కడ మాత్రం తను వొడిచేస్తున్నది ఏమిటి?  బాంకులో చేరింది. తను చదివిన బయాలజీకి ఏసంబంధం లేకపోయినా, మాస్టర్సు డిగ్రీ చూసి, తనకి ఆస్థాయి మెదడు వుందని ఇచ్చేరు.

ధరణి బాంకులో చేరినకొత్తలో లంచిరూంలో నలుగురు చేరేరు. ధరణి కూడా అక్కడే వుంది. మాటలసందర్భంలో "మీవారు ఏంచేస్తున్నారు?" అని ఎవరో అడిగేరు.

"ఏంలేదు" అంది తేలిగ్గా.

"హా?"

ఆ మనిషిమొహం చూసి, వెంటనే అర్జెంటుగా వివరించవలసిన అవుసరం వున్నట్టు గుర్తించి,  "అంటే ప్రస్తుతం ఏంలేదు అంటున్నాను. అతను ఇంజినీరు. చాలా మంచి ప్రోజెక్టులలో పనిచేశాడు. మరో మంచి ప్రోజెక్టుకోసం చూస్తున్నాడు ఇప్పుడు." అంది గబగబా. మనహాస్యాలు వీళ్లకి అర్థం కావు అని ధరణికి అర్థమయింది అప్పుడే.

"ఓ అలాగా" అంది ఆవిడ.

"Who's wearing the pants?" అంది మరొకావిడ. ధరణికి అది అర్థం కావడానికి రెండు క్షణాలు పట్టింది. కోపం వచ్చి, అక్కడినుండి వెళ్లిపోయింది. ఆతరవాత "లైటెన్ చెయ్యడానికి, వూరికే అలా అన్నాన"ని అంది ఆవిడ కానీ ధరణికి మాత్రం ఆమాట మర్చిపోడం సాధ్యం కాలేదు.

తరవాత వాళ్లలో వాళ్లు మాటాడుకుంటున్నా, తనని ఉద్దేశించి మాటాడుతుట్టే అనిపిస్తోంది.

"టామ్ ఇలాగే ఉద్యోగం సద్యోగం లేకుండా ఇంట్లో కూర్చుంటే. తగిలేశాను. అలాటి మగాడు వుంటే ఎంత, లేకపోతే ఎంత."

"మావారు ఇలాగే పిచ్చికారణాలు చెప్తూ ఇంట్లో కూర్చుంటే, ఇంటిపని పూర్తిగా ఒప్పజెప్పేశాను. ఇప్పుడు నేనే నిజభర్తని.  నన్ను కార్లో ఆఫీసుకి తీసుకురావడం, మళ్లీ ఇంటికి తీసుకెళ్లడంతో సహా."

"పెళ్లి చేసుకున్నది ఆయన్ని నేను సాకడానికా? అంతకంటె ఓ కుక్కపిల్లని పెంచుకోడం నయం."

"ఏదో లోపం వుండి వుండాలి, లేకపోతే ఇంతకాలం ఉద్యోగం దొరక్కపోవడమేమిటి?  Personality సమస్యేమో."

"సోషల్ స్కిల్స్ తక్కువో, ఫెయిలవుతానన్న భయమో."

"నిజంగా అంత తెలివితేటలుంటే ఈపాటికి ఏదో ఓ వుద్యోగం రాకపోనా?"

"ఈదేశంలో ఎవరూ మనని వెతుక్కుంటూ వచ్చి టాప్ రాంక్ ఉద్యోగం వెండికంచంలో తెచ్చి అందించరు, ముందు తన అర్హతలకి తగినఉద్యోగం చేస్తూ నిరూపించుకోవాలి సామర్థ్యం. ఒకస్థాయి ఉద్యోగానికి తగినవాడని ముందు నిరూపిస్తే తరవాత అంతకంటే మంచి అవకాశాలు వస్తే రావచ్చు."

"ఏమో, ఇండియాలో చెల్లుతుందేమో అనీ అమెరికాలో అయితే దాన్ని అసమర్థత అనే అంటారు."

ఈమాటలు వినడం ధరణికి కష్టంగా వుంది.

రాను రాను చిరాకు ఎక్కువవుతోంది. నిజమే మరి, బాగా చదువుకున్నవాడూ, మంచి తెలివితేటలున్నవాడూ తెల్లారి లేస్తూనే హడావుడిగా ఆఫీసుకి టైమయిపోతూందని పరిగెట్టాలి, పదిమందిలో దర్జాగా "ఇవాళ మా ఆఫీసులో ఏం జరిగిందో తెలుసా" అంటూ కథలు చెప్పాలి గానీ, తీరిగ్గా ఎనిమిది గంటలకి లేచి ... .... ఏ భార్యకి మాత్రం ఆ దినచర్య  ఆనందదాయకం? తనఎదటా, వెనకా కూడా ఆఫీసులో అందరూ ఏమనుకుంటున్నారో తనకి తెలుస్తునే వుంది.

అతనికి మాత్రం తెలీదా అమెరికాలో ఎలాటి అర్థాలు తీస్తారో?

***

అదే సమయంలో ఇంటిదగ్గర ఆఫీసురూంగా అమర్చిన రెండో పడగ్గదిలో కంప్యూటరుముందు కూర్చుని ఆలోచనల్లో పడిపోయాడు దినూ. అతనికి ధరణి ఇంకా ఇంటికి రాలేదన్నమాట తోచలేదు. ఆవిడ తనని ఎందుకు అర్థం చేసుకోలేకపోతోందో అంతుబట్టక గింజుకుంటున్నాడతను.

తనకి మాత్రం తెలీదూ అత్తింటివారు 'పెళ్లాన్ని పోషించుకోలేని అసమర్థుడనీ, ఆడదానిసంపాదన తింటున్నాడని అంటున్నార'ని. నిజానికి తాను 'ఉద్యోగం చెయ్యను' అనలేదు. తనకి తగిన ఉద్యోగంకోసం చూస్తున్నాడంతే. అలా చూడ్డం తప్పా? తనరంగంలో తాను రాణిస్తే ఆవిడకి మాత్రం గొప్ప కాదూ? తను

నిదానిస్తే, కాస్త ఓపిక పడితే, తన జ్ఞానసంపదకి తగిన అవకాశం వస్తే, మంచి ఆదాయం వుంటుంది. ఎవరికోసం? ఆవిడకీ, పుట్టబోయే పిల్లలకే కదా! ఏదోఒకటి అని మామూలుఉద్యోగంలో చేరిపోతే, తన మేధాసంపత్తి అంతా నిరుపయోగం అయిపోదూ? ఏ పనికిమాలినపనికో తలపడితే, తన ఆధిక్యత ఎలా ఋజువవుతుంది? ఉద్యోగం వుంటే చాలనుకుని కొరగానిపనికి సిద్ధపడితే తరవాత పుట్టగతులుంటాయా? అందులోనూ ఈదేశంలో ఇలాటి విషయాల్లో పట్టింపులు మరీ ఎక్కువ. ఎక్కళ్లేని అర్థాలూ తీస్తారు మనం చేసే ప్రతి పనికీను.

"నువ్వు నిజంగా అంత మేధావివి అయితే ఈ పనికెందుకు ఒప్పుకున్నావూ?" అంటారు.

"నీకు తగనిపని ఇంతకాలం ఎలా చేస్తున్నావు?" అంటారు.

"నీకు నిజంగా సామర్థ్యం వుంటే, ఆకంపెనీలోనే ఈపాటికి నీకు డైరెక్టరుపదవి రాకపోనా?" అంటారు.

ఇవన్నీ ధరణికి తెలీవు. అసలు తెలుసుకోడానికేనా ప్రయత్నించదు. తన సామర్థ్యానికీ, మేధోసంపదకీ తగిన, తన అసమాన ఐక్యూని ఋజువు చేసుకోగల అవకాశం వస్తే తాను వెంటనే అందిపుచ్చేసుకోడా? తనభర్తకి నోబెల్ బహుమానం అందుకోగల మేథ గలదని తన స్నేహితులతో సగర్వంగా చెప్పుకుతిరిగేరోజు త్వరలోనే వస్తుంది. అప్పుడు తను ఆవిడతో చెప్పడా, 'భామామణీ, చూసేవా, ఇదంతా నీకోసం' అనీ. తనముందు ఒప్పుకోకపోవచ్చు కానీ ఆవిడకి మాత్రం మనసులో లేదూ? 'ఫలానా బహుమతులు గెల్చుకున్న మేధావి, కీర్తిప్రతిష్ఠలు గడించుకున్న మహాపురుషుడు నానాథుడు," అంటూ తన స్నేహితులతోనూ, పుట్టింటివారితోనూ గర్వంగా చెప్పుకోవాలని?

ఇదే ఇండియాలో అయితే ఏమో కానీ అమెరికాలో ఎవరిష్టం వారిదే కదా. నాకు ఉద్యోగంలేదని నన్ను ఎవరూ చిన్నచూపు చూడరు అనుకుంటూ తన్ని తాను సమర్థించుకున్నాడు అతను.

***

ఏడు దాటింది ధరణి ఇంటికి వచ్చేసరికి, "కాఫీ తాగేవా?" అనడిగింది చెప్పులు గుమ్మందగ్గర వదిలి, వంటింటివేపు నడుస్తూ.

దినూ లివింగ్రూంలో కూర్చుని ఏదో చదువుతున్నాడు. "లేదు".

ధరణి లోపలికి వెళ్లి కాఫీ పెట్టి, రెండుకప్పుల్లో తెచ్చింది, తనకో కప్పూ, అతనికో కప్పూ. "నేను రావడం ఆలస్యం అవుతుందని ఫోను చేసేను కదా. నువ్వు తాగేయవలసింది."

"నువ్వొచ్చేక ఇద్దరం కలిసే తాగొచ్చని." కప్పు అందుకుంటూ అన్నాడు, కళ్లు పుస్తకంమీంచి మరల్చకుండా.

ధరణి కాఫీ కప్పు పుచ్చుకు అతనికి ఎదురుగా కూర్చుంది. స్టెల్లా మాటలు మనసులో మెదలుతున్నాయి. అందులో వాస్తవం అర్థమవుతోంది. తను ఏదో చెయ్యాలి. మాటలు కాదు క్రియలో కనిపించాలి. మీద వాన పడితే కింద తడి కనిపించాలి. “ఇదంతా నీకోసమే!” అంటాడు అతను. అలా అంటే చాలదు. క్రియలో కనిపించాలి.

“ఉద్యోగాలేమయినా చూశావా?”

దినూ ఆశ్చర్యంగా తలెత్తి చూశాడు. “చెప్పేనుకదా అదే వస్తుందని. ఇప్పుడేమయింది?”

ముందులాగే కొంచెంసేపు వాదనలయేయి. “ఎవరికోసం నేను గొప్పఉద్యోగంకోసం చూస్తున్నాను? నీకోసమే కదా. నీభర్త అంత గొప్ప ఉద్యోగస్థుడని నువ్వు గర్వపడాలని. నీకోసం కాదూ ఇదంతా.”

ముందులాగ ఈసారి వూరుకోలేదు ధరణి. “నాకోసంలా లేదు. నాకలా అనిపించడంలేదు. నువ్వు ఇలా పనీ పాటూ లేకుండా కూచోడం, నీకోసమే, నూటికి నూరు పాళ్లూ నీకోసమే, అర్థంలేని ‘ఈగో’తో ఇలా ప్రవర్తిస్తున్నావు. ఎవరో వచ్చి నీకు పెండిపళ్లెంలో ఉద్యోగం తెచ్చి చందనతాంబూలాలతో సమర్పిస్తారన్నది stupid excuse. చేతనయినవాళ్లెవరూ ఎవరో వచ్చి నాకు ఉద్యోగం ఇస్తారని ఎదురు చూస్తూ కూర్చోరు. అమెరికనులెవరూ అలా చెయ్యరు. నిజంగా నాకోసమే అయితే క్రియలో చేసి చూపించు. లేచి ఉద్యోగం చూసుకోగలను అని నిరూపించు,” అని, ఒక్కక్షణం ఆగి, మళ్లీ అంది, “ఈనెలాఖరున నేను స్టెల్లాతో carabbean cruise వెళ్తున్నాను.”

“ఆవిడతో ఎందుకూ? మనిద్దరం వెళ్దాం. Second honeymoon,” అన్నాడు దినూ మాట మార్చడానికి సందు దొరికినందుకు ఆనందపడిపోతూ.

“లేదు. నేను స్టెల్లాతో వెళ్తాను. నేను తిరిగొచ్చేవేళకి నువ్వు వుద్యోగం చూసుకోవాలి.” అంది ధృఢంగా.

“లేకపోతే?”

“Guess” ధరణి హుందాగా లేచి వంటింటివేపు నడిచింది.

దినకర్ అప్రతిభుడయి కూర్చుండిపోయేడు. ధరణి అలా మాటాడగలదని అతను కలలోకూడా అనుకోలేదు. హుమ్. అమెరికా నీళ్లా? అన్న సందేహం తలెత్తింది అతనిమనసులో!

(22 ఏప్రిల్ 2009)

# 12. పెద్దతనం

ఎవరో తట్టిలేపినట్టు ఉలిక్కిపడి కళ్లు తెరిచి చుట్టూ చూసింది కాంచన. ఎదురుగా బల్లమీద వాచీ పదకొండు దాటి పావుగంట అయిందంటోంది. అబ్బ! ఇంత వెలుగేమిటి? అనుకుంటూ మళ్లీ చుట్టూ చూసింది. రెండు నిముషాలు పట్టింది ఇది పగలే అని అర్థమవడానికి. కిటికీలకి కట్టినతెరల నీలిరంగు వెలవెలా బోతోంది ఆవెనకనున్న వెలుగుతో.

తెల్లారుతూనే అలవాటుప్రకారం నాలుగ్గంటలకి లేచి, రెండు కప్పులు కాఫీ తాగి, ఈమెయిళ్లు చూసుకుంది. ఇంకా మత్తుగానే వుంది. అసలు దేశంనుంచి తిరిగొచ్చినదగ్గర్నుంచీ ఏం బాగుండడంలేదు. లాప్‌టాప్ కుక్కపిల్లలా ఒళ్లో పొదువుకుని అదేపనిగా రాసేసుకు పోతుంటే, దానివేడికి ఒళ్లు ఆర్చుకుపోతోంది. దానికి తోడు చిక్కటి కషాయంలాటి కాఫీలు మూడు కప్పులు తాగి తెచ్చుకున్న పైత్యం. .. దాంతో దగ్గూ ..

పోనీ, కెఫీను కాస్త తగ్గించి చూదాం అని ఈరోజు డికాఫ్ తాగితే, కాఫీ తాగినట్టు లేదు. కప్పు కడిగిననీళ్లు తాగినట్టుంది కానీ... ఒళ్లో వున్న లాప్‌టాప్ ఎదురుగావున్న కాఫీబల్లమీద పెట్టి వెనక్కి వాలింది కాంచన.

దేశంలో వున్నన్నాళ్లూ బాగానే అనిపించింది. వెళ్లిన ప్రతిచోటా, కనపడిన ప్రతివారూ "పెద్దవారు, అమ్మగారు, మేడమ్" అంటుంటే అప్పటికి బాగానే వుంది కానీ ఇంటికొచ్చేక పదే పదే అదేమాట మనసులో మెదిలి, నువ్వు పెద్దదాని అయిపోయేవు అని ఎవరో రెండుచెవుల్లోనూ బాకాలెట్టుకుని మరీ హోరు పెడుతున్నారు!

ఇంతవరకూ "మీరింత పెద్దవారనుకోలేదు" "you don't look that old" అన్నమాటే వుంటూ వచ్చింది మరి. సినిమాకెళ్తే, నువ్వు సీనియర్ సిటిజన్‌వా అని మరోసారి అడుగుతారు డిస్కౌంటివ్వడానికి.

"హుమ్. వీళ్లందరూ కలిసి నాకు లేనిఆలోచన నాబుర్రలో పెట్టేశారు అదేదో నల్లమేకా, నలుగురు దొంగలు కథలోలాగ," అనుకుంది కాంచన నోరు కుక్కమూతిపింజెలా పెట్టి. లేదా, "నాకు దిష్టి తగిలివుండాలి" అని కూడా అనుకుంది. పెదాలు చిన్నగా విచ్చుకున్నాయి.

000

తను విశాఖపట్నం వచ్చేనని తెలియగానే ఒరిస్సాలో వున్న ప్రమీల రెక్కలు కట్టుకు వాలింది, కూతుర్ని చూడాలన్న వంకతో. కాలేజీలో వున్న నాలుగేళ్లు కవలల్లా కలిసి తిరిగేవారు. రోజూ క్లాసులయేక, సాయంత్రం తనింటికి వచ్చేసేది. ఇద్దరూ డాబామీద కూర్చునేవారు పుస్తకాలు ముందేసుకుని. ఏంమాటాడకపోయినా ఏదో హాయి. మనసునిండా నింపుకుని. ప్రమీలది కమ్మని కంఠం. చక్కగా గొంతెత్తి "రావోయి చందమామా"

అనో "లాహిరి లాహిరి లాహిరిలో ఓహో జగమే" అనో పాడుతుంటే తను వింటూ ... అలా ఎంతసేపో. కిందనించి అమ్మ అన్నాలకి రమ్మని పిలిచేదాకా టైము తెలిసేదే కాదు.

"అబ్బ, నువ్వలాగే వున్నావే .. ఏం మారలేదే," అని ప్రమీల అంటుంటే, కాంచనకి నవ్వొచ్చింది.

"మారని రూపాయిని" అంది కాంచన చిలిపిగా కళ్లు చిట్లించి.

"పోదూ, నువ్వు మరీనూ.. హాయిగా అమెరికాలో స్థిరపడిపోయేవు. గొప్పరచయిత్రివయిపోయేవు. నీకు గుర్తున్నారా, కామేశ్వరీ, అహల్యా .. మేం నీపేరు పత్రికలో కనిపించినప్పుడల్లా ఎంతో మురిసిపోతాం."

"నువ్వూ ఏం మారలేదు" అంటూ కాంచన ప్రమీలవేపు చూసింది. నిజానికి ప్రమీల బాగానే ఒళ్లు చేసింది. మాటలు సాగదీస్తూ నెమ్మదిగా పలుకుతోంది. కాస్త ఆయాసం కూడా. ఎందుకో తనకంటే పదేళ్లు పెద్దదానిలా అనిపించింది. మాటతీరూ, మనిషితీరూ కూడా బాగానే మారింది.

"నీకేం హాయిగా ఒక్క పిల్లతో సరిపుచ్చుకున్నావు. నాకు ముగ్గురాడపిల్లలు. తరవాత ఇద్దరు మగపిల్లలు. మాఅత్తగారికి మగపిల్లాడు లేకపోతే వంశం ఏమైపోతుందోనని బెంగ. ఆతరవాతివాడు అనుకోలేదులే. ... "

కాంచనకి ఏం చెప్పాలో తోచలేదు.

"నీఆరోగ్యం బాగానే వుందా?" అడిగింది ప్రమీలే మళ్లీ.

"బాగుంది. నాకున్నదదొక్కటే." అంది కాంచన వెల్తి నవ్వుతో.

"అదే మహద్భాగ్యం. నీకు తెలుసు కదా. అప్పట్లో నాకు 19ఏళ్లు. పెళ్లి చేసేశారు. వరసగా పిల్లలూ. తెల్లారి నాలుగ్గంటలకి లేస్తే, రాత్రి పదకొండుకి పడక. ఇంట్లో పనులన్నీ నేనే చూసుకోవాలి. నేను లేకపోతే ఒక్కక్షణం జరగదు మావారికి. ఆయనే కాదు మామామగారు కూడా , అమ్మాయీ నా కలం కనిపించలేదు చూడూ, కాగితాలు కాస్త చూసి పెడుదూ, అంటూ .. కాపురానికొచ్చేక పుట్టింటికి వెళ్లలేదు తెలుసా. నువ్వు లేకపోతే ఇల్లు ఎలా నడుస్తుంది అనేవారు మాఅత్తగారు కూడాను. పిల్లలబట్టలన్నీ నేనే కుట్టేను. ఆవకాయ పెట్టాలంటే కాయలు తెప్పించడం, కారాలూ, ఆవపిండి కొట్టించడం అన్నీ నేనే చూసుకోవాలి. మాఅత్తగారికి ఏమీ తెలీదు. మరి ఆవిడెలా చేసేరో కాపురం," ప్రమీల నవ్వుతూ చెప్తూంటే కాంచన చూస్తూ కూర్చుంది.

ప్రమీల సమర్థవంతంగా ఇల్లు నిర్వహించేనని గర్వపడుతోంది. తను సంతోషించాలి. కానీ మనసులో ఏదో వెల్తి. తామిద్దరిమధ్యా ఎడం ఎంతో ... మరోసారి ప్రమీలవేపు చూసింది.

మోకాళ్లు ఆపరేషను చేయించుకుందిట. రోజూ గంటసేపు ఎక్సర్‌సైజు చెయ్యాలి. ఆమధ్య గుండెల్లో చిన్న నొప్పిలాటిది వచ్చింది కానీ సమయానికి మూడోకూతురు డాక్టరుదగ్గరికి తీసికెళ్లింది. ఇప్పుడు నయంగానే వుంది. పిల్లలు చక్కగా చూసుకుంటున్నారు. ఒకొకరిదగ్గర రెండేసి నెలలుంటుందిట. .

“ఆడది ఇంటికి మూలస్థంభంలాటిది. మంచికీ చెడుకీ నిలదొక్కుకుని, సంసారం చక్కదిద్దుతూ, పిల్లల్ని వృద్ధిలోకి తీసుకురాగల ధైర్యస్థైర్యాలు ఒక్క ఆడదానికే వుంటాయి,” అంది ప్రమీల ఆయాసపడుతూ.

తల్లిని తీసుకొచ్చిన మూడోకూతురు, రజని, “పదమ్మా, ఆలస్యం అవుతోంది. వేళకి తిని పడుకోపోతే మళ్లీ రేపు లేవలేవు” అని, “వస్తామండీ” అంది కాంచనవేపు తిరిగి.

“వుంటావా నాలుగురోజులు?”

“లేదు. పెద్దమ్మాయిదగ్గర వుంటున్నాను కదా. ఈనెలాఖరువరకూ అక్కడే వుంటాను. వచ్చేనెల అబ్బాయిదగ్గరికి వెళ్తాను.”

000

కాంచన నిట్టూర్చింది. ఎక్కడికి వెళ్లినా, ఎవరు కనిపించినా అదే ధోరణి. ఇరుగింటా, పొరుగింటా, బజారులో, సభల్లో, సన్నివేశాల్లో - మేడమ్, అమ్మగారు, అమ్మమ్మగారు, … తనకిచ్చే గౌరవవాచకాలు. ఆసంబోధనలలో మనసంస్కృతి గుర్తొచ్చి మనసు మృదువుగా స్పందించింది. వెనక ఎవరో బామ్మగారంటే తనని అలా అనొద్దని చెప్పినమాట గుర్తొచ్చింది.

హాల్లో కూర్చుని ఆరోజు పేపరు చూస్తున్న కాంచనకి గుమ్మందగ్గర ఎవరో నిలిచినట్టనిపించి తలెత్తి చూసింది.

రజని “పన్లో వున్నారా? వేరే పనిమీద ఇటొచ్చి, మీరేం చేస్తున్నారో అని ఆగేనిక్కడ” అంది.

కాంచన పేపరు మడిచి పక్కన పెడుతూ, “లేదు, పనేంలేదు. రా.” అంటూ ఆహ్వానించింది సాదరంగా.

రజని లోపలికొచ్చి కాస్త ఎడంగా కుర్చీ లాక్కుని కూర్చుంది.

“మీఅమ్మ వెళ్లిపోయిందా?”

“ఆఁ, నిన్నరాత్రి రైలెక్కించేను. మీరంటే మాఅమ్మకి చాలా ఇష్టం. మొన్న మీరు వెళ్లిపోయింతరవాత రోజంతా మీగురించే చెప్తూనే వుండింది,” అంది రజని కళ్లనిండా అభిమానం నింపుకుని.

కాంచన చిన్నగా నవ్వింది, “అవును, ఆరోజుల్లో ఇద్దరం చాలా స్నేహంగా వుండేవాళ్లం, ఏ అరమరికలూ లేవు. మళ్లీ ఆరోజులు రావు,” అంది. ఆతలపు రవంత నిస్పృహ కలిగించి, మొహంలో కళ తప్పింది.

ఇద్దరికీ క్షణకాలం మాట తోచలేదు. కాంచన చిన్నగా నవ్వి, “మీ అమ్మ కూడా ఇలాగే ..” అంది.

“అంటే?”

“అదే, ఇలా మాటా పలుకూ లేకుండా కూర్చునేవాళ్లం ఇద్దరం గంటలతరబడి డాబామీద. మాకెందుకో అలా ఏమాటా లేకపోయినా ఏం వెలితుండేది కాదు,” అని “రా, డాబా చూపిస్తాను” అంటూ లేచింది.

ఇద్దరూ డాబామీదికెళ్లేరు. పిట్టగోడమీదికి వాలినకొమ్మలతో, విరగబూసిన సంపెంగచెట్టూ, చుట్టుగోడకి దగ్గరగా గుత్తులు గుత్తులుగా గంగాబోండాలతో, పింజలతో, సుతారంగా వాలిన మట్టలతో కొబ్బరిచెట్లూ, పెరటిమధ్యలో దానిమ్మచెట్టూ, పారిజాతం చెట్టూ, దూరంగా మహోధృతంగా ఎగసిపడుతున్న అలలతో దిగంతాలకి పరుచుకున్న సముద్రమూ, ఏరాడకొండమీద లైట్ హౌసూ... కాంచనకి పాతజ్ఞాపకాలు పొంగుకొస్తుంటే, రజనికి కొత్త తలపులు రూపు దిద్దుకుంటున్నాయి.

“మేం ఇద్దరం ఇక్కడ చాపలు పరుచుకు పడుకుని, ఇరవై సెకనులకొకసారి గోడమీద వెలిగే లైట్‌హోస్ కిరణాలు ఎన్నిసార్లు లెక్కపెట్టేమో ... ఇప్పుడు తలుచుకుంటే సిల్లీగా వుంటుంది ...” అంది కాంచన దూరతీరాల్లోకి చూస్తూ.

“మాఅమ్మకీ మీకూ కూడా ఇలాటి సాయంత్రాలు మాటల్లేకుండా గడిచేయంటే నాకు ఇప్పుడు అర్థం అవుతోంది,” అంటుంటే రజనికళ్లలో రవంత ఈర్ష్యఛాయలు తోచేయి కాంచనకి. ఆవిడ చిన్నగా నవ్వుకుంది ఈకాలపుపిల్లలు అనుకుంటూ.

మరోపావుగంట వుండి, “ఆదివారం మాయింటికి లంచికి రండి,” అంది రజని కాంచనవేపు తిరిగి.

“లంచికా?” కాంచనకి ఆశ్చర్యంగా అనిపించింది. వాళ్లమ్మ ఉన్నప్పుడు పిలవలేదు. ఇప్పుడిదేమిటి?

“మీకు వేరే పనుంటే మరోరోజు చూద్దాంలెండి. మీరింకా ఎన్నాళ్లుంటారిక్కడ?”

“లేదులే. ఆదివారం వస్తాను. ఎన్నాళ్లో లేదు. సోంవారం వెళ్లిపోతున్నాను.”

“కారు పంపిస్తాను. లేకపోతే నేనే వస్తాను” అని గుమ్మందాకా వచ్చి, “మిమ్మల్ని ఏమని పిలవమంటారు. మొన్న మాఅమ్మతో వచ్చినప్పుడు, మీకు ఆంటీ అంటే ఇష్టంలేదన్నారు కదా” అంది రజని చిరునవ్వు కళ్లలో మెరుస్తుండగా.

కాంచన కూడా నవ్వింది, “నీఇష్టం.”

రజని వెళ్లిపోయేక, చాలాసేపు కాంచన ఆలోచిస్తూనే వుంది తనని ఏమని పిలవడం? "ఏమే కాంచనా" అంటూ నోరారా పిలిచింది ప్రమీల ఒక్కర్తే. మిగిలినవారందరికీ అయితే మేడమ్, అమ్మగారు, అమ్మమ్మగారు. .. కదాచితుగా డాక్టర్ కాంచన, ప్రొఫెసర్ కాంచన ... నాకవేవీ లేవని చెప్పేసరికి ప్రాణం సాలుకొచ్చింది.

000

ఆదివారం పదిగంటలకి రజని ఫోన్ చేసింది, "బసంతో ఏదో పనిమీద కారు తీసుకువెళ్లేడనీ, పదకొండున్నరకి తనింటికొచ్చి వాళ్లింటికి తీసుకెళ్తాడని. సరేనంది కాంచన.

రజని యమ్మెస్సీ బయాలజీ చేసేక, వుద్యోగరీత్యా కలకత్తాలో వుండగా బసంతో చటర్జీతో పరిచయం అయింది. పెళ్లయి పదిహేనేళ్లయింది. ఇద్దరు పిల్లలు. విశాఖపట్నానికి మారి రెండేళ్లయింది.

అన్నట్టుగానే బసంతో పదకొండున్నరకల్లా వచ్చేడు. తొందరగానే వచ్చేస్తానని ఇంట్లో తమ్ముడికీ మరదలికీ చెప్పి కాంచన కారెక్కింది.

ఇల్లు చూడముచ్చటగా వుంది. మూడుగదుల ఫ్లాటు. చక్కగా అమర్చేరు. హాల్లో సోఫాసెట్టూ, గోడలమీద బాపిరాజుగారి చిత్రాలూ, వంటగదికి ఎదురుగా రోజ్‌వుడ్ భోజనాలబల్లా వారి స్తోమతు తెలియజేస్తున్నాయి. ఆరేళ్ల అమ్మాయీ, పదేళ్ల అబ్బాయీ నీటుగా వున్నారు. తెలుగుదేశం వచ్చి రెండేళ్లయినా బెంగాలీ మర్చిపోలేదు. చక్కగా బెంగాలీ, ఇంగ్లీషూ కూడా మాటాడుతున్నారు. తెలుగు కూడా నాలుగుముక్కలు వల్లిస్తున్నారు.

"ఇంగ్లీషుమీడియంస్కూల్లో వేసేం. తెలుగు నేర్పాలని నాకయితే వుంది కానీ ఎక్కడ .. ఏపనికీ తీరికుండదు నావుద్యోగం. ఆయన వుద్యోగం ..." రజని అంటుంటే కాంచన అడ్డు పడింది.

"బెంగాలీ వాళ్లనాన్న భాష అని నేర్పేవు. బతుకుతెరువుకి అని ఇంగ్లీషు నేర్పేవు. తల్లిభాష తెలుగు మాత్రం నేర్పడానికి టైము లేదంటున్నావు" అంది చిన్నగా నవ్వుతూ.

"లేదండీ. నాకయితే నేర్పాలనే వుంది. చెప్పేను కదా. ముందు నాకు వస్తే కదా. నాచిన్నతనం భువనేశ్వర్‌లో గడిచింది కనక నాకూ తెలుగు అట్టే ఒంటబట్టలేదు. ఏదో మాఅమ్మవెనక తిరుగుతూ నాలుగు ముక్కలు మాట్లాడ్డం వచ్చింది కానీ చదవడం, రాయడం రాదు."

రజని నాతో మాటాడుతుంటే. బసంతో వచ్చి అప్పడాలు వేయించనా అనడిగేడు. రజని తలూపి, తను కూడా లేచింది కంచాలు పెట్టడానికి. అబ్బాయి హరీష్ మంచినీళ్లు పెడుతుంటే, కాంచనకి ఎదురుగా ఒదిగి కూర్చుంది రుమ.

“కాయితం, కలం తీసుకురా. నీపేరు తెలుగులో రాయడం నేర్పుతాను” అంది కాంచన రుమతో.

రుమ హుషారుగా లేచి వెళ్లి కాగితం తీసుకొచ్చింది.

కాంచన “a circle, a check on top, a hook to the right” అని వర్ణిస్తూ అక్షరాలు రాస్తూంటే రజని భోజనాలబల్లమీద కంచాలూ, గిన్నెలూ అమరుస్తూ ఓరకంట వాళ్లని చూస్తోంది మురిపెంగా.

కాంచన రాయడం పూర్తవగానే, రుమ ఆ అక్షరాలవేపు చూసి, “అవి నావేపునించా, నీవేపునించా?” అనడిగింది.

కాంచన “నీవేపునించే” అని చెప్పి, “చురుకుపాలు ఎక్కువే” అంది రజనితో. రజని నవ్వింది సంతృప్తిగా.

రుమ తనపేరు తేలిగ్గానే రాసేసి, అన్నపేరూ, అమ్మపేరూ, నాన్నపేరూ కూడా రాయమంది.

రజని, “రండి. తినడం అయినతరవాత మిగతా పాఠం,” అంది.

కాంచన మరోమారు రుమని మెచ్చుకుని, భోజనానికి లేచింది.

కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తుంటే. కాంచన “నాకు బెంగాలీ చెప్పు. నీపేరేమిటి అని ఎలా అడుగుతారు?” అనడిగింది రుమని..

రుమ చెప్పింది కానీ కాంచనకి ఆవాక్యం పట్టుబడలేదు. మూడు చుట్లయేక, “I will tell you yes and no” అంది.

కాంచనకి నవ్వొచ్చింది.

బసంతో, “You are down to LKG,” అన్నాడు నవ్వుతూ.

అందరం నవ్వుకున్నాం. భోజనాలయేక, రజనీ, కాంచనా హాల్లోకి వచ్చి కూర్చున్నారు. బసంతో, పిల్లలూ, బల్లమీదున్న కంచాలూ, గ్లాసులూ ఎత్తిపెడుతుంటే, కాంచనకి ముచ్చటేసింది. రజనివేపు చూసింది ఏ అమ్మాయి మాత్రం ఇంతకంటే ఏం కోరుకుంటుంది అనిపిస్తోంది వాళ్లని చూస్తుంటే.

“మీరేమైనా షాపింగ్ చేస్తారా?” అనడిగింది రజని.

“లేదులే. నాషాపింగంతా హైదరాబాదులో అయిపోయింది. మీరు వెళ్లండి. నేనింటికెళ్తాను.”

“లేదండీ, నాకేం పనిలేదు. బసంతో వాళ్లిద్దర్నీ టెన్నిస్ ప్రాక్టీసుకి తీసుకెళ్తాడు. మనం కైలాసగిరికి వెళ్దాం మీకు ఫరవాలేదంటే. చాలా బాగుంటుంది” అంది రజని.

తండ్రినీ పిల్లల్నీ టెన్నిస్ కోర్టులో దింపేసి, రజన కాంచనతో కైలాసగిరివేపు సాగింది.

దారిలో కాంచనకి చాలా విషయాలు తెలిశాయి. "నేను ఏం సాధించాలనుకున్నానో నాకిప్పుడు అర్థం కావడంలేదు. బయాలజీ చదువుతున్నరోజుల్లో రిసెర్చ్ చేసి లోకంలో రోగాలన్నిటికీ కారణాలు కనిపెట్టేసి మందులు కనిపెట్టేసి, బాధలన్నీ తీర్చేయాలనుకునేదాన్ని. రిసెర్చ్ సాగలేదు. బసంతోతో స్నేహం, పెళ్లీ, అతనిఉద్యోగంలో అవకతవకలూ, పిల్లలూ, మధ్యలో ఒక మిస్కేరేజీ .. ఎప్పటికప్పుడు ఏదో ఒక అనుకోని అవాంతరం. .. నా పిహెచ్‌డీకి. నేను ఎవర్నో తప్పు పడుతున్నానని కాదు. బసంతో సహకారంలో లోపం లేదు. పిల్లలు పుట్టేరంటే దానికి వాళ్ళని తప్పుపట్టలేం కదా.. " అంది రజని చిన్నగా నవ్వి.

కాంచనకి ఏమనాలో తోచలేదు.

"అమ్మ మాకోసం ఎంత త్యాగం చేసిందో చూడండి. ఏపూటకాపూట భోజనం దగ్గర్నుంచీ, పుస్తకాలూ, బట్టలూ, చదువులూ అంతా తనే చూసుకుంది. క్షణం విరామం లేకుండా మాకందరికీ సేవలు చేసింది. మాకు బాగా జ్ఞానం వచ్చి మేమే వెళ్లు, వెళ్లంటూ తోలేవరకూ పుట్టింటికి కూడా వెళ్లలేదు. మానాన్నగారు ఉన్నారన్నమాటే కానీ అసలు మేం ఇంట్లో వున్నామో లేమో కూడా స్పృహ వుండేది కాదాయనకి. అసలు మేం ఆయనపిల్లలన్న స్పృహ కూడా వుందో లేదో అనుమానమే. ఆయన ఫైళ్లే ఆయనలోకం. ఖర్మం చాలక అమ్మ ఎప్పుడయినా ఓమాట అడిగినా, అవన్నీ తల్లి చూసుకోవాలి. అది నీకర్తవ్యం అనేవారు."

ఈపిల్ల ఇవన్నీ తనకి ఇప్పుడు ఎందుకు చెప్తోందో కాంచనకి అర్థం కాలేదు.

"అప్పట్లో నాకు మహ చిరాకేసేది కానీ ఇప్పుడు అర్థం అవుతోంది కొంతయినా. నాకు నిజంగా చెప్పుకోదగ్గ బాధలేమీ లేవు. మంచివుద్యోగమే. చిన్నకంపెనీ అయినా మంచి పేరుంది. నేను సీనియర్ సైంటిస్టుని. బసంతో యూనివర్సిటీలో రీడరు. నాకు అప్పుడప్పుడూ ప్రయాణాలుంటాయి. బసంతో చూసుకుంటాడు ఇంటినీ పిల్లల్నీ. దేనికీ విసుక్కోడు. నాకే ఎందుకిదంతా అనిపిస్తోంది. బాగా సంపాదిస్తే సుఖపడొచ్చు అంటారు. మరి సుఖపడడానికి టైము కావాలి కదా. అందుకే నేను ఉద్యోగం మానేద్దాం అనుకుంటున్నాను."

"మానేసి ఏం చేస్తావు?"

"ఏమో తెలీదు. ఏవో ఒకటి రెండు ఇండిపెండెంటు ప్రాజెక్టులు వున్నాయి, ఆలోచిస్తున్నాను. కొడైకెనాల్‌లో ఇల్లు కట్టిస్తున్నాం." రజని కారు పార్క్ చేసి, దిగింది. కాంచన కూడా కారు దిగి చుట్టూ చూడసాగింది. దూరంగా శివపార్వతులు కొలువు తీరి వున్నారు. పాలరాతివిగ్రహం అనంతాల్లోకి చొచ్చుకుని ఇదే కైలాసమమేమోనన్న భ్రమ కలిగిస్తోంది. కాలిబాటకి ఇరువైపులా పువ్వులమొక్కలు అందంగా, ఆహ్లాదకరంగా వున్నాయి. బంగాళాఖాతం తన ఉత్తుంగతరంగాలతో నేపథ్యసంగీతాన్నందిస్తోంది ఉచితంగా.

కాంచన సముద్రంవేపు చూస్తూ నిలబడిపోయింది. బంగాళాఖాతంలో కనిపించని సుడిగుండాలు వుంటాయంటారు.  ... అప్పట్లో ఈ శిల్పం లేదు. ఈ ఉద్యానవనాలు లేవు. దిగంతాల ప్రతిధ్వనిస్తూ సాగరసంగీతం మాత్రం అప్పటికీ ఇప్పటికీ ఒక్కలాగే వుంది.

"అసలు ఎవరైనా పెళ్లెందుకు చేసుకుంటారండీ?"

కాంచన తృళ్లిపడి రజనిమొహంలోకి పరీక్షగా చూసింది. ఇంతవరకూ చెప్పినవిషయాల్లో తనసంసారంలో ఒడుదుడుకులేం వున్నట్టు కనిపించలేదు. అనుకూలుడయిన భర్తా, బుద్ధిమంతులయిన పిల్లలూ, చెప్పుకోదగ్గ ఆర్థికస్థాయీ - సాధారణంగా ఒక మనిషి కోరుకునే అన్ని వైభవాలూ అమరినట్టే వున్నాయి. మరి ఆ ప్రశ్నేమిటి?

రజని కూడా ఆమాటే అంది. "నేనిలా అడిగేనని మరోలా అనుకోకండి. అనుభవం వున్నవారూ, విస్తృతంగా లోకం చూసినవారూ కనక అడుగుతున్నాను. ఈనాటి సామాజికవ్యవస్థలో పెళ్లికి గల 'విలువ' అనాలో 'స్థానం' అనాలో తెలీదు - ఏదో అది ఏమిటి అని?"

"నాఅనుభవాలు పెళ్లి సౌభాగ్యం వివరించడానికి పనికిరావులే" అంది కాంచన.

రజని రెండు క్షణాలు వూరుకుని, "ఇప్పుడు నాకు పెళ్లిగురించి తెలిసినసంగతులు పదిహేనేళ్లక్రితం తెలిసివుంటే, నేను పెళ్లి చేసుకునేదాన్ని కాను," అంది.

కాంచన నిశ్చలంగా కళ్లప్పగించి చూస్తోంది. సముద్రంలో అలలు విరుచుకుపడుతున్నాయి సమరోత్సాహంతో ఉరకలేస్తున్న యుద్ధాశ్వాల్లా. కాంచనమనసులో మరొక ప్రశ్న అడగాలన్న కోరిక క్షణకాలం రేగి వెనుదిరింది ఆ అలల్లాగే. రజని ఒకవేళ ఇంతకాలం పెళ్లి చేసుకోకుండా వుండివుంటే, ఇప్పుడు పెళ్లినిగూర్చి తెలిసిన విషయాలు అప్పుడు తెలిసివుంటే, పెళ్లి కావాలనే అనుకునేదా? కాంచన పెదిమలు ఆచి పట్టుకుంది. ఆ ప్రశ్న ఒట్టి తర్కానికి పనికొస్తుందే గానీ ఇప్పుడు అడగదగినది కాదు. ... ప్రస్తుతం రజని ప్రస్తావిస్తున్నది పదిహేనేళ్ల సాంసారికజీవనం తరచి చూసుకున్నతరవాత తనకి కలిగిన అవగాహన. అది తనతో పంచుకుంటోంది. ఆఅమ్మాయికి కావలసింది జవాబు కాదు. వినేవాళ్లు! అంతే.

మరో గంటసేపు తిరిగి ఇంటికి మళ్లేరు. కాంచనఇంటిముందు కారు ఆపి, దిగింది రజని. అటుతిరిగి తను వచ్చేలోపున, కాంచన తలుపు తెరుచుకుని దిగింది.

రజని ఆమెదగ్గరికి వచ్చి, ఎదురుగా నిలబడి, "మీతో మాటాడడం చాలా తేలిక కాంచనగారూ" అంది.

కాంచన తెల్లబోయింది. ఇదే అమెరికాలో అయితే ఆశ్చర్యం లేదు. మోకాలెత్తు లేని పిల్లలు కూడా పేరు పెట్టి పిలుస్తారు. కొత్తలో తనకి అది ఎబ్బెట్టుగా తోచేది కూడాను. మన సంస్కృతిలో పెద్దవాళ్లని పేరు పెట్టి పిలవడం మర్యాద కాదు. రజని తనని పేరు పెట్టి పిలవడానికి కారణం వయసుమాట వదిలేసి, కేవలం ఒక స్నేహితురాలిగా తనని గుర్తించడమా? లేదా వాళ్లమ్మకీ తనకీ దృక్పథాలలో గల తేడా గమనించడంవల్లనా? ఇదే తొలిసారి ఆఅమ్మాయి తనని పేరు పెట్టి పిలవడం! ఇంతవరకూ ఏ సంబోధనా లేకుండా జరుపుకుంటూ వచ్చింది దాగుడుమూతలాడుతున్నట్టు. కాంచనకి మాత్రం హాయిగా అనిపించింది.

రజని అదేమీ గమనించనట్టు, చిన్నగా నవ్వి వెనుదిరిగి వెళ్లిపోయింది.

000

గాజుతలుపుమీద దబ్ దబ్మంటూ వడగళ్లు చప్పుళ్లు చేయడంతో కాంచన త్రుళ్లిపడి బయటికి చూసింది. ఆకాశంలో నల్లటి చిక్కటి మబ్బులు దట్టంగా కమ్ముకుని రాత్రి అయిపోయిందేమో అనిపిస్తోంది. మధ్య మధ్యలో మెరుపులు తళుక్కున మెరిసి క్షణకాలం గదినిండా వెలుగు నింపి వెళ్లిపోతున్నాయి. కాంచన అలా చూస్తూ కూర్చుండిపోయింది రజనిని తలుచుకుంటూ చాలాసేపు.

ఆపిల్లకీ, తనకీ సమస్య ఒకటేనా? పరస్పరం వ్యతిరేకమయిన అనుభవాలనీ, పరిస్థితులనీ ఎలా సమన్వయపరుచుకోవడం? పెళ్లీ, పిల్లలూ, స్నేహాలూ. వయసులో తారతమ్యాలూ, అవి తెచ్చే ప్రత్యేకపరిస్థితులూ … ఏది కావాలి? కావలసింది సాధించుకున్న తరవాత ఏమిటి చేయాలి? దినదినం మనం చేసేవన్నీ రోజు గడవడానికా, మరేదో సాధించడానికా?

కాంచన తనవయసెప్పుడూ దాచుకోలేదు. ఇప్పుడు పెద్దదాన్నన్నబాధ కంటే ఆతలపువల్ల వచ్చే ఈతిబాధ ఎక్కువగా వుంది. దానికి కారణం మాత్రం ఇదమిత్థంగా చెప్పలేకపోతోంది.

పెద్దపెట్టున మరో మేఘం గర్జించింది. కాంచన నెమ్మదిగా ముందుకి ఒంగి లాప్‌టాప్ అందుకుని తెరిచింది. నీలితెరమీద పెద్దతనంనీడలు మరింత స్పష్టంగా కనిపిస్తున్నాయి.

బుద్ధి పని చేయడంలేదు. సినిమాకి వెళ్తేనో అనిపించింది. ఆమధ్య ఎవరో అన్నారు జూలీ-జూలియా బాగుందని. జూలియా ఛైల్డ్‌గురించి చాలా వింది. వాన .. ఎలాగా వాకింగుకి వెళ్లడం పడదు. వానకోటు అందుకుని సినమాకి బయల్దేరింది.

కౌంటరుదగ్గర పదిడాలర్లనోటు అందించింది, "సీనియర్ సిటిజన్" అంటూ.

అమ్మాయి క్షణకాలం కాంచనమొహంలోకి చూసి, "యూ డోంట్ లుక్ .." అంది ఆరు డాలర్లు అందిస్తూ.

కాంచన టికెట్టూ, డబ్బూ తీసుకుని థియేటర్‌వైపు నడిచింది నేలకి జానెడెత్తున గాలిలో తేలిపోతూ - పెద్దదాన్నని చెప్పుకోగలిగినందుకో, మూడు డాలర్లు మిగుల్చుకున్నందుకో, అనువయినచోట అంగీకరించడం తెలికో ...

(23 నవంబరు 2009)

# 13. పోలికులైన నేమి ...

అర్ధరాత్రి దాటింది. మనోరమా, ఇద్దరు పిల్లలూ పడకెక్కేసి మూడున్నరగంటలయింది.
చంద్రం కంప్యూటరుకి అంటుకుపోయి ఉద్యోగాలవేటలో వేసారి, రంగుబుడగలు షూట్ చెయ్యడం మొదలుపెట్టేడు. చుంయ్ చుంయ్ మంటూ పెనంమీద పెసరట్లలా స్క్రీనుమీద బుడగలు చితికిపోతున్నాయి.
"బుర్రతో పనిలేని ఆట ఆడుతున్నాను" చంద్రం గొణుక్కుంటున్నాడు చితికిపడుతున్న బుడగలు చూస్తూ.
"బుర్రతో పనిలేనిఆట." బుర్రతో పనిలేని ఆటే అయినా వదలబుద్ధి పుట్టడంలేదు. అలాగని మనశ్శాంతీ లేదు.
"ఈ పనికిమాలిన ఆట నేనెందుకు ఆడుతున్నాను" అనిపిస్తోంది కానీ సమాధానం తోచడంలేదు. బుర్రో చెయ్యో ప్రోగ్రాము అయిపోయినట్టు, అసంకల్పిత ప్రతీకార చర్యలాగ ఆట సాగిపోతోంది తనప్రమేయం లేకుండానే.
తాను "బుర్ర అక్కర్లేని ఆట ఆడుతున్నా"నని చెప్పుకోడం మాత్రం మానలేకుండా వున్నాడు.
నాలుగేళ్లయింది వుద్యోగంలో చేరి.
మూడునెలలయింది ఉద్యోగం పోయి.
చేరినప్పుడు ఇలా అవుతుందని అనుకోలేదు. అప్పట్లో ఆ కంపెనీ శుక్లపక్షచంద్రునిమాడ్కి దినదినప్రవర్ధమానంగా పెరిగిపోతోందని విని చేరేడు.
పింకుస్లిప్పు పుచ్చుకున్నరోజున గానీ గ్రహింపుకి రాలేదు దేశంలో ఆర్థికపరిస్థితి ఎలా వుందో. కళ్లెదుట కొండచిలువలా కనిపిస్తున్నసమస్యలు కూడా "తనదాకా వస్తే కానీ" తెలీవని ఇప్పుడే తెలిసింది.
"బోడి వుద్యోగం. అదే దొరుకుతుంది ఇది కాకపోతే దీని తాతలాటిది" అని తనకి తనే చెప్పుకోడమే కాక, మనోరమకి కూడా మాటిచ్చేడు. మొదట్లో కొన్నాళ్లు కులాసాగా గడిపేడు unearned holidays అనుకుంటూ.
ఆతరవాత తనకి తెలిసినవాళ్లనీ, ఉద్యోగాల్లో వున్నవాళ్లనీ కదిపి చూసేడు.
వాళ్లు యథాశక్తి సానుభూతులు చెప్పి, ప్రస్తుతం తమకి తెలిసినవేమీ లేవనీ, తెలిస్తే మాత్రం తప్పకుండా చెప్తాం అనీ నొక్కి చెప్పేరు. ఏదైనా అవసరమయితే ఏమాత్రమూ సంకోచించకుండా అడగమని కూడా చెప్పేరు.
చంద్రం నెట్లోనూ, పేపర్లలోనూ కనిపించిన ఉద్యోగాలన్నిటికీ అర్జీలు పెట్టుకొస్తున్నాడు. రోజులూ,  వారాలూ, దొర్లుకుపోతున్నాయి నిస్సారంగా. monster.comలో కూడా తనపేరూ, అర్హతలూ, నమోదు చేసేడు.
ఎన్నిసార్లు చూసినా ఏదో కంపెనీలో బుక్కు కీపింగ్ పని చూపిస్తోందే కానీ తన ఇంజినీరింగుచదువుకి తగిన పని కనిపించడంలేదు.  బుక్కు కీపింగ్ చెయ్యగలనన్న నమ్మకంలేదు.
మనోరమ పిల్లలు చదువుతున్న ఎలిమెంటరీ స్కూల్లో substitute teaching చేస్తూ వుంటుంది. అంచేత చెప్పుకోదగ్గ ఆదాయం కాకపోయినా, కొంతలో కొంత నయం.

ఓరోజు జగదీశ్ బజారులో కనిపించాడు. ఆయనతో చంద్రానికి అట్టే పరిచయంలేదు. వూళ్లో వున్న వందమంది భారతీయుల్లో అతనొకడని తెలుసంతే. కాస్త జంకుతూనే హలో అన్నాడు చిరునవ్వు మొహాన మెత్తుకుని. జగదీశ్ మెకానికల్ ఇంజినీరు, వ్యవసాయపరికరాలు తయారు చేసే గ్రీన్ మెటల్ కంపెనీలో ఛీఫ్ ఇంజినీరు. అంచేత తను అతన్ని పలకరిస్తే, ఉద్యోగంకోసమేనని అతను అనుకుంటాడేమోనని చంద్రం బాధ. ఆమాట నిజమే అయినా ...

జగదీశ్ కూడా సంకోచిస్తూనే తిరుగు హలో చెప్పేడు. అతని సంకోచానికి కారణం చంద్రంఆలోచనకి అటువైపుది. "వీడికి ఉద్యోగం వుంది, నాకు లేదు" అని చంద్రం చిన్నబుచ్చుకుంటాడేమోనని జగదీశ్ బాధ. ఇలా ఇద్దరికిద్దరూ సంకోచిస్తూనే, సగం సగం మొహాల్తో హలోలు చెప్పుకుని, మీరెలా వున్నారంటే మీరెలా వున్నారని అడుగుకొంటూ చిరుసంభాషణకి నాంది పలికేరు. ఆతరవాత చంద్రం ఉద్యోగంమాట రాక తప్పలేదు. జగదీశే నెమ్మదిగా, "సారీ. మీకంపెనీలో జాబ్‌కట్సుగురించి విన్నాను" అన్నాడు.

చంద్రం ప్చ్ అన్నాడు భుజాలు కుదించి. "ఇంతదాకా రానేవచ్చింది, ఇహనెందుకు మొహమాటం" అనుకుని, "మీ కంపెనీలో ఏమైనా అవకాశాలుంటే చెప్పండి. నాకు వూరికే కూర్చోడం చాలా కష్టంగా వుంది" అన్నాడు ఆయనతో.

జగదీశ్ "అలాగే తప్పకుండాను. నేను మా ఎచ్చార్‌ని కనుక్కుని చెప్తాను. మీ సెల్లవ్వండి" అని నెంబరు తీసుకుని, శుభాకాంక్షలు చెప్పి వెళ్లిపోయాడు.

చంద్రం ఆశలు మేస్తూ ఇల్లు చేరుకున్నాడు ఆపూటకి చాంద్రాయణం ముగించి.

నాలుగు రోజులయింది. జగదీశ్ కంపెనీనుండి చంద్రానికి పిలుపు వచ్చింది.

"హలో. చంద్రంతో మాటాడాలి. వున్నారా?"

"యస్యస్. నేనే. చంద్రమే మాటాడుతున్నది"

"మీవిషయం జగదీశ్గారు చెప్పేరు. ఇంటర్వ్యూకి సోమవారం పదిన్నరకి వీలవుతుందా? లేక రెండు గంటలకా?"

ఆలస్యం అమృతం విషమని కదా నానుడి. "పదిన్నరకి రాగలను."

"సరే. మా హ్యూమన్ రిసోర్సెస్ డైరెక్టరుతో సోమవారం పదిన్నరకి మీ ఇంటర్వ్యూ నిర్ణమయినది. మీకు ఎక్కడికి రావలెనో తెలుసా?"

"తెలుసు, తెలుసు. సోమవారం పదిన్నరకి మీ హ్యూమన్ రిసోర్సెస్ డైరెక్టరుని కలుసుకోడానికి వస్తాను." అని వివరాలు వల్లెవేసి, తనకి అర్థం అయినట్టు తెలియజేసి, సెల్లు మూసి చంద్రం నిట్టూర్చేడు. తరవాత మనోరమతో చెప్పేడు తనకి రాబోయే వుద్యోగం సంగతి. ఆవిడ కూడా అతని ఆనందంలో పాలు పంచుకుంది.

సోమవారం, ఫలానాకంపెనీలో ఎచ్చార్ డైరెక్టరు థాంసన్‌ని కలుసుకున్నాడు. డైరెక్టరుగారు సాదరంగా మాట్లాడేరు. కంపెనీ అంతా చూపించేరు. అతని డ్యూటీ వివరించేరు. వేరే ఇంజినీర్లు వేసిన బ్లూప్రింటులు కంప్యూటరులోంచి తీసి, ప్రింటు చేసి, నీటుగా మడత పెట్టి వర్కర్లకి ఇవ్వడం.

“మీకు ఇష్టమయితే రేపే చేరొచ్చు” అన్నాడు థాంసన్, పక్కా వ్యాపారసరళిలో.

“గంటకి ఆరు డాలర్ల ఇరవై అయిదు సెంట్లు. రోజుకి ఎనిమిది గంటలు పని.” అని కూడా చెప్పేడు.

చంద్రానికి ఛెళ్లున మొహమ్మీద కొట్టినట్టుంది తాను చెయ్యబోయే పని తలుచుకుంటే. వెంటనే నాలుగునెలలుగా తను పడుతున్న అవస్థలు మనసులో మెదిలేయి. “బుర్రతో పనిలేని పని నాకలవాటే” అని తనకి తనే, అక్కడికక్కడే నచ్చచెప్పుకుని, “సరే, రేపు వస్తాను” అని థాంసన్‌కి చెప్పి బయల్దేరేడు.

కుంజరయూధంబు దోమ కుత్తుకనొచ్చినట్టు గొంతులో వెగటు. తిన్నగా ఇంటికి వెళ్లాలనిపించలేదు. దారిలో స్టార్ బక్స్‌లో ఆగి ఓ మూల కూర్చున్నాడు.

బాలరసాలసాలనవపల్లవకోమల కావ్యకన్యకని తాను అమ్ముకోడంలేదు … కానీ … ఆతల్లి పెట్టిన భిక్షే తన ఇంజినీరింగు చదువు. ఆ విద్యమూలంగానే తనకీ, మనోరమకీ, పిల్లలిద్దరికీ కూడు. తనజన్మలో అనుకోలేదు ఆవిద్య విలువ ఇంతగా పడిపోతుందని.. మనోరమకి ఏమని చెప్పడం. … రెండు గంటలసేపు ఆలోచించి, నెమ్మదిగా ఇల్లు చేరుకున్నాడు.

మనోరమ ఇంట్లోనే వుంది.

“రేపు చేరుతున్నా గ్రీన్ మెటల్‌లో” అన్నాడు మనోరమ మొహంలోకి చూడకుండా.

“నిజంగానే! పోన్లెండి. ఈరోజుల్లో ఇంత త్వరగా దొరకడం గొప్పే” అంది మనోరమ.

“అవును” అనేసి లోపలికి వెళ్లిపోయాడు చంద్రం.

ఈపనికి ఇంజినీరింగు చదవక్కర్లేదు. హైస్కూలుచదువు చాలు. ఆమాట ప్రతిక్షణం ముల్లయి తాకుతోంది చంద్రం ఎదలో. రోజూ రాత్రి రంగుల బుడగలు చితగ్గొడుతున్నాడు “బుర్రలేని పని” “బుర్రలేని పని” గొణుక్కుంటూ.

రెండు మాసములఅంతమందు  రెవ్యూకి పిలిచాడు థాంసన్.

ఆసమయంలో చంద్రం తన హృదయబాధ వెళ్లబోసుకున్నాడు, “నేను ఇంజినీరుని. నాలుగేళ్లఅనుభవం వుంది నాకు. అంచేత నాకు తగిన పని ఇవ్వండి” అని.

“మీరు చేరినరోజే చెప్పేం కదా ఈ పనిలో మీ విధ్యుక్తధర్మాలు. మీరు ఇష్టపడే చేరేరు.”

“అవుననుకోండి. కానీ మీరూ గ్రహించే వుంటారు నావిద్యని మీరు అండర్‌యుటిలైజు చేసుకుంటున్నారని. గ్రోసరీస్టోరులో సంచీలో కూరలు పెట్టేవాళ్లకి గంటకి పన్నెండు డాలర్లు ఇస్తున్నారు. ఆపాటి చెయ్యనా ఇక్కడ?”

"ఎక్కడిపద్ధతులు అక్కడే. జేన్స్‌విల్లో కార్ల ఎసెంబ్లీ చూసారా మీరు? కన్వేయర్ బెల్టుమీద కారు భాగాలు ఒకొకటే వస్తూంటాయి. ఒకడు తలుపు తగిలిస్తాడు. మరొకడు మేకు తగిలిస్తాడు. రోజంతా వారిపని అదే. రోజుకి ఎనిమిదిగంటలు అలా మేకులు తగిలించడమే. వాడికి గంటకి ముప్పై డాలర్లు." అన్నాడు థాంసన్.

"మీరు చేయగలరా ఆపని?" అన్న ప్రశ్న ఆయన అడక్కపోయినా. చంద్రానికి వినిపించింది.

ఉసూరుమంటూ వచ్చి తనసీటులో కూర్చున్నాడు. పక్కనున్న టేమీ జాలిగా అతనివేపు చూసింది.

"నీకు ఈపని చూపించింది ఎవరు?" అని అడిగింది.

"జగదీశ్. ఏం?"

"ఆయనకిచ్చే వందా నీకే ఇవ్వొచ్చు కదా."

"అదేమిటి?"

"ఈచెత్తపనికి ఎవరూ రారు. వచ్చినవాళ్లు ఆర్నెల్లకంటే వుండరు. అంచేత మనలాటివాళ్లని తీసుకొచ్చి వీరికి అప్పచెప్పినవాళ్లకి వంద డాలర్లు బోనస్ ఇస్తారు. పెద్దలకయితే వందా, పిన్నలకయితే యాభై."

చంద్రానికి బాధపడే ఓపిక లేదు. "ఓ" అనేసి వూరుకున్నాడు.

నాలుగు రోజుల తరవాత ఒకరోజు థాంసన్ కాఫీషాపులో కనిపించేడు. చంద్రం మర్యాదకి హలో అన్నాడు. ఆయన తనపక్కన సీటు చూపించి అన్నాడు, "రండి, చందారా! నాకో ఆలోచన వచ్చింది. మీరు వింటానంటే చెప్తాను."

"చెప్పండి."

"నేను రిటైరవుదాం అనుకుంటున్నాను. ఇప్పుడే కాదులెండి, మరో రెండేళ్లకో మూడేళ్లకో. అయొవాలో వంద యకరాలు మొక్కజొన్నతోట కొన్నాను. ఇప్పుడు ఎథెనాల్‌కి మంచి గిరాకీ వుందికదా. నేను ఇప్పుడప్పుడే ఆపని చేపట్టలేను. ప్రస్తుతానికి మానాన్న అక్కడ వున్నారు కానీ ఆయనకి మెషినరీ ఆపరేట్ చెయ్యడం చేతకాదు. అంచేత మీరు సాయం చేస్తానంటే చెప్పండి. మీది స్వెట్ ఎక్విటీ. లాభం ఇద్దరం పంచుకుందాం. వ్యాపారం అందుకునేవరకూ మీకు భుక్తికి లోపం లేకుండా చూస్తాను."

ఆయన ప్లాను అర్థం చేసుకోడానికి చంద్రానికి చాలాసేపు పట్టింది. ఆయన మాత్రం మామూలుగానే లోకరీతిన వ్యవహారదక్షతతో చెప్పుకుపోతున్నారు. మూడు చుట్లు కాఫీలయేయి.

చంద్రానికి ఇంతవరకూ గ్రీన్ మెటల్‌లో జరుగుతున్న నాటకం మనసులో మెదులుతోంది. "మంచి ప్లానులాగే వుంది" అన్నాడు సందిగ్ధంగా.

"మంచి ప్లానే కానీ ఇంకా ప్రారంభదశలోనే వుంది. ఆలోచించుకోవలసిన విషయాలు చాలా వున్నాయి. మీకు ఆసక్తి వుంటే మాట్లాడుకుందాం." అన్నాడు బల్లమీద పది డాలర్లు పెట్టి.

చంద్రం వాలెట్ తీసేడు. "నో, నో. నేనిచ్చేశాను. మీరివ్వక్కర్లేదు." అని థాంసన్ వారించేడు.

చంద్రం ఇంటికొచ్చి రాత్రంతా ఆలోచించేడు. నిజంగా తనచదువుకు తగిన వుద్యోగం కాదు కానీ బుడగలు చితక్కొట్టడం కంటే మెరుగే.

పడగ్గదిలోకి వచ్చి చూస్తే, మనోరమచేతిలో పుస్తకం, కళ్లు సీలింగుమీదా వున్నాయి.

థాంసన్ సలహా చెప్పేడు.

"మీరేం అనుకుంటున్నారు?"

"ఏమో, నాకేం పాలుపోడంలేదు. ఇప్పుడు చేస్తున్న పని కంటే మెరుగే. ఏదో పల్లెలో పడుంటాం." అని మంచంమీద వాలి, "హాలికులైననేమి … నిజదార సుతోదర పోషణార్థమై …" అన్నాడు.

మనోరమకి కళ్లలో నీళ్లు తిరిగేయి.. భర్తకి కనిపించకుండా అటుతిరిగింది. తరవాత అతికష్టంమీద, గొంతు సవరించుకుని, "అంతేలెండి" అంది.

"అయినా ప్లాను ప్రారంభదశలోనే కదా వుంది. ఆలోచించుకోడానికి చాలా టైముంది" అన్నాడు చంద్రం తనని తనే నమ్మించుకోడానికి తంటాలు పడుతూ.

***

(తెలుగుజ్యోతి, న్యూజెర్సీ, పత్రికలో ప్రచురితం. మార్చి 2009)

# 14. వెలుగు

అమావాస్య చీకట్లని చీల్చుకుని వెలుగురేకలు నాలుగు దిక్కులా పరుచుకుంటున్నాయి నింపాదిగా.
తను పక్కమీంచి లేచి, వరండావేపు తలుపు బార్లా తీసి, వంటింట్లోకి వెళ్లింది. ఫిల్టరులో కాఫీ పొడేసి, నీళ్ళు కాచి పోసి, బాత్రూంలోకెళ్ళి టూత్ పేస్ట్ బ్రష్షుమీద పెట్టుకోబోతూంటే వచ్చిపడిందో పురుగు. . హఠాత్తుగా ఎక్కడినుంచి వచ్చిందో తనమొహంమీదుగా ఎగిరి ఎదురుగా ఉన్న అద్దంమీద వాలింది. ఓ క్షణంసేపు దీక్షగా ఆ పురుగువేపు చూసి, తరవాత అటూ ఇటూ చూసి, తువాలందుకుని దాన్ని బయటికి తరిమేయడానికి ప్రయత్నించింది. ఆ పురుక్కి కూడా అప్పుడే తెల్లారిందేమో అది హుషారుగా అద్దంమీంచి గోడమీదకీ, గోడమీంచి షవర్ కర్టెన్‌మదకీ తందనాలు తొక్కడం మొదలెట్టింది తనని ఉసి గొల్పుతున్నట్టు. దానిభాషలో అది హీహీ, హాహా అనుకుందేమో కూడా. తనకి మాత్రం పొద్దున్నే ఇదేమంత ఉత్సాహంగా అనిపించలేదు. “నీ ఖర్మ. నీ ఇష్టం ఒచ్చినంతసేపు ఆడి పో నీ దొమ్మరాట,” అనుకుని పళ్లు విసురుగా తోముకోడం మొదలెట్టింది. మామూలుగా అమెరికాలో ఇళ్లు చిట్టడవుల్లోనూ, కారడవుల్లోనూ ఉండకపోయినా, చీమలూ, కాకులూ దూరడానికి వీల్లేకుండానే కడతారు. సుమతికి ఈ ఇళ్ళంటే నవ్వు. గట్టిగా తంతే కూలిపోయే అట్టగోడలూ, అద్దాలతలుపులూ పెట్టి ఇళ్లయితే కడతారు కానీ పైరుగాలి రిమరిమలు కాపోతే పోనీ పైన్ కొమ్మల్లోంచొచ్చే ఈదురు గాలయినా లోపలికి రానంత పకడ్బందీగా కడతారు. అందుకే తను లేవగానే పడగ్గదిలోనూ, ముందుగదిలో patio తలుపూ బార్లా తీసేస్తుంది. కనీసం ఎండెక్కేవరకూ అయినా గాలాడుతుంది ఇంట్లోంచి బయటికీ బయట్నించి ఇంట్లోకీ అని.
ముందుగదిలో గాజుతలుపు వెనక జల్లి తలుపుంది. వెనకవేపు పడగ్గదిలో కూడా అలా జల్లితలుపు పెట్టించుకుంటే, ఈగల్నీ దోమల్నీ తదితర జీవసంతతినీ జల్లించేసి, ఫ్రెష్, శీతలవాయులని మాత్రమే లోనికి పంపుతుందని చాలామందే సలహా ఇచ్చేరు కానీ తనకి నచ్చలేదు. “పోన్లెద్దురు. అవి మాత్రం జీవులు కావేమిటి. వస్తాయి, పోతాయి చుట్టాల్లాగే. అవేమీ నాఇంట్లో కాపురాలు పెట్టేయవు కదా. ఇది వాటికి కేవలం రాదారీ మాత్రమే,” అంటూ వచ్చింది. నిజానికి తను ఆతలుపు తీసినందువల్ల తండోపతండాలుగా దోమలు వచ్చి పడిపోలేదెప్పుడూ. ఇప్పుడే, అదీ ఈ ఒక్క పురుగే దయచేసింది. దారి తప్పి కాబోలు.
ఆలోచిస్తూ ఆ పురుగుని మరోసారి పరీక్షగా చూసింది తను. దీనిపేరేమిటయి ఉంటుందో! సీతాకోకచిలకలా రెక్కలున్నాయి కానీ సీతాకోకచిలక కాదు. ఈగలా నల్లగానే ఉంది కానీ ఈగ కంటే బాగా పెద్దదిగా ఉంది. పోతుటీగలు అని ఉంటాయి కానీ ఇది బాగా పెద్దదిగా ఉంది. తను బాత్రూంలో దీపం వెయ్యగానే వచ్చింది, అద్దంమీద దీపానికి దగ్గరగా వాలింది. శలభమో దీపంపురుగు అంటే ఇదేనేమో. దీపప్పురుగులు ఎలా

ఉంటాయో ... ... ప్చ్. ఏమిటో ఇండియా వదిలి వచ్చేసింతరవాత అన్నీ మర్చిపోతోంది. ఆఖరికి తను తెలుగుదాన్నన్న సంగతి కూడా వాళ్లూ వీళ్లూ ఏ దసరాకో దీపావళికో పిలిస్తే తప్ప గుర్తు రావడం లేదు.
ఆ పురుగువేపు మరోమారు చూసింది. దీపానికి దగ్గరగా తచ్చాడుతోంది కనక దీపం తీసేస్తే పోతుందేమో అన్న ఆలోచన వచ్చి, దీపం ఆర్పేసి, మౌనప్రార్థన చేస్తున్నట్టు రెండు నిముషాలాగి, మళ్లీ దీపం వేసింది. పురుగు కనిపించలేదు. హమ్మయ్య, పోయింది అనుకుని, గబగబ పళ్లు తోమేసుకుని, కాఫీ కప్పుతో కంప్యూటరుముందు కూర్చుంది ఆనాటి వార్తలూ విశేషాలూ, మైక్రోసాఫ్టు గవాక్షంలో బంధుదర్శనాలూ ... పీసీ ఆన్ చేసి చూస్తే, ఎదురుగా గోడమీద ఆ పురుగు మళ్లీ ప్రత్యక్షం. ఇదెక్కడి గోల అని కొంచెంసేపు విసుక్కుని, సరే, ఈ క్షుద్రకీటకంకోసం నావిలువైన కాలాన్ని వెచ్చించడమేమిటి అని తనకి తనే బుద్ధి చెప్పుకుని, మెయిలు తెరిచింది.
ఆవిడ తనని అలా నిర్లక్ష్యం చెయ్యడం అవమానకరంగా భావించిందేమోనన్నట్టు ఆ పురుగు అక్కడినుండి ఎగిరిపోయింది. అలా ఎగిరిపోతున్న ఆ జీవాన్ని చూస్తే, తనకి ఆనందమూ, బాధా కూడా కలిగేయి. ఆనందం పోతోంది కదా అని, బాధ దానిమనసు నొప్పించేమోనని.
అలా అనేకానేక ఆలోచనలతో సతమతమవుతూ ఓ గంటసేపు పీసీ గరుడసేవ చేసి టీవీ చూద్దాం అని ముందుగదిలోకి వచ్చి ఇటు తిరిగితే మళ్ళీ ఆ పురుగు జల్లితలుపుమీద ప్రత్యక్షం! తనకి ఏం చెయ్యాలో తోచలేదు. అట్టే తేరి ఓనిముషంపాటు చూసి, ఊరుకోడానికే నిశ్చయించుకుంది.
రెండో కాఫీ సేవిస్తూంటే కళ్లు గదిలో నల్దిక్కులా తిరుగుతున్నాయి. అనుకోకుండానే, తను ఆ పురుగుకోసం చూస్తోంది. చుట్టాల్లేనమ్మ దయ్యాల్ని పట్టుకు ఏడ్చినట్టు అంటే ఇదేనేమో. ... ...
మళ్లీ అనుమానం. ఆ జల్లితలుపు మూలంగా కళ్లు కానక, దిక్కు తోచక బయటికి పోలేక కొట్టుకుంటోందేమో అనుకుని తను లేచి వెళ్లి, జల్లితలుపు కాస్త పక్కకి తోసి దానికి బయటికి పోవడానికి దారి ఏర్పాటు చేసింది. మరి ఆ పురుక్కి. తన అభిప్రాయం అర్థం కాలేదో, అసలు బయటికి వెళ్ళే ఉద్దేశ్యం లేదో, ఇప్పుడే కాదనో ... కదల్లేదు. అది గట్టిగా ఆ జల్లితలుపుకి అతుక్కుపోవడం చూస్తే మరో అనుమానం వస్తోంది. ఆ జల్లికన్నాల్లో దానికాళ్ళు ఇరుక్కుపోయి, ఎగర్లేకపోతోందేమో.
నెమ్మదిగా సందేహిస్తూనే ఓ రెక్కమీద తగిలీ తగలనట్టు వేలేసి చూసింది. అది ఉలికిపడినట్టు కనిపంచలేదు. నిదానంగా ఒక మిల్లీమీటరు కుడిపక్కకి జరిగి, సద్దుకుని, రెక్కలు పరుచుకుని సుఖాసీనురాలయింది.
అట్టే చూసి నిట్టూర్చింది. దారి తప్పి నాలుగ్గోడలమధ్యకి వచ్చేసింది పాపం అని సాయం చేయబోతే దానికేం పట్టినట్టు లేదు. బయటికి పోడానికి తను దారి చూపించినా కదల్డం లేదది. బయట అంత విశాలప్రపంచం, ప్రకృతిసిద్ధంగా సూర్యుడు వెదజల్లిన వెలుగూ వదిలేసి, ఎందుకిలా ఈ నాలుగ్గోడలమధ్యా ఇరుక్కోడం? గాలాడని ఈఇంట్లో నియాన్ వెలుగులో అది పొందుతున్న ఆనందం ఏమిటో అర్థం కావడంలేదు. అది దీపం

పురుగే అయితే, దీపంకోసమే లోపలికి వచ్చి ఉంటే, మరి దీపం కంటే శతాధికంగా వెలుగు బయట ఉంది కదా. ఏంటో మనుషులు అనుకుంటాం కానీ పురుగులు కూడా అంతే కాబోలు. చిన్న కంతలోంచి కనిపించే రవంత వెలుగుకోసం తాపత్రయం, అక్కడేదో తట్టెడు వెలుగునొల్లుకుందాం అనుకుని ఆ కంతలోకి దూరడం. “బుద్ధిహీనురాలా, ఇదుగో, ఇదీ దారి, పో, స్వేచ్ఛగా ఆరుబయట తిరగమంటే ఇదేం రోగం?” అనుకుంది. నెమ్మదిగా దినచర్యలో పడిపోయింది.

ఊళ్ళో పనులు పూర్తి చేసుకుని ఇంటికొచ్చేసరికి నాలుగయింది. ఇంటికొచ్చి, ఏసీ పెట్టుకోబోతూ అద్దాలతలుపు మూసేయబోతూంటే జల్లితలుపుమీద పురుగుకోసం చూసింది. అక్కడ పురుగు లేదు. హమ్మయ్య అనుకుంటూ, ఏసీ పెట్టుకుని సోఫాలో కూలబడి బయటికి చూడబోతే, పురుగు తలుపువార కింద కార్పెట్‌మీద పడి ఉంది. అయ్యో అనుకుంటూ దగ్గిరికెళ్లి చూసింది. సందేహం లేదు. దానిజీవితం ముగిసింది. హఠాన్మరణమా, ఆత్మహత్యా, దీనిచావులో తనపాలు ఉందా, అయితే హత్యకిందకి వస్తుందా? ... ఆలోచిస్తూ, ఆపురుగుని తీసి బయట పడేసింది. ఈ మాయామేయజగత్తులో దీనిపాత్ర ముగిసింది. దాదాపు మూడుగంటలసేపు తనని అలరించి, ఉడికించి, విసిగించి, ఏడిపించినంత పని చేసి వెళ్ళిపోయింది. పాపం అనుకోవాలో థాంక్స్ చెప్పుకోవాలో ...

మర్నాడు ఉదయం మామూలుగానే తలుపు తియ్యబోతూంటే ముందురోజు ప్రహసనం గుర్తొచ్చి కాస్సేపు ఆగింది. తరవాత నెమ్మదిగా తలుపు సగం మాత్రం తెరిచి, తొంగి చూసి, తన దినచర్యలో పడింది. కాఫీకప్పుతో కంప్యూటరుముందు కూర్చుని మౌస్ కదపబోతూంటే, చేతిమీద వాలింది మరోపురుగు పెంపుడు చిలకలా! తనకి చిన్నగా నవ్వొచ్చింది కూడా. పాపం, ఈ పురుక్కి తెలీదేమో నిన్నటి పురుగుకి పట్టినగతి. ఈనాలుగ్గోడలమధ్య ఇరుక్కుని ప్రాణాలతో బయట పడ్డం కల్ల. ఇన్నాళ్ళూ మనుషులకే ఉంటుందనుకుంది - ఇల్లూ, ఎలెక్ట్రిక్ వెలుగులూ తాపత్రయం. వీటికోసం పరుగులు మానవధర్మం అని ... ... కానీ ఇప్పుడీ పురుగుసంతతిని చూస్తూంటే సృష్టిలో ఏజీవాలైనా అంతేనేమో అనిపిస్తోంది.

తనింక తగువులొదిలేసుకుని, సహజీవనానికి సిద్ధపడడమే నయమేమో! పైగా, ఏ రోజు ఒక్క పురుగు మాత్రమే తనఇంట్లోకి వేంచేయడం ఆశ్చర్యం! తనబుర్రలో వెయ్యివాట్ల బల్బు వెలిగినట్టయింది ఆ క్షణంలో!

(10 జులై 2010.)

# 15. అవ్యక్త మధురం

సాయంత్రం నాలుగయింది. పుస్తకం మూసి కిటికీవేపు చూసింది. బయట మంచు సన్నగా పడుతోంది. రాత్రి పడ్డ మంచు తియ్యడానికి ఇంకా సిటీ బండి రాలేదు. ఈ చిన్న వీధులు క్లియర్ చెయ్యడానికి తొందర లేదు. రాత్రి బాగానే పడినట్టుంది. సిటీ బళ్ళన్నీ పెద్దవీధులు ఊడ్చే పనిలో ఉన్నారు.
కిటికీకి దగ్గరగా వెళ్లి మరోసారి తొంగి చూసింది. రోజు ఇదే సమయానికి ఆవిడ వీధిలో కనిపిస్తుంది పశ్చిమదిక్కుగా నడుస్తూ. ఎండలో వానలో చలిలో గాలిలో … ఏరోజూ ఆవిడ మానలేదు. ఏడాదిగా చూస్తోంది ఆవిడని. ఎవరై ఉంటుందా అన్న జిజ్ఞాస నెలరోజులుగా మొదలయింది.

తనున్నది చిన్న వీధి. ఈవీధిలోకి అట్టే కార్లు రావు తమఇల్లు దాటి ఉన్న ఎనిమిదిళ్ళవాళ్లు తప్పిస్తే. వీధిలో మనిషిజాడ కనిపించడమంటే గగనకుసుమమే. ఎవరైనా రాక్షసుడిటు వస్తే, “ఇది యేమి ఎచటను నరవాసన లేదు” అని విస్తుపోవాలి. ఉత్తరదిశగా ఓ ఇంట్లో ఇద్దరు పిల్లలున్నట్టుంది. ఐదారేళ్లవాళ్లు. సాధారణంగా తల్లో తండ్రో వాళ్ళని కార్లో పడేసుకుని తీసుకెళ్లడం, తీసుకురావడం … అంతే. అమావాస్యకో పౌర్ణానికో ఓమారు మంచి సెగలు గక్కే ఎండవేళ మరే దిక్కూ తోచక సైకిళ్లేసుకుని తిరుగుతూ కనిపిస్తారు. … అంతే… అంతకుమించి మనిషిజాడ కనిపించదు. ఈ వీధిలో ఉన్నా ఒకటే కీకారణ్యంలో ఉన్నా ఒకటే. ఏ పెద్దపులో ఎలుగుబంటో కనిపించినా కనిపించొచ్చు అనుకుని నవ్వుకున్న రోజులున్నాయి వచ్చిన కొత్తలో. ఇప్పుడు అలవాటయిపోయింది గానీ. పూర్వం మునులు అడవులకెళ్లేవారు నిరాఘాటంగా ధ్యానం చేసుకోడానికి. ఇక్కడ ఈ ఇల్లే చాలు. టీవీ పెడితే తప్ప శబ్దాల్లేవు. కొడుక్కి ఇల్లంటే కంచం, మంచం. అంతే. ఆపైన ఇల్లాలు అదనపు సౌకర్యం. Additional perk. కోడల్ని చూస్తే ఆ పిల్లకిది పూర్వజన్మసంచితార్థమేమో అని అనుమానం కలక్కమానదు. తనపనేదో తను చేసుకుపోతూ ఉంటుంది మరబొమ్మలా. తనకి రెండు తరాల తరవాత పుట్టిన పిల్ల! చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. ఇంత ఉదాసీనత ఎలా వచ్చిందో! అసలు వీళ్లిద్దరికీ తనకీ సంబంధం ఉన్నట్టే అనిపించడం లేదు.
ఉలికిపడింది. తనిలా ఆలోచిస్తూ టైము చూసుకోలేదు. ఆవిడ వెళ్లిపోయిందేమో .. లేచి కిటికీ దగ్గరికి వెళ్లి చూసింది. ఆవిడ కిటికీ దాటి పదడుగులు వేసి, ఎదురుగా వస్తున్న కుక్కపిల్లని చూసి ఆగింది. తనకి చిరాకేసింది. ఏమిటో ఈకుక్కప్రేమలు. సాటిమనుషులకంటే వీళ్లకి కుక్కలే ఆప్తబంధువులు. “ఏం చెయ్యదు. చాలా ఫ్రెండ్లీ కుక్క.” అంటోంది కాబోలు ఆ కుక్కమనిషి దాన్ని ఎత్తి గుండెల్లోకి పొదువుకుంటూ.

"అది ఫ్రెండ్లీ కుక్క కావచ్చు కానీ నేను కుక్క ఫ్రెండ్లీ కాదు" అంటున్నట్టుంది ఆవిడ ఫుట్‌పాత్‌మీదే కాస్త పక్కకి తప్పుకుని.

నిజమే మరి. కుక్క వారికి  కుక్క ముద్దు కావచ్చు కానీ ఊళ్లో అందరికీ ముద్దు కావాలనేముంది? దేశంలో ఉండడానికిల్లూ తిండానికి తిండీ లేక అల్లాడుతున్నవాళ్ళు మూడు కోట్లున్నారు. కుక్కలకి రాజేంద్రభోగాలు. ... అదేం నీతో ... ప్చ్.

ఆవిడ కుక్కనీ కుక్కప్రేమికురాలినీ దాటి ముందుకి వెళ్లిపోయింది.

తను మళ్లీ వచ్చి సోఫాలో కూచుని చదువుతున్న పుస్తకం తీస్తూ గోడమీద వాచీ చూసింది. నాలుగు దాటి అయిదునిముషాలయింది. .

పుస్తకంమీద దృష్టి నిలవడంలేదు. మరో నలభైఅయిదు నిముషాలకి ఆవిడ అటునించి ఇటు వెళ్తుంది. ఏమిటో అనుకోకుండా ఆవిడకోసం ఇలా ఎదురు చూడ్డం అలవాటయిపోయింది. ఇంకా నలభై నిముషాలుంది కదా. ఈలోపున రాత్రి వంటకి కూరా, నారా చూసుకుంటే కొంత కాలక్షేపం అని లేచింది. తను మొదలు పెడితే, కోడలొచ్చి పూర్తి చేసుకుంటుంది. మొదట్లో ఆ అమ్మాయి తనని ఏం చెయ్యొద్దని చెప్పింది కానీ తనకే పొద్దు పోడంలేదని మొదలు పెట్టింది. కూరలు తరగడం, కుకర్లో పప్పు పడేయడం ... అంతే తనవంతు. ఆపైన కోడలొచ్చి అందుకుంటుంది. ఒకోసారి తను తీసిన కూర అమ్మాయికి నచ్చదు. అది పక్కన పెట్టేసి మరోటి మొదలు పెడుతుంది. అంతేగానీ పెద్ద తగువుల్లేవు ఇంట్లో. కొంతలో కొంత మేలు.

మళ్లీ వచ్చి పుస్తకం తీసుకుంది. కిటికీమీద ఓ కన్నేసి ఉంచింది. అంతలోనే తనమీద తనకే విసుగు. ఆవిడెవరో తెలీదు. ఎక్కడినుండి వచ్చిందో, ఎక్కడికి వెళ్తోందో, చివరికి ఎక్కడ తేల్తుందో - ఏమీ తెలీదు. అయినా ఏదో దగ్గిరచుట్టం అయినట్టు ఆవిడకోసే ఈ ఎదురుచూపు. అర్థం లేదు. కారణాల్లేవు. ...

గడియారం చూసింది. ఇంకా పదినిముషాలుంది.

ఇంతలో కోడలొచ్చింది. "ఏం, ఇవాళ కొంచెం పెందరాళే వచ్చేసేవు?" అంది. కోడలు అయిదు దాటి కానీ ఎప్పుడూ రాలేదు. ఇప్పుడింకా పావుతక్కువ అయిదే.

"ఏం లేదు. పనయిపోయింది."

అంతే తమ మధ్య సంభాషణలు. మళ్లీ కిటికీవేపు చూస్తూ కూర్చుంది. నాలుగూయాభై. ఆవిడ ఏ క్షణమయినా కనిపించవచ్చు. కానీ కనిపించలేదు.

హఠాత్తుగా మరో ఆలోచన వచ్చింది. తనే బయల్దేరి వీధిలోకి వెళ్లొచ్చు కదా. ఇంతవరకూ తనకి ఎందుకు తోచలేదో ... నెమ్మదిగా లేచి కోటూ, బూటూ వేసుకోసాగింది.

"ఎక్కడికి?" అంది కోడలు.

"ఊరికే. కాస్సేపు బయట తిరిగి వస్తాను."

"ఇప్పుడా? చలిగా ఉంది. మంచు కూడా బాగానే పడుతోంది. జారి పడతారేమో."
"ఫరవాలేదు. జాగ్రత్తగా చూసుకు నడుస్తాలే."
"పోనీ. నేను కార్లో అలా మాల్‌కి తీసుకెళ్తాను. కొంచెంసేపాగితే. మాల్‌లో తిరగొచ్చు."
"కార్లో తిరుగుతూనే ఉంటాం ఎప్పుడూను. కాస్త ఆరుబయట నడుద్దాం అని."
"అట్టే దూరం వెళ్ళకండి. పడమటివేపుకి వెళ్ళకండి. అక్కడ ఉండే జనాలు మనలాటివాళ్లు కాదు."
తను తలూపి బయల్దేరింది. కోడలొచ్చి చేతికర్ర అందించింది. మాటాడకుండా అది పుచ్చుకుని వీధిలో అడుగు పెట్టింది. "మనలాటివాళ్లు" అంటే? మనంవంటే, మనలాటివాళ్లంటే ఎవరు? గట్టిగా ఆలోచిస్తే మనం మాత్రం తెల్లవాళ్లమా ఏమిటి? … … కాదు కానీ మనం తెల్లవాళ్లకి గల సకల సల్లక్షణాలూ ఉన్నవాళ్లం అని కాబోలు. అవును మరి. డబ్బూ, చదువూ, సంస్కారం అన్నీ హక్కుభుక్తములు చేసుకున్నవాళ్లం మనం. బహుశా పడమటిదిక్కున ఉన్నవాళ్లకి డబ్బూ, చదువూ ఉండి ఉండకపోవచ్చు. అవి లేకపోయేక ఎంత సంస్కారం ఉన్నా లేనట్టే లెఖ్ఖ. వాళ్లకున్నది కూడా సంస్కారమే అని అనడానికి "మనవాళ్లకి" మనస్కరించదు.
ఆలోచిస్తూ నడుస్తుంటే, ఇద్దరు అబ్బాయిలు ఎదురొస్తూ కనిపించేరు. పెద్దవాడికి 18, 19 ఏళ్ళుండొచ్చు. తండ్రో, అన్నో … అతనిచేయి పట్టుకుని, చిన్నవాడు నెమ్మదిగా నడుస్తున్నాడు చలికోటూ, బూట్లూ ఈడ్చుకుంటూ. మూడున్నరా నాలుగేళ్ళకి మించి ఉండవు. తనని చూస్తూనే దూరంనించే కళ్ళు చికిలించేడు. తను చిన్నగా నవ్వుతూ తలూపింది పలకరింపుగా, జవాబుగా.
ఆ ఇద్దరూ మనవాళ్ళు కాదన్నది స్పష్టంగానే తెలుస్తోంది కంటికానని సిరాతో వాళ్లమొహాలమీద పెద్దక్షరాలతో రాసి ఉంది. ఇద్దరూ తనని దాటి వెనక్కి వెనక్కి సాగిపోయేరు. తను ముందుకి ఇంకొంచెం దూరం నడచి నాలుగువీధుల కూడలిలోకి వచ్చింది. ఎటు వెళ్ళాలో తోచలేదు. తను ఎవరికోసం ఎదురు చూస్తోందో ఆవిడ - అవిడ పేరు కూడా తెలీదు తనకి - ఎటు చూసినా కనిపించలేదు. వెనక్కి తిరిగింది.
తిరిగి వస్తుంటే మళ్ళీ ఆ ఇద్దరబ్బాయిలు ఎదురొచ్చేరు, వాళ్లు ఎంతదూరం వెళ్లేరో, ఎందుకెళ్లేరో … వెనక్కి తిరిగి వస్తున్నారు.
బాగా దగ్గరికొచ్చి, క్రాసింగ్ అయేవేళకి ఆ చిన్నవాడు పెద్దవాడికాళ్ళవెనక్కి నక్కి, సిగ్గుపడుతూ చెయ్యి చాపేడు, ఆచిన్నివేళ్ళ చిగుళ్లు తన పేంటుకి తగిలీ తగలనట్టు.
పెద్దవాడు తననీ, పిల్లవాడినీ మార్చి మార్చి చూస్తూ నవ్వేడు.
తను ఈసారి పెద్దగానే నవ్వి, ఆపిల్లాడికి మరోసారి హాలో చెప్పి ముందుకి సాగింది.
ఆవిడ కనిపించకుండానే ఆరోజు ముగిసింది తనకి. అది అసంతృప్తిగానే ఉన్నా మనవాళ్ళు కాని ఇద్దరు పిల్లలు స్నిగ్ధమాధుర్యం చవి చూపినందుకు ఉల్లాసంగా ఉంది.
ఇంటికొచ్చేక కోడలికి చెప్పింది ఆ పడమటిదిక్కున కనిపించిన పిల్లలగురించి.

“ఓ” అంది కోడలు. అంతే.

మర్నాడు కూడా ఆవిడ కనిపించలేదు. నిన్నటి పిల్లలు జ్ఞాపకం వొచ్చేరు. ఆవిడ కూడా ఒకవేళ ఆపిల్లల్ని చూడడానికే అటు వెళ్తోందేమో అనిపించింది. ఓ కాగితం, కలం తీసుకుని కూర్చుంది.

కొందరిజీవితాల్లో ఆత్మస్పర్శలు
సమాంతరంగా సాగుతాయి.
కలవవు విడిపోవు.
వారి బాంధవ్యం
సాగుతుంది సరస్వతీనదిలా
అవ్యక్త పట్టాలమీద
“ఔరా” ఎక్స్‌ప్రెస్ అయి.

. అని రాసుకుంది. తన జీవితంలో అదే తన తొలికవితా, కథా కూడాను!

(10 జులై 2010)

# 16. ఉత్తమాయిల్లాలు

భార్యశవంముందు కూర్చుని, కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు శ్రీరంగశయనంగారు.

ఆయనచుట్టూ అయినవాళ్లూ, కానివాళ్లూ, దారేపోయేవాళ్లూ చేరి, సర్వవిధాలా అనునయవాక్యాలు చెబుతూ, తమవిధిని నిర్వర్తించుకుంటున్నారు.

కొడుకు చక్రధరం వారిని యధావిధి పలకరిస్తూ, వారి ప్రశ్నలకి తోచినట్టు జవాబులిచ్చుకుంటూ, తండ్రినో కంట గమనిస్తూ ఉన్నాడు.

శ్రీరంగశయనం పైపంచెతో కళ్లొత్తుకుంటూ చెప్తున్నారు. “పదహారేళ్లు దానికి పెళ్లినాటికి.. … నాకు ఇరవైమూడు. ఎంత మర్యాద, ఎంత మప్పితం అంటూ మా అమ్మా, నాన్నా ఎంత మురిసిపోయేరో పిల్లని చూసి! … ముప్పైనాలుగేళ్ల కాపురంలో ఒక్కరోజు నోరు విప్పి తనకిది కావాలని కోరలేదు. … నాకేం కావాలో చూసిందే కానీ తనకేం కావాలో చెప్పలేదు. … అనుక్షణం నేను తిన్నానో, లేదో అంటూ తపనపడిపోయిందే కానీ తను తినాలన్న యావ లేదు … అకస్మాత్తుగా పదిమంది గుమ్మంలోకొస్తే కిక్కురుమనకుండా వండి పెట్టిందే కానీ ఇసుమంతయినా ధుమధుమలాడలేదు. కంచాలముందు కూర్చునేవేళకి మరో నలుగురు వచ్చినా సర్దుకుపోయిందే కానీ చిరాకుపడలేదు. … తను తినేవేళకి గిన్నెలో అన్నం నిండుకుంటే, పోన్లెద్దురూ ఓపూట తినకపోతే ఏం అనే అంది కానీ మరోలా వ్యథ పడలేదు. అంతటి ఉదాత్తురాలు. అటువంటి ఉత్తమురాలు మరి పుట్టబోదు …”

“అవునండీ, ఆమెని తలుచుకుంటే చేయెత్తి దణ్ణం పెట్టాలనిపిస్తుంది” అన్నారు పొరుగింటి సుబ్బారావు ఆయన్ని ఓదారుస్తూ.

నలుగురూ చేరి శ్రీరంగశయనంగారిని రెక్క పుచ్చుకు బలవంతాన లేవదీశారు, మిట్టమధ్యాన్నానికయినా దహనం అయిందనిపిస్తే, ఆతరవాత ఇంకా చేయవలసిన విధులు చాలా ఉన్నాయని.

తండ్రీకొడుకులిద్దరూ తలలు బోడి చేయించుకుని, స్నానాలు చేసి పంచెలు కట్టుకుని వచ్చారు.

ముత్తయిదువులు శవానికి స్నానం చేయించి, కొత్తచీరె కట్టి, పసుపూ, కుంకమలతో, పువ్వులతో అలంకరించి పాడెమీద ఉంచేరు. కర్మకాండ పూర్తయేసరికి నాలుగయింది.

అంతసేపూ శ్రీరంగశయనం ఆరారా గుక్క తిప్పుకుని భార్య సుగుణపుంజాన్ని కోమటింట చిట్టాఆవర్జాల్లా వల్లిస్తూనే ఉన్నాడు.

కాస్త ఎడంగా నిలబడి ఈ తంతు తిలకిస్తున్న ఒకరిద్దరికి ఆయనవరస కాస్త అతిగా కూడా అనిపించింది.

"నేనెంత చెప్తే అంత. ఒఖ్ఖరోజంటే ఒఖ్ఖరోజు నామాటకి ఎదురాడితే ఒట్టు. నాకు నేనై పోనీలే అని ఊరుకోవాలే కానీ తానయి ఒక్కరోజయినా నావల్లకాదండీ అన్లేదు పుణ్యాత్ముౘరాలు. ... " అన్నాడాయనే మళ్లీ అందుకుని.
"అవును మరి. ఉత్తమాయిల్లాలు," అన్నాడు సుబ్బారావు.
పెళ్లినాటికి అమ్మాయికి పదహారు. ఆ బ్రహ్మముహూర్తం ఆసన్నమయేవరకూ ఆరేళ్ల పసిదానిలా నిష్పూచీగా ఆడుతూ పాడుతూ తిరిగింది చిన్నప్పగారి పెదవానిపాలెంలో. సాంప్రదాయకమయిన కుటుంబం. నలుగురు మగపిల్లలతరవాత అపురూపంగా పుట్టిన ఆడపిల్ల. తండ్రి ఎంతో ముద్దుగా చూసుకున్నాడు. మరీ అంత ముద్దేమిటి, పిల్లని పాడు చేస్తున్నారని తల్లి కసిరినా, మురిపెంగానే కానీ ముటముటలాడుతూ కాదు. పదును లేని ఆ విదిలింపులకి, తండ్రి కళ్లు చికిలిస్తూ, "నీమురిపేనికి మాత్రమేం తక్కువ" అనేవాడు వెక్కిరిస్తూ.
శ్రీరంగశయనం మెరికలాటి కుర్రాడనీ, పట్నంలో లాయరుప్రాక్టీసు పెట్టేడని ఎవరో చెప్తే, విని తండ్రి మధ్యవర్తిద్వారా కబురు పెట్టేరు. అట్టే ఆర్భాటం లేకుండానే వివాహం నిశ్చయమయిపోయింది. అటూ ఇటూ కూడా ఆనందంగానే కార్యం అయిందనిపించేరు. పిల్లని పసుపుకుంకాలతో అంపకాలు పెడుతుంటే తల్లిగుండెలే కాదు తండ్రిగుండెలు కూడా అవిసిపోయేయి. ఎన్నో సుద్దులు చెప్పి అప్పగింతలు పెట్టేరు. ఇది ముప్పైనాలుగేళ్లకి ముందు మాట.
చుట్టూ చేరిన జనం శ్రీరంగశయనంగారి మాటలు నిజం నిజం అంటూ తమ సానుభూతి తెలియజేసి, ఆ మహాఇల్లాలు పట్టెడు పసుపూ, కుంకుమలతో పుణ్యస్త్రీగా తరించినందుకు హర్షం వెలిబుచ్చారు.
ముప్పైనాలుగేళ్లపాటు నిసువుని సాకినట్టు కట్టుకున్నవాడి ఆలనాపాలనా చూసుకున్న ఇల్లాలు కన్ను మూసింది. మళ్లీ అంతటి నియమనిష్ఠతోనూ ఇప్పుడు ఎవరు తనకి చేస్తారనుకుంటూ దుఃఖిస్తున్నారు ఆయన.
పక్కింటి సుబ్బారావు ఆయనవేపు ఓమారు చూసి, "హుం, నిన్నటికీ ఇవాళ్టికీ ఎంత వ్యత్యాసం!" అనుకున్నాడు. నిన్న కొట్టొచ్చినట్టు కనిపించిన ధీమా ఈరోజు మచ్చుకయినా కనిపించడంలేదు ఆయన ముఖంలో. మనిషి సగానికి సగం తగ్గిపోయాడు. దివాలామొహం పడింది. "భార్య ఆసరా అలాటిది," అని కూడా అనుకోకుండా ఉండలేకపోయేరు.
హాల్లో కూర్చుని, "కాఫీ తే", "నాచెప్పులేవీ", "కళ్లజోడు ఎక్కడ పెట్టేనో చూడు" అంటూ కేకలేస్తే, వినిపించుకోడానికి ఆవిడ లేదింక.  ఆయనబాధ అదేనేమో అని కూడా అనిపించింది సుబ్బారావుకి.
ఆ వెంటనే, ఛీ, ఛీ, పాడు ఆలోచన అని తనని తనే చీవాట్లు వేసుకున్నాడు.

ఆవిడ కాలేజీలో ఫిజిక్స్ లెక్చరరు. అదే కాలేజీలో గౌతమి ఇంటరులో చేరింది. వాళ్లున్న వీధిలోనే ఆ చివరింట్లో ఉండేవారు. గౌతమి కాలేజీకి బయల్దేరేవేళకే ఆవిడా బయల్దేరేది. ఒకటిరెండు సార్లు రోడ్డుమీద కనిపిస్తే, రా, అంటూ రిక్షాలో ఎక్కించుకుంది. రిక్షావాడు మొదటిరోజు ఏం అనలేదు కానీ రెండోరోజు, "కాలేజీ అప్పులో ఉద్దర్ని నాగాల. కస్టం సూడండమ్మగోరూ" అంటూ నసిగేడు.

"ఆవిడ అలాగేలే, పద" అని, రిక్షా దిగింతరవాత, వాడిచేతిలో మరో రూపాయి ఎక్కువ పెట్టింది. ఆసంగతి గౌతమి వాళ్లమ్మతో చెప్తే, ఆవిడ రిక్షావాడితో మాటాడి, గౌతమిని కూడా ఆరిక్షాలోనే రోజూ తీసుకెళ్లే ఏర్పాటు చేసింది.

ఆవిడ గౌతమికంటే సుమారు పదిహేనేళ్లు పెద్ద. మొదట్లో గౌతమికి మొహమాటంగా ఉండేది కానీ నాలుగురోజులయేక, అలవాటయిపోయింది. పత్రికలలో వస్తున్న సీరియల్స్ గురించి మాటాడుకునేవాళ్లు ఇద్దరూ. తనకి చాలారోజులవరకూ తెలీలేదు. ఆవిడ కూడా కవితలూ, కథలూ రాస్తోందని. "శ్రీరంగవల్లి" అన్నపేరుతో కవితలూ, కథలూ రాస్తున్నారుట. ఆవిడపేరు వేదవల్లి!

"మరి మీరు రాస్తున్నారా? లాయరుగారు రాస్తున్నారా నిజంగా?" అని అడిగింది గౌతమి ఓరోజు.

ఆవిడ చిన్నగా నవ్వి, "నువ్వేం అనుకుంటున్నావు?" అన్నారు, కొనకళ్ల కొంటెతనం మెరిపిస్తూ.

గౌతమి ఆలోచించి, "మా స్నేహితులు చాలామంది ఆయనే రాసి మీపేరు పెట్టేరంటున్నారు. నేను అనుకోడం మీరే రాస్తున్నారు అని," అంది సీరియస్‌గా.

ఆవిడ నవ్వేసి, మాట మార్చేశారు.

శ్రీరంగశయనం కొడుకుతో మళ్లీ తనకథ కొనసాగించేడు, "నేను కంచంముందు కూర్చుని ఆకబురూ ఈకబురూ, జరిగినవీ విన్నవీ చెప్తే, తను కథలు కథలుగా రాస్తూండేది. నేనే చెప్పేను పత్రికకి పంపమని. నాప్రోత్సాహమే లేకపోతే, మీఅమ్మ పేరు ఎవరికీ తెలిసేదే కాదు. మీరే కదా చెప్పేరు కథ, మీపేరుమీదే పంపండి, అంది మొదట్లో. అంతటి వినయం మీఅమ్మది. సరే ఇద్దరిపేరుమీదా పంపించు అన్నాను నేను. అసలు శ్రీరంగశయనం అనే పెట్టాలిసింది. శ్రీ అంటే సిరి, ఆవిడే కదా నా సిరి. మళ్లీ నాకే తోచింది శ్రీరంగవల్లి అని. ఒరిజినల్‌గా ఉంది కదూ. పత్రికలవాళ్లు ఆడపేరు చూస్తే, తిరుగు లేకుండా వేసేసుకునే రోజులవీ," అన్నారాయన నిట్టూర్చి. పత్రికలవాళ్లు అలా ఆడపేరుకోసం ఆరాటపడకపోతే, రచయితపేరు శ్రీరంగవల్లి కాకపోను అన్నట్టుందామాట చక్రధరానికి.

అతను తలొంచుకు కూచుని వింటున్నాడు తండ్రిమాటలు. తల్లిమొహం పదే పదే గుర్తొస్తోంది. ఎంచేతో తండ్రిమొహం ఎదురుగా ఉన్నా. "శ్రీరంగవల్లి" రూపు కంటికి ఆనడం లేదు.

“నీకు గుర్తుందా విజయవాడలో సన్మానం జరిగినప్పుడు. మొదట మీఅమ్మ రానంది కానీ నేనే గట్టిగా చెప్పేను ఆవిడ కూడా రావాలని. నా అర్థాంగి. నాకు సత్కారం అంటే తనకీ సత్కారమే కాదూ. ఆవిడ వేదికమీద ఉంటేనే నాకు పరిపూర్ణమయిన సంతృప్తి అని.”

కొడుకు మళ్లీ తల్లిమొహం గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నించాడు. నిన్నటివరకూ కళ్లఎదుట నడయాడిన అమ్మ - ఆవిడమొహం ఈరోజు ఇలా మసకమసక అయిపోతోందేం? తల గోడకేసి కొట్టుకోవాలనిపించింది.

“ఆరోజు నేనే చెప్పేను ఆ సెక్రటరీకి మాఆవిడని కూడా గౌరవించాలని. … సభలో ఆవిడకి కూడా శాలువా కప్పించేను నేనే చెప్పి. మీఅమ్మది ఎంత దొడ్డ మనసో … సాయంత్రం ఇంటికొచ్చేవేళకి గుమ్మంలో గంగిరెద్దు కనిపించిస్తే, ఆ శాలువా ఆఎద్దుమీద కప్పింది. చూశావా … అంతటి ఔదార్యం ఆమహాయిల్లాలిది.“

అది ఔదార్యం? దానగుణమేనా, మరోటా? … ఉహూః. … చక్రికి అలా గందరగోళం అయిపోయింది మనసంతా.

గౌతమి, “అత్తగారు ఆ శాలువా దానిమీద విసిరేసేరు, చూసారా?” అంది ఆరోజు తల్లివెనకాలే ఇంట్లోకి వస్తూ. తల్లిమొహంలో ఆపూట తనకి దానగుణం కనిపించడంలేదు ఎంతగా కళ్లు పొడుచుకు చూసినా. కళ్లు గట్టిగా మూసుకుని మరోసారి జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించేడు. అమ్మమొహం అలుక్కుపోయి కనిపిస్తోంది. ఆమొహంలో … అదేదో … చిరాకులా ఉంది కానీ ఔదార్యంలా అనిపించడంలేదు.  ..  అయ్యో, దేవుడా! ఇంత మందబుద్ధిని చేసేవా నన్ను? అమ్మమొహం గుర్తించేపాటి తెలివయినా లేకుండా చేసేవేమిటి? - చక్రధరం జుట్టు పీక్కున్నాడు.

“అంతటి మహా మనీషి మరి పుట్టబోదు. … ….” అంటూ శ్రీరంగశయనం బాధపడిపోతున్నాడు.

ముప్ఫైనాలుగేళ్లు తన మంచీ చెడ్డా, ఆలనా, పాలనా చూసిన ఇల్లాలు తన్నొంటరిగాణ్ణి చేసి తరలిపోయింది.

“ఇప్పుడు నాగతేం కానూ … ” అంటూ ఏడుస్తున్నాడాయన.

ఆయనవేపు మరోసారి చూసేడు చక్రి. రవంత జాలేసింది రెండునిముషాలపాటు. పాపం, ఎంతలేదన్నా ముప్ఫైనాలుగేళ్లు కలిసి కాపురం చేసింతరవాత ఆమాత్రం బాధ ఉండదా సహధర్మచారిణి పోయినందుకు అనుకున్నాడు. తనజీవితంలో పాలు పంచుకున్న మనిషి మరింక ఉండదనుకుంటే ప్రాణం గుబగుబలాడదా అనిపించింది. మరోసారి, ఆయనమొహంలోకి తేరి పారచూశాడు.

“నాకేం కావాలో చూసుకుని అమర్చిపెట్టడంలోనే పరమానందం పొందింది గానీ ఏనాడూ తనకిది కావాలని కోరి ఎరగదు. అంతటి ఉత్తమురాలిని మరి కానం. సాయంత్రాలు ఆఫీసునుంచొచ్చి, తోటి సావాసగాళ్లతో నేను పేకాటకూర్చుంటే, కాలేజీనించి హడావుడిగా వచ్చి, వేడి వేడి పకోడీలు చేసి పెట్టి, ఆతరవాతే వంట మొదలు పెట్టేది. … … ఒక్కసారి మాత్రం కాబోలు అలిగి, అన్నం తిననని పట్టు బట్టుక్కూచుంది. నాకు నేను వడ్డించుకు తినాల్సొచ్చింది.”

అంతవరకూ ఓపిగ్గా వింటున్న మరో చుట్టం, "అదేమిటండీ, ఆవిడ చేసిన వంట ఆవిడ తినకుండా మీరు కూర్చుని భోంచేశారా?" అన్నాడు.

అమాయకుడు కాకపోతే అలా అడుగుతాడా?

"నాకోసం చేసినవంట నేను తినకపోతే, పాపం, ఆవిడ చిన్నబుచ్చుకోదూ? అక్కడికీ అన్నాను, ఒకటి కాదు రెండుసార్లు, నువ్వూ తిందూ గానీ, రా అని. ఆకల్లేదంది. మరి, ఆకల్లేదంటే, తిను, తిను అనడం తగునా?"

"పాపం, మీకు మీరే వడ్డించుకు తినాల్సొచ్చిందా" ఎదురింటి ఎల్లమ్మగారు నొచ్చుకున్నారు.

శ్రీరంగశయనం విచారంగా తలూపేరు.

వచ్చినవారందరూ ఒకొకరే పొద్దు పోతోందంటూ లేచేరు.

నెలరోజులయింది. శ్రీరంగశయనం గతించినభార్యనీ, ఆమె ధార్మికచరిత్రనీ కీర్తిస్తూనే ఉన్నారు, గంగాప్రవాహఝరిలా.

అంతవరకూ మాటాడకుండా కూర్చున్న కొడుకూ, కోడలూ లేచారు.

"కూరేం చేద్దాం?" అంది గౌతమి.

"నిన్న తెచ్చిన బెండకాయలు ఉన్నాయి కదా" అన్నాడు చక్రధరం ఆమెని అనుసరిస్తూ.

శ్రీరంగశయనం కోడలివెనక వెళ్తున్న కొడుకుని చూశారు తీక్ష్ణంగా. ఓ పావుగంట అయినతరవాత, ఏమనుకున్నారో, "చక్రీ, ఇలా రా. నీతో మాటాడాలి" అంటూ పిలిచారు, స్వరం పెంచి.

"వస్తున్నా. బాబుకి స్నానం చేయించి వస్తా. అన్నం తింటూ మాటాడుకుందాం," అన్నాడు చక్రి గదిలోకి వచ్చి, బాబుని తీసుకు బాత్రూంవేపు నడుస్తూ.

తండ్రి తలూపేడు అప్రసన్నంగానే.

ఆరాత్రి భోజనాలదగ్గర నెమ్మదిగా చెప్పేరాయన తనమనసులో మాట, "నీకు గుర్తుందా, మా ఆఫీసులో వేణుగోపాల్. వాళ్ల చెల్లెలుంది, చేసుకోమంటున్నాడు. నీకూ తెలుసు కదూ ఆవిడ. నాలుగేళ్లక్రితం భర్త పోయాడు."

నోట్లో ముద్ద పెట్టుకోబోతున్నకొడుక్కి కొరబోయింది. గొంతు సవరించుకుంటూ నీళ్లగ్లాసు అందుకున్నాడు. గ్లాసులో నీటితెరల్లో అమ్మమొహం అలుక్కుపోయి కనిపించింది.

కూర మారు వడ్డించబోతున్నకోడలిచేతిలోంచి గరిటె జారి గిన్నెలో పడి ఖంగుమంది.

తండ్రికి  ఒళ్లు మండిపోయింది ఆ యిద్దరివరసా చూసేసరికి. "తప్పకుండా చేసుకోండి, మీకు ఆలనా పాలనా చూసుకోడానికి మనిషి కావాలి" అనవలసిన కొడుకు ఇలా గుక్కిళ్లు మింగడమేమిటి? చటుక్కున నీళ్లగ్లాసు అందుకుని, అరచేతిలో నీళ్లు పోసుకు కంచంలో వదిలి, లేచిపోయేరాయన.

లేస్తూ, లేస్తూ, "ఆవిడ వితంతువని కాబోలు నీబాధ?... నాకలాటి నికృష్టపు ఆలోచనల్లేవు. ... నిన్ను కూడా నాలాగే ... ఆధునికభావాలతో ... పెంచేననే అనుకున్నాను ఇంతకాలం. ఛీ, ఛీ, నాకడుపున చెడబుట్టేవు." అనేసి, విసవిస అంగలేస్తూ హాల్లోకి వెళ్లిపోయేరు.

కొడుకు వంచిన తల ఎత్తలేదు. కోడలు స్థబ్ధురాలయి కూర్చుండిపోయింది.

రెండునిముషాలపాటు భోజనాలగదిలో గాలి ఘనీభవించిపోయింది, చురకత్తి విసిరినా తెగనంత దట్టంగా, మట్టసంగా.

శ్రీరంగశయనం తిరిగి గుమ్మంలోకి వచ్చి, "నీకు మీఅమ్మలాటి మనిషి కావాలని ఉందేమో. అమ్మలాటి మనిషి మళ్లీ దొరకదు. నేను వేణుగోపాల్ చెల్లెల్ని చేసుకుంటానంటే నావిశాలహృదయమే అదీ," అన్నారు గుండెలమీద చేత్తో రాచుకుంటూ.

కొడుక్కి అదును దొరికింది, "లేదు, నాన్నగారూ, వేణుగోపాల్‌గారి చెల్లెలంటే నాకు గౌరవమే! ఆవిడ అమ్మలాటి ఉత్తమాయిల్లాలు కాదు. అందుకు నేను విచారించడంలేదు కూడా. మీకే ... మీరే ... మీరే ... ఆమె ... **అమ్మలాటి ఉత్తమాయిల్లాలు** కావాలని ఆశ పడుతున్నారనీ ..." అన్నాడు "అమ్మలాటి ఉత్తమాయిల్లాలు" అన్నపదం ఒత్తి పలుకుతూ.

అన్నతరవాత తనభార్య గౌతమివైపు చూశాడు. ఆ ముఖం అమ్మ తన ఆశలకీ, ఆశయాలకీ, అభిప్రాయాలకీ ప్రతీకగా తీర్చిదిద్దినముఖమేమో అన్న అనుమానం అతనికి గతంలో చాలాసార్లు కలిగింది. ఇప్పుడు ఆముఖంలో అమ్మముఖం ప్రస్ఫుటంగా తీరిచి దిద్దినట్టు కనపడింది అతడికళ్లకి.

వెనక్కి తిరగబోతున్న శ్రీరంగశయనం వెర్రిగా చూశాడు కొడుకుమొహంలోకి.

ఆ యువకుడి అభిప్రాయం ఆ పెద్దమనిషికి అర్థం కాకపోవడంలో ఆశ్చర్యం లేదు.

(ఈమాట.కాంలో ప్రచురితం. ఏప్రిల్ 19, 2010)

## 17. ఆ ఒక్క మాటా!

"నిన్ను చూసి ఆరేళ్ళయింది. నాకయితే ఏళ్ళూ పూళ్లూ అయినట్టుంది. బొత్తిగా రాడం మానేశావు? ఈ ఏడయినా ఒకసారి రాకూడదుటే?"

అలనాటి చెలి కామేశ్వరి రాసిన ఉత్తరం చేత పుచ్చుకుని దిగంతాల్లోకి చూస్తూ కూర్చుంది శాంత, గతించిన రోజులు తలబోసుకుంటూ. మనసు మొద్దు బారిపోయింది. మనిషిలో చలనం లేదు. కళ్ళలో శూన్యం. ఆరోజు ఆరేళ్ళకిందట బొంబాయిలో సీతమ్మత్త మాట నిన్నో మొన్నో విన్నట్టు మెదులుతోంది మనసులో. కామేశ్వరితో పదిరోజులు గడిపి, శలవు తీసుకుని రైలెక్కింది. "బొంబాయిలో దిగి, అమ్మని ఓ సారి చూడు. మనవాళ్ళకోసం పరితపించి పోతోంది" అన్నాడు నిరంజనం.

శాంతకి ఇష్టంలేదు కానీ నిరంజనంమాట కాదనలేక సరేనంది.

000

శాంత అమెరికా వచ్చి పాతికేళ్ళకి పైనే అయింది. మొదట తొమ్మిదేళ్ళు అసలు ఇండియా వెళ్ళడమే పళ్ళేదు. తీరా వెళ్ళగలిగే సమయం వచ్చేసరికి అమ్మా, నాన్నా పోయేరు. ఇద్దరక్కయ్యలూ, ముగ్గురు తమ్ముళ్ళూ ఉన్నారు కానీ అందరికీ ఊపిరి తిరగని పనులే. రమ్మంటారు కానీ తీరా వెళ్తే పట్టుమని ఓ గంట కూచుని మాటాడే తీరిక లేదెవరికీ.

మూడోసారి కామేశ్వరిఇంట్లోనే దిగింది. నాలుగు రోజులు అక్కడుండి, ఆ తరవాత ఇద్దరూ దేశాలు తిరిగేరు. ఇద్దరికీ ఇష్టమయిన స్థలాలు చూశారు. ఇష్టమయిన స్నేహితులతో కలిసి గతం ఆటలూ, పాటలూ కలబోసుకు తలబోసుకుంటూ ఆనందించేరు.

ఆ ప్రయాణం శాంతకి ఎంతో ఆహ్లాదకరంగా అనిపించింది. గొప్ప సంతృప్తినిచ్చింది.

"అబ్బ, ఎంత బాగుందే నీతో ఇలా తిరుగుతుంటే! నాలో చచ్చిన సరదాలనీ మళ్ళీ ప్రాణం పోసుకున్నాయి. ఇకమీదట నువ్వెప్పుడు ఇండియా వచ్చినా, నాదగ్గరకే రావాలి. నాతోనే ఉండాలి," అంది కామేశ్వరి ఆప్యాయంగా శాంత భుజాలచుట్టూ చెయ్యేసి, ఆ భుజంమీద తల వాల్చి. ఒకసారి కాదు పది సార్లు అంది ఆమాట. అలా చెయ్యకపోతే "నామీద ఒట్టే" అంది కన్నీళ్ళతో.

"ఇంత చెప్పాలిటే. నాకు మాత్రం అంత హాయిగానూ లేకపోతే మళ్ళీ వస్తానా? అసలు నీపెళ్ళిలోనే చెప్పేను కదా" అంది శాంత.

"పెళ్ళేమిటి, బీచిలో పిచికగూళ్ళు కట్టినరోజుల్లోనే అనేదానివి కదా. నేను మీఊరొస్తే మీఇల్లే నానివాసం అని."

"హుం. ఏమిటో, ఆ స్కూలురోజులూ, పండుగలూ, పబ్బాలూ .. మీనాన్నగారికి ట్రాన్స్‌ఫర్ అయింతరవాత కూడా మనశలవులు అయితే మాయింట్లో లేపోతే మీయింట్లోనే కదా... ఇప్పుడు మళ్ళీ అలాగే ఉంది నాకు ఇంతకాలం అయింతరవాత అమెరికానుంచి ఇండియా వచ్చి నీతో గడుపుతూంటే."

శాంతకి కామేశ్వరి పెళ్ళి నిశ్చయమయినరోజు గుర్తొచ్చింది. వేలు విడిన మేనత్తకొడుకు నిరంజనంతో.

"బావుంది. ఇహ ఎలాటి అరమరికలకీ తావు లేదు. నువ్వు మావాళ్ళింటికోడలివయేవు." అంది బ్రహ్మానందపడిపోతూ.

తిరిగి బయల్దేరే రోజున మళ్ళీ ముందులాగే కామేశ్వరి శాంతచేత ప్రమాణం చేయించుకుంది త్వరలోనే వస్తాననీ, ఇద్దరం ఇలాగే కిలకిల్లాడుతూ దేశసంచారం చేద్దాం అనీ.

ఆతరవాత రెండు సార్లూ కూడా అలాగే చేసింది. ఇది కామేశ్వరింట్లో మూడోసారి.

000

నిరంజనం చెల్లెలు కరుణ స్టేషనుకొచ్చి, శాంతని ఇంటికి తీసుకెళ్ళింది.

"శాంతమ్మా, బాగున్నావా? నిన్ను చూసి ఎన్నేళ్ళయిందీ... పదేళ్ళవుతోందేమో కదూ. కిందటిసారి వచ్చినప్పుడు ఇక్కడికి రాకుండానే వెళ్ళిపోయేవు ..." సీతమ్మత్త ఏదో చెప్తోంది. ఆవిడలో పెద్దతనం బాగా కనిపిస్తోంది. ఉన్న నాలుగురు పిల్లలదగ్గరా మూడేసి నెలలుచొప్పున వంతులవారీగా ఆవిడ్ని చూసుకుంటారు.

శాంత, అవునూ, కాదూ, అయుండొచ్చూ అంటూ పొడి పొడి మాటలతో సమాధానాలు చెప్పుకొస్తోంది. తననుకున్నంత భయంకరంగా లేదు వీళ్ళింట్లో అని కూడా అనిపించింది పావుగంటయేక.

మాటలసందర్భంలో "అయితే నువ్వు ప్రతిసారీ వాడింట్లోనే దిగుతావు. మీ అక్కలూ, తమ్ముళ్లూ - నీకూ వాళ్ళకీ మాటల్లేమిటి?" అందావిడ.

శాంత ఉలిక్కిపడింది ఆమాటకి. నిజానికి ఆమాట మాటలసందర్భంలో వచ్చినట్టు లేదు. చాలాసేపు పట్టింది ఆమాట శాంతకి తలకెక్కడానికి. ఆతరవాత జవాబు తోచలేదు.

"వాళ్ళనీ చూశానే. ఏం, ఎందుకలా అడుగుతున్నావూ?" అంది నెమ్మదిగా, సాలోచనగా.

"ఇప్పుడదంతా ఎందుకమ్మా?" అంది కరుణ.

ఆమాటతో శాంతకి మరీ అయోమయం అయింది.

"ఏం, బావ ఏమైనా అన్నాడా? వాళ్ళకేమైనా అసౌఖ్యం కలిగిందేమిటి నావల్ల?" అంది కాస్త గాభరా పడుతూ.

కరుణ తేలిగ్గా తీసిపారేసింది, "అబ్బే, అదేం లేదు లెద్దూ. వాడేమీ అన్లేదు."

"మరెవరన్నారు?"

"ఎవరూ అనలేదు. అమ్మదంతా అదోరకం తెలిసీ తెలీని అడివిమేళం. ఏదో నోటికొచ్చింది అనేస్తుంది. నువ్వేం అనుకోకు," అంది కరుణ.
శాంతకి మాత్రం అంత తేలిగ్గా అనిపించలేదామాట. "ఎందుకలా అంది?" మళ్ళీ గట్టిగా అడగాలనుంది. ఏమంటుంది? "పోస్లెద్దూ. ఏదో అన్నాను. దానికంత ఆర్భాటం ఏమిటి. అసలయినా నిజంగా వాడికలా అనిపిస్తే వాడే అనును నీతో. పైగా మాకోడలికీ నీకూ ప్రాణాలిచ్చి పుచ్చుకునే స్నేయితం కదా" అనొచ్చు. అది అమాయకత్వమేనా కావచ్చు, ఎత్తిపొడుపేనా కావచ్చు.
ఆతరవాత మరి మాటలు సాగలేదు.
శాంత మనసు గిజగిజలాడుతోంది. చాలా అడగాలనుంది. ఏదో ఒకటి స్పష్టంగా తెలిస్తే బాగుండు.
"మీవదిన ఏమైనా అందా?" అని కరుణని అడిగితే? కామేశ్వరి అలా అనగలదని తను కలలో కూడా అనుకోలేదు. అలా అనుకోడం తనకి సాధ్యం కాదు. అయినా అసలు సంగతి తెలుసుకోవాలని కూడా అంత పట్టుదలగానూ ఉంది.
"ఆమధ్య అన్నయ్య ఆఫీసు డౌన్‌సైజ్ చేస్తూ, కింది స్థాయికి దించేశారు కదా. ఆర్థికంగా వాళ్ళపరిస్థితులు బావులేవు. అదీ అమ్మ బాధ. ఎవర్నో ఒకర్ని అనాలి, నువ్వు దొరికేవు," అనొచ్చు.
శాంత నిట్టూర్చింది. జవాబు ఏదయినా ఒకటే. తనకి నిజంగా the truth, the whole truth, nothing but truth తెలుస్తుందన్న ఆశ లేదు.
పోనీ బావనే అడిగితే?
"ఛ, ఛ. నేనలా అంటానా? అసలు నీకెందుకొచ్చిందీ ఆ సందేహం? నాకు తెలీదేమిటి మీ ఇద్దరి స్నేహం" అంటాడేమో?
"ఛ, ఛ. నేనలా అనలేదు. ఎవరన్నది ఆమాట నీతో, అమ్మేనా? అవిడదో తిక్కమాలోకం. ఏమాటా తిన్నగా అర్థం చేసుకు చావదు" అంటాడేమో.
"ఆమధ్యనెప్పుడో చెల్లికి డబ్బు సర్దమని అడిగితే, శాంత వచ్చినప్పుడు కాస్త ఖర్చులు అయేయి. ఇప్పుడు సర్దలేనన్నాను ఏదో మాటల్లో. దానికి ఆవిడ ఇన్ని పెడర్థాలు తీసినట్టుంది. అది నీగురించి కాదులే." అంటూ సాకులు చెప్పొచ్చు.
తన సందేహానికి ఎన్నిరకాల జవాబులు ఉండొచ్చో అన్నీ ఊహించుకుంది. అంతే. వాటిల్లో ఏఒక్కటయినా … కాదా, మరో సమాధానం అయినా సరే … ఏ పరిస్థితుల్లోనూ అసలు నిజం తెలుస్తుందన్న ఆశ మాత్రం లేదు.
పోనీ కామేశ్వరినే అడిగితే -

"ఎంతమాటన్నావే! చూస్చూసి నన్నిలా అడగడానికి అసలు నీకు నోరెలా వచ్చిందే? నీకూ నాకూ మాటలొచ్చిందగ్గర్నుంచీ మనసు విప్పి మాట్లాడుకోడమే కానీ గుట్లెరుగుదుమా? నాకు నొప్పయితే నీకు చెప్పనా? నువ్విలా అడిగినందుకే నాకు ప్రాణం గిలగిల కొట్టుకుపోతోంది."

శాంత కళ్ళు చెమ్మగిల్లేయి. నిజమే. కామేశ్వరికి అలాటి బాధ ఏమయినా ఉంటే తనతో తప్పకుండా మాట మాత్రం అని ఉండేదే. ఒక్కటి మాత్రం నిజం. సీతమ్మత్తమాటలో నిజం ఉందో లేదో, ఉంటే ఎన్నిపాళ్ళుంటుందో తనకి ఏనాటికీ తెలీదు. కానీ ఆమాట మాత్రం తనమనసులోంచి ఏనాటికీ చెరగదు.

మాటకున్న కున్న తెగులే అది. చివ్వున విసిరిన బాకులో నాటుకుపోడం దాని లక్షణం palimsest లాగ - తోలుపత్రాలమీద రాసిన రాతలు చెరిపి కొత్తవి రాసినప్పుడు పాతరాతలు అడుగుపొరల్లో పూర్తిగా చెరక్కుండా ఛాయామాత్రంగా ఉంటాయిట. మనసులో నాటుకున్న మాటా అంతే. ఎన్ని విధాల తిరగా బోర్లా వేసి వివరణలిచ్చుకున్నా ఆ పదాలతాలూకు ఛాయలు అంతరాంతరాల కెలుకుతూనే ఉంటాయి.

నిజానికి తను ఇండియాకి వచ్చిన ప్రతిసారీ కొంత సొమ్ము కామేశ్వరిచేతిలో పెట్టి,

"ఉంచవే ఖర్చులకి" అంటూ వచ్చింది. కామేశ్వరి మొదట తీసుకోడానికి ఒప్పుకోలేదు.

శాంత నెమ్మదిగానే అయినా గట్టిగానే చెప్పింది. "చూడు, కామూ, అక్కడ నా మంచీ చెడ్డా నేనే చూసుకోవాలి. గుక్కెడు మంచినీళ్ళు కావాలన్నా నేను లేచి తెచ్చుకుంటే ఉంది లేపోతే లేదు. ఇక్కడ నీయింట్లో కనీసం పది రోజులపాటు ఏ చీకూ చింతా లేకుండా తిరగాలని నా ఆశ. బజారులో ఓ పువ్వు కొన్నా, ఓ సినిమాకెళ్ళినా ఎంతివ్వాలో, చిల్లరెంతో నేను లెక్కలు చూసుకోనక్కర్లేదు అనుకుంటే నామనసెంత తేలిగ్గా ఉంటుందో తెలుసా. నాకదే మహరాజభోగం. అంచేత కాదనకు. ఉండనీ" అని.

"ఏమిటో నీది మరీ చాదస్తం. ఇది ఇద్దరికీ సరిపోతుంది," అంది కామేశ్వరి.

"ఏమోలెద్దూ. ఉండనీ. తరవాత చూసుకుందాం," అంది శాంత.

ఎవరి ఆర్థిక స్తోమతు ఏమిటి అంటూ చర్చలకి దిగకుండా ఇద్దరూ ఎవరి పరువు వారు నిలుపుకున్నారు. ఒకరి పరువు రెండోవారు నిలబెట్టేరు.

ఇప్పుడు సీతమ్మత్త ఆడిన ఆ ఒఖ్ఖమాటతో మొత్తం వాతావరణం మారిపోయింది.

కుండెడు పాలలో ఒక్క విషపుచుక్క!

ఆరేళ్ళయింది. కామేశ్వరి అన్నట్టు ఏళ్ళూ పూళ్ళూ అయినట్టే ఉంది తనక్కూడా. దాన్ని మరొక్కమారు చూస్తే బాగుండు. వయసు మీద పడుతున్న కొద్దీ ఆ యావ మరింత బలంగా పట్టి కుదుపుతోంది ... కామేశ్వరి రమ్మంటోంది. అది ఆ మాట మనస్ఫూర్తిగానే అంటోందని తనకి తెలుసు కూడా.

అయినా ... మనసులో మరో ముల్లు ... ఉలిములికిలా కెలుకుతోంది. వెర్రాం అనుకున్నప్పుడల్లా అనుమానం ... మాటలతో వచ్చిన చిక్కే ఇది. ఒక మాట అనేసింతరవాత "నేనలా అన్లేదూ," "నేనన్నది అది కాదూ"

అంటూ ఎన్ని రకాలుగా దిద్దుకోబోయినా ఆ మొదట పడిన ముద్ర చెరపలేం. … palimpsest లాగే మరి … తోలుపత్రాలమీద చెరిపి, చెరిపి మళ్ళీ మళ్లీ రాసుకోవచ్చు కానీ ముందు రాసిన రాతల తాలూకు ఛాయలు పూర్తిగా తుడపలేం.

తను వాళ్ళింట్లో నాలుగు రోజులు గడిపినందున ఆ దంపతులకి ఖర్చులు పెరిగేయో లేదో తనకి తెలుసు. కామేశ్వరికి తెలుసు. నిరంజనానికి తెలుసో తెలీదో తనకి తెలీదు. వాళ్ళమ్మకి తెలుసో తెలీదో తనకి తెలీదు. తెలీదనే అనుకోవాలి. అందుకే అవిడ అలా అనగలిగింది. మళ్ళీ అంత తేలిగ్గానూ "పోన్లెద్దూ. ఏదో తోచింది, అన్నాను. నువ్వేం పట్టించుకోకు" అని అనగలిగింది.

ఆశ్చర్యం. ఆ మాటలకున్న బలం ఆవిడకి నిజంగా తెలీదా? అమాకత్వమా? లౌక్యమా? అనదలుచుకున్న మాట అనేసి, "పోనిద్దూ, నువ్వు పట్టించుకోకు" అంటే ఏమీ జరగనట్టు ఊరుకోడం సాధ్యమేనా? అందుకే అంటారు కఠోరాణి వజ్రాదపి, మృదూని కుసుమాదపి అని. పువ్వుల్లా మృదువుగా ఉన్న మాటలు కూడా వజ్రాల్లా గుండెల్లో గునపాలయి గుచ్చుకోగలవు. పైగా అవి చేసే గాయాలు కంటికి ఆనవు కనక ఆ హింస ఋజువు చెయ్యలేం. ఎంతలేసి మాటలూ అనేసి "పోనిద్దూ, ఏదో మాట అలా వచ్చేసింది, ఏమనుకోకు" అనడం ఎంత తేలిక! అది మనవాళ్ళకే చెల్లిందేమో. బహుశా చాలామందికి "పోతుందేమో కూడా" .. తనకి అంత తేలిగ్గా "పోదు." అది తన లక్షణమేమో మరి. ఆమాట వేసిన ముద్ర ఆటోతుమీద అచ్చేసినట్టే. మరింక చెరగదు. మరోసారి కామేశ్వరింట్లో దిగితే … పూర్వంలాగా తనకి మనసులో అంత హాయిగానూ అంత స్వేచ్ఛగానూ ఉండకపోచ్చు. ఉండదనే అనిపిస్తోంది …

శాంత కలం తీసుకుంది తాను ఇండియా రాలేకపోడానికి కారణం ఎంతో వివరంగా రాసింది మూడున్నర పేజీలు. రాలేకపోతున్నందుకు ఎంత బాధగా ఉందో వివరించింది. బతికి బాగుంటే ఎప్పుడో వస్తానేమో అన్న ఆశ వెలిబుచ్చుతూ ముగించింది.

ఆ ఉత్తరంలో డబ్బు ప్రసక్తి లేదు. ఎందుకు దాన్ని కూడా హింస పెట్టడం? అనుకుంది శాంత నిట్టూరుస్తూ. ఇన్నేళ్ళతరవాత పల్చని తెర దిగింది వారిద్దరిమధ్యా!

(జనవరి 3, 2011)

# 18. వైద్య సిస్టావధానం

ఆస్తి పోతే పోయింది కోర్టుపద్ధతులు తెలిసేయి అన్నాట్ట ఓ పెద్దమనిషి వెనకటికి.

చెయ్యి విరిగితే విరిగింది కానీ అమెరికాలో వైద్య విధివిధానం విశదమయింది నాకు, ఏకాలేజీల్లోనూ ఏ బోధనాపద్ధతులూ తెలియజేయలేనంత తేటతెల్లముగా.

ఆస్పత్రి లౌంజిలో నిస్సహాయంగా కూర్చుని ఉన్నవాళ్ళందర్నీ చూసీ చూడనట్టు కొనకళ్ల పరిశీలిస్తున్నాను మాటలు వినిపించని టీవీకి కళ్ళప్పగించి.

నర్సెస్ ఎయిడ్ కాబోలు రమ్మంటే, లేచి ఆమెని అనుసరిస్తుంటే, నాకంటే ముందొచ్చి అక్కడ కూర్చున్నవాళ్ళవంక గర్వంగా చూస్తూ నడిచేను నాకేదో విశిష్టగౌరవం లభించినట్టు.

తిన్నగా రెస్ట్ రూంలోకి తీసుకెళ్ళి, “కూర్చో,” అంది కుర్చీ చూపిస్తూ.

“ఇక్కడా?”

అవునన్నట్టు తలూపింది. మాటాడితే నోట్లో ముత్యాలు రాలిపోతాయి కాబోలు.

అక్కడ్నుంచి మొదలయింది క్రతువు –

ఆవిడచేతిలో కాయితంలో రాసిఉన్న విషయాలే మళ్ళీ చెప్పుకోవాలి “అహం భో” అంటూ పేరూ, వయసూ, ఒడ్డూ, పొడుగూ… నిజానికి వాళ్ళే కొలుచుకునేవాళ్లు ఇదివరకు. ఇప్పుడు వాళ్ళకంత తీరిక లేదు. ఆ తరవాత వరసక్రమంలో ప్రశ్నావళి … “నీకు డయాబెటిస్ ఉందా?, బీపీ ఉందా? …” ఇలా ఓ పాతిక. …

“లేదు“,“లేదు” ..అంటూ చెప్పుకుంటూ పోతుంటే నాకే అనుమానం వేసింది అబద్ధాలు చెప్తున్నానుకుంటారేమోనని. నాబాధలు నాకున్నాయి కానీ అవి వాళ్ళ జాబితాలో లేవు మరి. వాళ్ళజాబితాలో ఉన్న భౌతిక బాధలు నాకు లేవు.

“నువ్వు ఎమేజింగ్,” అంది తలొంచుకుని నా“లేదు”లన్నీ రాసుకుంటూ.

నాకే సిగ్గేసింది అన్ని “లేదు”లు చెప్పినందుకు. “అయ్యో, మరీ అంత పర్ఫెక్టు కాదు నేను. రాసుకోండి, నాకు ఎడమచెవి 60 శాతం వినిపించదు.”

“ఇంతకుపూర్వం ఏమైనా సర్జరీలయేయా?”

“లేదు.” నిజం కాదు కానీ నిజం చెప్తే వివరాలు అడుగుతారు. నాకు అసలు ఎప్పుడు జరిగిందో కూడా సరిగ్గా గుర్తు లేదు, వివరాలమాట సరే సరి. ఎందుకొచ్చిన గొడవ, లేదనేస్తే పోతుంది.

ఆ తరవాత మళ్ళీ మొదలు అదే జాబితా .. “మీకుటుంబంలో ఎవరికైనా డయాబెటిస్ ఉందా?” “బీపీ ఉందా?” … ఏం చెప్పను? ఆరోజుల్లో మాయింట్లో అంత పకడ్బందీగా చీటికి మాటికి ఆస్పత్రికెళ్ళి నాకిదుందా అదుందా

అంటూ పరీక్షలు చేసుకోలేదు. ఇంట్లో ఏం జరుగుతోందన్న యావ నాకసలే లేదు. అంచేత మళ్ళీ అన్నిటికీ "లేదు," "లేదు," … ఇది కూడా నిజం కాకపోయినా. అంటే నిజమవునో కాదో నాకు తెలీకపోయినా.

… ఈ తతంగం ముగిసేక, ఆవిడిచ్చిన ఆస్పత్రి గౌనులోకి మారి బయటికి వచ్చి, నాకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన మంచం ఎక్కేను.

ఇద్దరు అమ్మాయిలు చేతుల్లో ఏవో సూదులూ, ట్యూబులూ, తువాళ్ళూ పుచ్చుకుని తయారు. "ఎలా ఉన్నావు?" అంటూ కుశలప్రశ్నలు. హుమ్. నేను కుశలంగా ఉంటే ఇక్కడికెందుకు తగలడతానూ… రబ్బరుబొమ్మకి అలంకారాలు చేస్తున్నట్టు నా టెంపరేచరూ, బ్లడ్ ప్రెషరూ కొలిచి రాసుకుంటోంది ఒకతె నిరామయంగా. నన్నడిగితే చెప్పి ఉండేదాన్ని నా టెంపరేచరు మానసికంగా నూటయాభైకి ఎగసిపోతోందని. రెండో అమ్మాయి రెండో చెయ్యి పుచ్చుకుని సబ్బుతో శుభ్రంగా తోముతోంది.

"మీరిద్దరూ నర్సులేనా?"

అవున్ట. ఇద్దరూ ఎంతో ఉత్సాహంగా జవాబిచ్చేరు. ఆహా, జన్మకో శివరాత్రి, ఇద్దరు ఇంతుల సేవలు! వాళ్ళశ్రద్ధ చూస్తే ముచ్చటేస్తోంది కానీ ఈమాత్రం దానికి  ఇద్దరెందుకూ?  నిజానికి ముగ్గురు, మొదట్లో నన్ను బాత్రూంలోకి నడిపించిన పిల్లని కూడా లెక్కేస్తే. అరక్షణంలో జరిగిపోయిన ఒక్క ప్రమాదం ఇంతమందికి పని కల్పిస్తోంది. మ్ … మ్ …  ఏమిటో ఈ సంస్కృతి నాకు అయోమయం. ఓపక్క మల్టీ టాస్కింగంటూ ఒకొకరు నాలుగు పనులు … మరోపక్క ఒక్క పనికి నలుగురూ. …

"నాపేరు చో. నేను సర్జరీ నర్సుని," మరో పూబంతి ప్రవేశం. మళ్లీ మొదలు – "బీపీ ఉందా?" "డయబెటిస్ ఉందా?" "ఎలర్జీలు - పెన్సిలిన్"? "లేటెక్స్?" …

"లేదు," "లేదు," "లేదు" మహాప్రభో.. "ఇందాకా ఇద్దరు నర్సులూ, ఇంకా అంతకుముున్ను మరో సెక్రటరీవో ఎవరో రాసుకున్నారు ఇదందా. ఇవన్నీ మీ సిస్టములో ఉన్నాయి."

"కావచ్చు. నేను సర్జరీసమయంలో ఉంటాను నీ పక్కన. నాకు తెలియాలి."

సరి, ఆమెతో నలుగురు …

మరో వైద్యశిఖామణి, "ఎనస్తీషియాలజిస్టుని."

అదేమిటి, మరి రెండు సూదులెందుకూ? ఎడమచెయ్యికి సర్జరీ చేస్తే కుడిచెయ్యి పుచ్చుకుంటావేమిటి?

"నిన్ను సర్జరీసమయంలో నిద్రపుచ్చడానికి."

"నిద్రా? కుక్కల్నీ గుర్రాల్నీ నిద్రపుచ్చినట్టా? హీహీ."

"ఇది ఎనస్తీషియా కాదు. రిలాక్సవుతావంతే."

నాకు నీరసం వస్తోంది.

"ఈ సూది ఇన్సులిన్, నీరసం రాకుండా ఉండడానికి."

నాకు నీరసం వస్తోంది మానసికంగా.

"ఆ సూది ఎనాస్తీషియాకి. ఈ రబ్బరుగొట్టం రక్తప్రసారం ఆపడానికి." … …

000

మళ్ళీ మరో నర్సు. "ఎలా ఉన్నావు?"

ఎలా ఉన్నానో తెలుసుకోలేకుండా ఉన్నాను. "ఎక్కడున్నాను?"

"అంతా అయిపోయింది. నువ్వు ఇంటికెళ్ళిపోవచ్చు. మరోఅమ్మాయి వచ్చి బట్టలు మార్చుకోడానికి సాయం చేస్తుంది."

"డాక్టరు గారు రారా సర్జరీ ఎలా అయిందో చెప్పడానికి."

"రారు. కావలిస్తే పిలు."

మరి నువ్వేం చేస్తావు?

"ఈ ఫారం పూర్తి చేసి నిన్ను ఇంటికి పంపడానికి సిద్ధం చేస్తాను. నొప్పిగా ఉందా? పెయిన్ కిల్లర్ ఇవ్వనా?"

"లేదు. వద్దు."

ఆ సూదులు గుచ్చినఅమ్మాయి కూడా అడిగింది. "నొప్పిగా ఉందా. ఫరవాలేదు. నెమ్మదిగా ఇస్తాను."

ఎందుకొచ్చిన హామీలు. అసలిలాటి చోటికి రాకుండానే ఉండాలి గానీ వచ్చింతరవాత రోట్లో తల పెట్టినట్టే. ఇంతమందికి నొప్పి లేదని చెప్పింతరవాత నాకే నమ్మకం లేకుండా పోతోంది. నాకెందుకు నొప్పి లేదూ? నేనేం మనిషిని కానా? ఉంది కానీ నాకు తెలీడం లేదేమో. ఎందుకు  తెలీడం లేదూ? అసలయినా ఈ అమెరికనులు చీమంత ఉంటే కొండంత చేస్తారు. ఇంత పిసరు నొప్పికి కూడా ప్రాణం పోతున్నట్టు శివతాండవం! నేను నొప్పి లేదని చెప్పడం అలాటివారికి ప్రతిగానేమో. Rebel without cause! లేక ఇదో రకం డిసార్డరేమో. అలా అని చెప్తే, మరో డాక్టరుదగ్గరికి తోలుతారు కాబోలు ఈ "సిస్ట" జనులు. నావల్ల కాదు ఈ వైద్యరాజపోషణ. ఇప్పటికే ముగ్గురయేరు ఎమర్జన్సీ డాక్టరుతో కలిపి. అది కాక మధ్యలో ఎపాయింటుమెంటిచ్చి కాన్సిలు చేసిన వైద్యబ్రహ్మతో నలుగురు. ఆయన మోచేతి కిందిభాగం మాత్రమే చూస్తాట్ట. పైభాగం చూసే డాక్టరు మరొకరు, మణికట్టుకి మరో డాక్టరు. ప్రస్తుతం మణికట్టుడాక్టరుతో కుస్తీ సాగుతోంది.

అవునింతకీ నాకు నొప్పి తెలీడం లేదేం? ఎనాస్తీషియా మహత్యమా? మరి అది ఇవ్వకముందు ఆ నర్సమ్మతల్లి సూదులు గుచ్చినప్పుడు కూడా తెలీలేదు కదా. ఈ "నేను" నిజంగా నేను కానేమో.. నొప్పి తెలిసిన "నేను" వేరూ, అల్లంత దూరంలో నిలబడి అదేదో నాటకమయినట్టు జరుగుతున్నదంతా వీక్షిస్తున్న "నేను" వేరేమో. అందుకేనేమో ఈ చెయ్యి నాచెయ్యిలా అనిపించడంలేదు ఏ ఏనుగుతొండమో, గుర్రంతోకో భుజానికి తగిలించినట్టుందే కానీ.

000

“నొప్పిగా ఉంది. రాత్రి నిద్ర పట్టడంలేదు. ఏదైనా మందు ఇవ్వండి.”

“మొదట్లో లేదు కదా. ఇప్పుడే మొదలయిందా?”

“ఆఁ.”

“Are you feeling numbness or tingling sensation?”

ఏంటో గొడవ, నమ్నెస్, టింగ్లింగ్ … వేళ్ళ చిగుళ్ళ రాళ్ళు కట్టి లాగినట్టుంది అదేనా టింగ్లింగ్ అంటే? నేను అనుభవిస్తున్న నొప్పికీ వాళ్ళు చెప్పే నొప్పికీ తేడా ఉందని నా నమ్మకం. ఎలా చెప్పడమో తెలీడంలేదు.

“నీ ప్రైమరీ కేర్ ఫిజిషియనెవరు?”

“ఎవరూ లేరు. నేను కొత్తగా వచ్చేను ఈ ఊరు.”

“నాకు తెలిసిన వండర్ఫుల్ ఫిజిషియనులున్నారు. పేర్లు కావాలా?”

“ఈ నొప్పి మీరు చేసిన సర్జరీ వల్లే కదా వచ్చింది. మీరెందుకు రాసివ్వరూ?”

“అలా రాయడానికి వీల్లేదు. నీ కండిషను పూర్తిగా తెలిసినవారే చెయ్యాలి ఆపని.”

అబ్బ ఎంతమంది వైద్య నిపుణులు! మోచేతికింద చూడ్డానికొకరూ, మీద చూడ్డానికొకరూ, మణికట్టుకొకరూ. … ఇంకా వేలు వేలుకొకరు కూడా ఉన్నారేమో. ఇలా చెయ్యడంవల్లే అసలు నాకు రెండుసార్లు సర్జరీలయింది. ఒకే డాక్టరయితే చెయ్యంతా ఒకేసారి చూసి, ఎక్కడెక్కడ విరిగిందో అక్కడక్కడ వైద్యం చేసి ఉండేవాడు. ఈ స్పెషలిస్టులంతా నా చెయ్యి ముక్కస్య ముక్కః చేసి, ఒక్కొక్కరు ఒక్క ముక్కా పంచుకోకపోతే నేను రెండు వారాలకి ముందే తేరుకుని ఉండేదాన్ని. మనదేశంలో ఊరికో వైద్యుడు హాయిగా. కాలు నొచ్చినా కడుపు నొచ్చినా, కలరా వచ్చినా ఆయనే కదా వైద్యో నారాయణో హరిః. మంది ఎక్కువైతే మజ్జిగ పల్చబడినట్టు, ఈ ముక్కలడాక్టర్లు అధికంగా సాధించింది నాకయితే కనిపించడంలేదు బిల్లులు పెరగడం తప్ప.

అయినా ఇప్పుడు నేను మరో డాక్టరుదగ్గరికి వెళ్తే ఆయనకీ తెలీదు కదా నా సంగతి. మళ్ళీ నాకు ఏ జబ్బులు లేవో నిర్ణయించడానికి పరీక్షలూ … దాంతో మరో మూడు వారాలు … ఇప్పటికి తెలుస్తోంది వీళ్ళ వరస … మొదటి ఎపాయింట్మెంటు త్వరగానే ఇచ్చేస్తారు కానీ ఆ తరవాత మాత్రం జీడిబంకలా సాగతీస్తారు మరి మన వల్లోకి వచ్చేసింది కదా అని కాబోలు. … వాళ్ళ పరీక్షలన్నీ అయేవేళకి నాకు నొప్పి లేకుండా పోతే? లేదా, ఈ నొప్పికి నేను అలవాటు పడిపోయి, మందులఅవసరం లేకుండా పోతే? అదీ కాకపోతే – నాకు ఆ నొప్పి మందులు అలవాటయిపోయి వాటికి దాసోహం అయిపోతే? కొండనాలుక్కి మందు వేస్తే ఉన్ననాలుక ఊడిపోయిందనీ … ఇంతవరకూ నేను వెచ్చించిన టైమంతా వృథాయే కదా. అదీ ఇదీ కాకపోతే నాచెయ్యి నొప్పి ఇలా కలకాలం కొనసాగుతూ ఉండొచ్చు కూడా.

ఒకాయన జ్యోతిష్కుడిదగ్గరికి వెళ్ళేడుట. జ్యోతిష్కుడు ఆయనచెయ్యి క్షుణ్ణంగా పరిశీలించి, “నాయనా, నీకు నలభై ఏళ్ళవరకూ కష్టాలు,” అన్నాట్ట. “అయితే నలభై తరవాత సుఖపడతానా?”

"లేదు నాయనా. అప్పటికి వాటికి అలవాటు పడిపోతావు."
అంతే. నేను కూడా నా నొప్పికి అలవాటు పడిపోతాను. ఈ వైద్య systemల పద్మవ్యూహంలోంచి బయట పడి, నాచెయ్యి నాది కాదనుకుని, ఆ చెయ్యిగల "నేను" వేరు, ఈ "నేను" వేరు అనుకుని ఏకచేత్తో చేయగల పనులు చేసుకుంటూ పోతేనే నయం.

(అక్టోబరు 15, 2011)

# 19. ఇష్టసఖి

"ఒకరికి అసలు ఎవరికైనా మరొకరంటే ఎలా ఇష్టం కలుగుతుంది?"

ట్రినిటీనదిపాయలో చిరుతరగలు గాలి వీచిన దిక్కుగా కదులుతున్నాయి. గట్టున వీపింగ్ విల్లోలు ఊయలలూగుతూ గాలివేగం సూచిస్తున్నాయి. వాహిని వాహిక అయి గడ్డిపరకల్నీ, ఫోం కప్పుల్నీ మోసుకుపోతోంది దూరతీరాలకి నిరామయంగా. తెల్లముక్కులు కడిగిన పింగాణీముక్కల్లా మెరుస్తూ నల్లబాతులు చిరుతరగలమీద ఓలలాడుతున్నాయి జల్సాగా. ఓ బద్ధకిష్టి బాతుపిల్ల బెత్తెడు ఎత్తు లేచి నీటిపొరలు పైపైన తన్నుకుంటూ నాలుగు గజాలు ఎగిరి మళ్ళీ నీటిమీద వాలింది. ఆ సుందరదర్శనం కెమేరాలో పట్టడానికి ఎంతసేపు చూసినా మళ్లీ దొరకలేదు. మ్. జీవితంలో ఇలాటి సందర్భాలెన్నో! అసలు ఎవరికైనా మరొకరంటే ఎలా ఇష్టం కలుగుతుంది? – అవును, ఎవరేనా ఎవరితోనేనా ఎందుకు స్నేహం చేస్తారు? "అది మనిషి తత్వం" – సుళువుగా దొరికే జవాబు. కానీ నిజంగా జవాబుందా ఆ ప్రశ్నకి?

***

"అసలు ఎవరికైనా మరొకరంటే ఎందుకు ఎలా ఇష్టం కలుగుతుంది?"

అహ. భేతాళుడిప్రశ్నలా అడిగేనంటావు. తెలిసి చెప్పకపోతే నాతల వెయ్యి చెక్కలవుతుందని కూడా అన్లేదు కదా నేను. హాహా. ఈ సందేహం ఎందుకంటే ఏమో మరి. పిన్నీ, నాకు దిగులుగా ఉంటోంది ఈమధ్య. ఏం తోచడం లేదు. ఈదేశం వచ్చి ఆర్నెల్లయిందా, అపాయింటుమెంట్లు, ముందు పిలవడాలు ఏంలేకుండా, ఉన్నపాళాన ఆ క్షణానికి కాస్సేపు సరదాగా కబుర్లు చెప్పుకుందాం అంటే కుదర్దు కదా. నాకెలాగో నువ్వు దొరికేవు, హీహీ. నీతో మాటాడుతుంటే అమ్మతోనో పెద్దక్కయ్యతోనో మాటాడుతున్నట్టే ఉంటుంది హాయిగా. అదే చూడు మరి, పక్కఊళ్ళో మా పెద్దమామయ్య కొడుకున్నాడు. పట్టుమని గంటన్నర కూడా పట్టదు బస్సెక్కితే. చిన్నప్పట్నుంచీ ఇరుగూ పొరుగూ పెరిగేం. ఒకే స్కూలికెళ్ళేం. రాగానే పిలిచానా, ముక్తసరిగా మూడు ముక్కలు వాగేసి, పన్లో ఉన్నా తరవాత పిలుస్తానన్నాడుఏదో మునిగిపోతున్నట్టు. ఆ తరవాత అంతే సంగతులు. మళ్ళీ ఏ కబురూ లేదు. మరో ఆర్నెల్లు పోతే నీనోటా ఆ చిలకపలుకులే వస్తాయనకు. అది ఈ సంస్కృతిలో భాగం అంటే సరే కానీ నాకు మాత్రం ఆ భాష చచ్చినా రాదు బాబూ. అయినా నాకు తెలీకే అడుగుతున్నా. ఇక్కడికొచ్చేసరికి మనవాళ్ళతత్త్వాలు ఇంతగా మారిపోవాలేమిటి? మన ఆప్యాయతలూ, అభిమానాలూ మర్చిపోతారేమిటి? అవున్లే. అందరూ చెప్పే గాలి కబురే - ఇక్కడ ప్రవాహంలో చేరి ఈదుకు పోకపోతే బతకలేవు, ఇంతదూరం వచ్చిందెందుకు? ఈ సమాజంలో నీ ప్రజ్ఞ ఋజువు చేసుకోడానికే కదా!

అని. నేనలా అవుతాననుకోను. నాకు మనుషులు కావాలి. ఇక్కడేమో మనవాళ్ళు కూడా అలా అంటీ ముట్టనట్టు అడుగుదూరంలో నిలబడి మాటాడుతుంటే నాకు కంపరంగా ఉంది.
ఆర్నెల్లక్రితం ...
హలో. నేనే పిన్నీ, వీచికని. గుర్తున్నానా? పదేళ్ళయిందనుకుంటాను. నువ్వు ఇండియా వచ్చినప్పుడు మా శ్యామలక్క పెళ్ళిలో కలుసుకున్నాం. ఆఁ. అమెరికా వచ్చేను. వారం రోజులయింది వచ్చి ... నాకిక్కడేం ... బావులే ... లేదులే. ఏడవడంలేదు. గొంతు పట్టేసింది చలికి. నిన్ను చూడాలని ఉంది. శనివారమా? ... అలాగే వస్తాను. ఫ్లైట్సు ఏంవున్నాయో, టికెట్టెంతో కనుక్కుని మళ్ళీ ఫోను చేస్తాను. ... డబ్బు సంగతి ... చూస్తాలే. డబ్బొక్కటే కాదు కదా. క్లాసులు ... ఏం చదవాలో ఏమిటో ... నాకంతా అయోమయంగా ఉంది. అసలు వీళ్ళు పాఠాలు చెప్పడానికా, "నువ్వేం అనుకుంటున్నావు, నీకేం అర్థమయిందీ" అంటూ మాప్రాణాలు తియ్యడానికా ఈ ఉద్యోగాలు చేస్తున్నది - నాకయితే అర్థం కాడంలేదు.

***

ఆ ఆర్నెల్లలోనూ – ఏటిఒడ్డున నడుస్తుంటే, పలకరించిందావిడ. ఎదురు బిల్డింగులో ఉంటార్ట. వాళ్ళబ్బాయీ, కోడలూ, ఏడేళ్ళ అమ్మాయినీ చూడ్డానికి ఇండియానించి వచ్చి రెండు వారాలయిందిట. ఆ తరవాత ఇంచుమించు రోజూ ...
ఉన్నారా? ఉంటారనుకునే అనుకున్నాలెండి. అనుకుంటూనే వచ్చేను. నాకోసం ఎదురుచూస్తూంటారేమోనని. హాహా. రోజూ మిమ్మల్ని విసిగించి పోకపోతే తోచదు మరి.
అవున్లెండి మీరలాగే అంటారు. లేకపోతే రోజూ ఏవిటీ సొద అంటారేమిటి. హీహీ. ఇంతకీ ఇవాళ్టి కథ చెప్తా. ఇవాళ నాపుట్టినరోజు లెండి. మా మరదలు కొత్తచీరె కొంది. బియ్యే చదివేవు బియ్యం కడగడం రాదా అన్నట్టు, యమ్మెస్సీ చదివింది పునిస్త్రీలకి చీరె ఒక్కటే ఇవ్వకూడదని తెలీదూ చిత్రం కాకపోతే. పైగా పసుపూ, కుంకుమలతో ఓ పళ్ళెంలో పెట్టి ఇద్దరూ - అదే తమ్ముడూ మరదలూ - నాచేతిలో పెడితే వాళ్ళకీ నాకూ కూడా శుభం, శోభస్కరం కాదూ. నాలుగేళ్ళ పిల్లదానిచేత పంపించింది తను పడగ్గదిలో కూర్చుని. ఆ పిల్లొచ్చి ఇదుగో, నీకూ అంటూ నామీద పడేసిందా చీరె. మీరు చెప్పండి ఏమైనా మర్యాదగా ఉందా?
పిల్లదానికి మనమర్యాదలు నేర్పాలని అనుకుంటోందనని ఎలా అనుకోమంటారు మీరు. అలాటి ఆలోచనే ఉంటే, మనపద్ధతిలో ఇదుగో ఇలా చెయ్యాలని పిల్లదానికి చేసి చూపాలి. అదీ పిల్లలికి నేర్పడం అంటే. ఏమోలెండి, నేనెరిగినంతవరకూ, చిన్నవాళ్ళు పెద్దవాళ్ళకి చీరె, రవికలగుడ్డా, పళ్ళూ, పువ్వులూ తాంబూలం లేకపోయినా కనీసం పళ్లెంలో పెట్టి, చేతిలో పెట్టి, కాళ్ళకి మొక్కి దీవెనలందుకుంటారు. అదీ మన సాంప్రదాయం. నావల్ల కాదు లెండి అలా పిల్లదానిచేత చీరె నామీద విసిరేయించడం. మీరేమైనా అనుకోండి. నాకు మాత్రం మాచెడ్డ అవమానం అయిపోయింది. అది తీసుకెళ్ళి ఆ మరదలుపిల్లమొహంమీద

కొట్టాలన్నంత కోపం వచ్చింది, ఎందుకులే మరో నెలరోజులు కళ్ళు మూసుకుంటే ఆవిడదారి ఆవిడది, నాదారి నాదీ అను ఊరుకున్నా.

అంతే. తరవాత ఆవిడదారి ఆవిడదీ, తనదారి తనదీ అయింది. ఇప్పుడెక్కడుందో, ఏం చేస్తోందో ...

***

ఆ, ఆర్నెల్లయిపోయిందా పిన్నీ నీతో మాటాడి. తెలీసేలేదు కాలం గడిచిపోతోంది. చాలా జరిగేయిలే ఈమధ్య. అందుకే నిన్ను పిలవడం కుదర్లేదు. హా, హా నీకు నవ్వుగానే ఉంటుందిలే. ఏం చెయ్యమంటావు చెప్పు, నీకూ తెలుసు కదా ఇక్కడ చదువులు. ఈ ప్రొఫెసర్లు వాళ్ళు చెయ్యాల్సిన పనీ మేం చెయ్యాల్సిన పనీ కూడా మాచేతే చేయిస్తున్నారు. ఏంవడిగినా, నువ్వేం అనుకుంటున్నావంటూ మొదలెడతారు. నాకు తెలీకే కదా మిమ్మల్నడగడం అంటే, లైబ్రరీలోనూ, ఇంటర్నెట్టులోనూ చూడు. నాకు తెలుసు, నువ్వు కాస్త ఆలోచిస్తే కనుక్కోగలవు అంటూ కొంత మెచ్చుకోలూ, మరింత ఎత్తిపొడుపులూను. సగానికి చిక్కిపోయేను ఈ తిండీ, చదువూ పడక. ... అవున్లే, నామీదా, నాతెలివితేటలమీదా ఆయనకంత నమ్మకం మరి. సరే. ఈ చదువు ఇప్పుడప్పుడే అయేట్టు లేదు. అర్జంటుగా రాయాల్సిన పేపర్లు రెండున్నాయి. అవి ముగిసేక పిలుస్తాను నిన్ను. తప్పకుండాను. లేదు, లేదు. మరే కుంటిసాకులూ చెప్పను. తప్పకుండా పిలుస్తాను. తీరిగ్గా మాటాడుకుందాం. అయినా నువ్వు కాక ఎవరున్నారులే నాసొద వినడానికి.

ఆమధ్య కొంతకాలం నాక్లాసుమేటు ఘోష్ సినిమాకి వెళ్దాం రమ్మని పిల్చేడు. అంతకుముందు ఒకటి రెండుసార్లు లంచికెళ్ళేంలే. ... హిహీ ... ఆ‌ః డేట్‌లాగే ఉంది. ... నాలుగు రోజులయింది కదూ నీతో మాటాడి. ఏం చెయ్యను. పని. చదువు, సోషలైజింగు ... ... అదుగో, నువ్వలా నవ్వుతావనే అసలు మాటాడను. ఈ దేశంలో సంగతులు నీకు మాత్రం తెలీపేమిటి? ... ... ... ... మనకంటే చదువంటే చదువూ, పనంటే పనీ. ఇక్కడ చదువుసమయంలోనే భావి ఉద్యోగాలకీ, సంసారానికీ కూడా వెసులుబాటు చూసుకోవాలి కదా. ... ... ... .... ... .... ... ...

పిన్నీ ... హుమ్ .. మ్ ... లేదులే. నేను ఏడవడంలేదు. నాకు చాలా కోపం వస్తోంది. అదే ... ఆ ఘోష్ నన్ను గ్రో అప్ అన్నాడు. పోస్లే. వింప్. అలాటి వింప్సంటే నాకసహ్యం ... అందుకే అతన్ని డంప్డ్ హిం. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

రేపు బయల్దేరి జేమీతో ఆల్బుకిర్కీ వెళ్తున్నా. చాలా బాగుంటుందిట అమెరికన్ ఇండియన్ సంస్కృతి అవశేషాలు చాలా ఉన్నాయిట చూడ్డానికి. వాళ్లకీ మనకీ విలువల్లో చాలా సామ్యం ఉందని నాకిప్పుడిప్పుడే అర్థమవుతోంది. చూస్తుంటే రెండు తరాలవెనక వీళ్ళల్లో కూడా ఉమ్మడి కుటుంబాలవిలువలు కనిపిస్తున్నాయి మనలాగే ... హా. సరే నీమాటే మనలాగే కాదు. ప్రపంచవ్యాప్తంగా ఇలాటి విలువలు ఉండేవి అనుకుందాం. మరి అవి ఎప్పుడు ఎలా మారిపోయేయో ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

... అవును. వస్తా, వస్తానంటూ రావడంలేదు. ఈ లేబర్ డేకి మూడురోజులు శలవొస్తుంది కదా. అప్పుడొస్తాను. నీకు వీలేనా ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... లేబర్ డేకి డేనాతో మెక్సికో వెళ్ళేను. మళ్ళీ థీసిస్ రాయడం మొదలు పెట్టేక మరి తీరదు కదా. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ....
... ఆ. ... మ్. ... లేదులే, నీకు చెప్పడానికి భయం లేదు. నీకో చిన్న మాట చెప్పాలి. మేం వేరే అపార్ట్‌మెంటు చూసుకున్నాం కిందటి నెల. మాఅమ్మకి చెప్పకేం, గంగ వెర్రులెత్తి పోయి నన్ను వెంటనే వచ్చేమంటుంది. లేదా తనే బయల్దేరి వచ్చేస్తుంది. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... జేమీని నీకు పరిచయం చేద్దామని ఉంది. మీయింటికి వచ్చే వారం వస్తాం. ఏమంటావు? ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... రాలేకపోయేం. డేనాకి పరీక్షలు ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
ఏమిటీ ఆర్నెలయిపోయిందా. నువ్వు పిలిచేవరకూ చూస్తున్నానంటావా. లేదు లేదు నిజంగానే చాలా పని ఉంటోంది. రేపు తప్పకుండా పిలుస్తాను. అప్పుడు చెప్తాను కబుర్లు. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... జేమీతల్లిదండ్రుల్ని కలుసుకున్నాం క్రిస్ట్‌మస్ శలవుల్లో. అవును. నీకింకా జేమీని పరిచయం చెయ్యలేదు. ... హీ హీ ... లేదు, తప్పకుండా వస్తాం వేసవి శలవుల్లో. ... .... ... ... ... .... ... .... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
ఏడాదయిపోయినట్టుంది!!!!!!!!!!!!!! ... .... ... ... ... .... ... .... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... .... ... ... ... .... ... .... ..... .... .... .... .... .... .... ...... ..... ....... ....... ..... .... ....... ..... ........ .......... ............ .........

***

పక్కబిల్డింగులోని తెలుగువాళ్ళు, కొడుకూ, కోడలూ, మనవరాలిని చూడ్డానికొచ్చిన తల్లి, చదువుకోడానికొచ్చిన పెదతాతగారి కూతురు కూతురు, మూడు నెలలు ట్రెనింగుకొచ్చిన ఎలెక్ట్రికలింజినీరు … ఇలా వచ్చి పోయే వాళ్ళు ఎంతమందో! తన బతుకు రాదారీబంగళా?!

***

ఎందుకూ అలా విచారిస్తావు? మనుషులు వస్తూ పోతూ ఉంటారు, జనం సమకూర్చుకునేన వస్తువుల్లాగే. ఎల్లకాలం ఏదీ ఉండదు. ఏదీ శాశ్వతం కాదు. వాళ్ళ జీవితాల్లో నీ పాత్ర అది, నాలాగే. రాణికి ఇష్టసఖీ, యువరాజుకి వేడుక చెలికాడూ, పిల్లలకి అయిదోక్లాసు టీచరు – ఇలా ఏదైనా అనుకో. అయిదోక్లాసు కుర్రాడికి కొత్తగా క్లాసులో ప్రవేశించి, ఆ పంతులమ్మ చెప్పే పాఠాలు వింటుంటే, కొత్త ప్రపంచం కనిపిస్తుంది. ఆవిడ సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపంలా తోస్తుంది ఆ ఏడాదిపాటు. క్రమంగా ఒకొక క్లాసు దాటుతున్నకొద్దీ, మరిన్ని సంగతులు తెలుస్తున్నకొద్దీ అందులో మరింత నిమగ్నమయిపోతాడు. అయిదోక్లాసు పంతులమ్మ వెనకబడి పోతుంది. అది వారి మనోధర్మం. అదే ఎదుగుదల. ముందుకి లేదా పైకి పోడం. … అదుగో, అటు చూడు. ఆ పండుటాకులూ, రాలిన రెమ్మలూ ఎలా తేలిపోతున్నాయో! ఈ బాతులూ, కొంగలూ నిన్నటివే అనుకుంటున్నావేమో. అదేం కాదు సుమా. ఇవి ఇవాళ కొత్తగా వచ్చేయి. నాల్రోజులు పోతే మరో వనరు చూసుకుంటాయి. అదుగో అక్కడ గేలం విసిరి కూచున్నాడు, చూశావా? అతనికి ఇదే మొదలు. నాకు మొదటివాడు కాడులే. ఎంతమంది ఆ గట్టున కూచుని వాళ్ళ కతలు వెళ్ళబోసుకున్నారో … రేపు అతనికి ఈ స్థలం, ఈ జలం గుర్తుండకపోవచ్చు. మరో మనిషి అక్కడ కూచుని మళ్ళీ అదే వరస కానిస్తాడు. అది జీవధర్మం, లోకరీతి.

***

ఆహ్, ఎంతో ప్రశాంతంగా … అయ్యో, అదిరిపోయినట్టున్నారు మీరు, క్షమించండి. మీ ఆలోచనల్లో మీరుంటే నేను అడ్డొచ్చేను. … ఆఁ, ఫరవాలేదంటారా? మీరు కనక అలా అంటున్నారు. మీసంస్కారం అలాటిది. అదే మరొకరైతే కసురుకునేవారు నీపాట్న నువ్వు పో, నామానాన నన్ను వదిలేయమంటూ. ఆహ్, ఇదంతా నాకు అనుభవమేలెండి. ఇంతకీ, మీచేతిలో తెలుగు పుస్తకం చూసి పలకరించేను. నాకు తెలుగు పుస్తకాలంటే చాలా ఇష్టంలెండి. ఏమిటా పుస్తకం? … ఓ, ఎప్పుడూ వినలేదు పేరు, కొత్త రచయితేమో … … … హాఁ? ఏమిటీ? రెండు తరాలకి ముందు రాసినపుస్తకఁవా? అమ్మో, చూస్తుంటే మీముందు నేను అయిదోక్లాసు కుర్రాళ్ళా ఉన్నాను. సరే, చెప్పండి …

ooo

(డిసెంబరు 13, 2011.)

# 20. తోచీ తోచనమ్మ!

తోచీ తోచనమ్మ తోటికోడలి పుట్టింటికెళ్ళిందని సామెత.

వెనకటిరోజుల్లో:

"పిన్నీ, ఏం చేస్తున్నావు?"

"ఏం లేదు. ఏం తోచక అలా సీతమ్మక్కఇంటికెళ్దామా అని ఆలోచిస్తున్నా. ఇంతలో నువ్వొచ్చేవు."

"బావుంది. నేనూ తోచకే ఇలా వొచ్చేను,."

లేకపోతే,

"ఏరా, ఇలా వచ్చేవు, నేనే అనుకుంటున్నా మీయింటివేపొద్దాంవని."

"తోచక వచ్చేను. సినిమాకెళ్దాం, వస్తావేమిటి?"

"సినిమాకెందుకులెద్దూ, అలా బీచికెళ్దాం, కాస్సేపు కబుర్లు చెప్పుకోవచ్చు"

లేకపోతే,

"పద, నాకూ తోచడం లేదు. సినిమాలన్నీ చూడ్డం అయిపోయింది కదా ఇప్పటికే రెండుమార్లు, పద కామేశ్వరింటికెళ్దాం."

"ఇప్పుడక్కడికెందుకూ?"

"ఏం లేదు. వాళ్ళక్కయ్య ఖరగ్పూర్ నించి వచ్చిందిట పండక్కి. (లేకపోతే పురిటికి.). చాల్రోజులయింది చూసి."

ఇలా ఉండేవి కబుర్లూ, కాలక్షేపాలూ అప్పట్లో. ఇప్పుడసలు తోచలేదన్నమాటే వినిపించదు, ఖర్మ. ఎక్కడ చూసినా రోజుకి ముప్ఫైయారు గంటలుంటే బాగుండనేవాళ్ళే కానీ, అబ్బ ఇంత తీరక, చెయ్యడానికి పనేం లేక తోచక ఛస్తున్నా అన్నవాళ్లు కనిపించరు కదా. ఈ టీవీలూ, ఐపాడులు లేనిరోజుల్లో ఏం చేసేవారో అని అంటూ అక్కులు నొక్కుకునే వాళ్ళే ఎక్కువిప్పుడు, మ్ … ఏమో బాబూ, నామటుకు నాకు ఏ పనీ లేకపోతే, ఏదో కల్పించుకుని పొద్దు పుచ్చుకునేస్తాను. మరీ అంత 36 గంటలు అఖ్ఖర్లేదు కానీ 24 గంటలుంటే నేను సణక్కుండా గడిపీగల్ను. ఎలా అంటావూ …

ఏమో, చెప్తే నువ్వు నవ్వుతావు, లేదా విసుక్కుంటావు నామొహంలా ఉందని.... ... సరే, నువ్వు అంత మొహమాట పెడుతున్నావు కనక చెప్పక తప్పదు. నువ్వన్నట్టు నిజంగానే ఈమధ్య ... మూణ్ణాలుగు నెలలయినట్టుంది ... ... మరీ బతుకు నిస్సారం అనిపిస్తోంది. అబ్బ, పొద్దెప్పుడు పోతుంది బాబూ, ఎప్పుడు మంచంమీద వాలిపోడం అంటూ ప్రాణం గుబగుబలాడుతోంది.

వెనకటిరోజుల్లోలా గబుక్కున ఇరుగింటికో పొరిగింటికో పోయే సౌఖ్యాలు ఇప్పుడేవీ? మామూలుగా మీఅందరిలా ఏ స్నేహితుల్నో చుట్టాల్లో పక్కాల్నో ఫోనులో పిలిచి మాటాడలేను మరి. ఎందుకంటావా, ఏమో ... అసలు నాకెప్పుడూ అశ్చర్యంగానే ఉంటుంది ఏముంటాయి మాటాడ్డానికంతసేపు అనీ. అంతెందుకూ, నిన్నే పిలుద్దాం అనుకుంటాననుకో పొద్దున్నే మొదలు పెడతా అలా అనుకోడం. ఇప్పుడు కాఫీలవేళేమో, ఇప్పుడు పిల్లల్ని స్కూలికి పంపేవేళేమో, ఇప్పుడు పడుకుంటుందేమో, మళ్ళీ వంట చేసుకుంటోందేమో ... పోనీ, రాజుని పిలుద్దాం అనుకుంటే ఏదో కుర్రాడు పనిలో ఉంటాడు, లేదా తన సాటికుర్రాళ్ళతో కబుర్లు చెప్పుకుంటుంటాడు ... ఎలా ఎవర్ని పిలవాలనుకున్నా వాళ్ళపనులు వాళ్లకుంటాయి, ఎందుకు నేను వాళ్లని ఇబ్బంది పెట్టడం అనిపిస్తుంది. వాళ్ళు నన్ను పిలవరా అంటావేమో ... పిలుస్తారు, కాని వాళ్ళకి వీలయినప్పుడు పిలుస్తారు కద, నేనంటే ఏ పనీ పాటూ లేకుండా ఉన్నాను కనక నన్నెప్పుడు పిలిచినా ఫరవాలేదు ... అవున్లే నీకు నవ్వుతాలుగానే ఉంటుంది. పోనీ, మాలుకెళ్ళొచ్చు కదా అంటావు, ఏముంది మాలులో, అవే బట్టలూ, అవే జోళ్ళూ, ఆ మనుషులూ ... ఏ షాపులోనూ పట్టుమని పదిమంది కనిపించరు కొనేవాళ్ళు. మరి వాళ్ళకి ఎలా చెల్లుతాయో ఆ సరుకులు, వాళ్ళకి ఆదాయం ఎలాగో ...

ఎందుకొచ్చిన గొడవలివన్నీ, నాగూట్లోనే ఏదో పని కనిపెట్టుకు, చేసుకుంటే పోలే అనుకుని మన దేశవాళీ దుకాణానికెళ్ళి తాజా కూరలు గంపెడు కొనుక్కొచ్చేసేను పది రోజులకిందట. మరి అవన్నీ తినలేను కదా. అంచేత చక్కగా కడిగి, ఆరబెట్టి, చెక్కు తీసి, ముక్కలు కోసి ... ఇలా కాలక్షేపం చేసేను. ఆ తరవాత వాటిని ప్లాస్టిక్ సంచులలో జాగ్రత్త చేసి, ఆసంచీలోంచి చేత్తో ఒత్తుతూ గాలి బయటికి తోసేసి, జిప్పేసి, ఫ్రీజరులో పడేసేను. అదుగో, చూసేవా, ఎందుకంత శ్రమ, వాళ్ళే చక్కగా ఫ్రీజు చేసి, అమ్ముతున్నారు కదా అంటావు.

చెప్తాను ఎందుకంటే - మొన్న అదేలే నెల్రోజులయినట్టుంది గోపాలంగారొస్తున్నారని బజారుకెళ్ళి చూస్తుంటే ఆ ఫ్రోజెన్ ములక్కాడ ముక్కలు కనిపించేయి. ఆఁ, ఆఁ, తారీకులు చూసుకునే కొన్నాను. మనసరుకులకి మామూలుగా అన్ని పేకెట్లమీదా ఉండదు కానీ ఆరోజు ఆ ములక్కాడ పేకెట్టుమీద మాత్రం జనవరి 2014 లోపున వాడేసుకోమని తారీకు కూడా ఇచ్చేడు. నేనెంతో మురిసిపోతూ ఇంటికి తెచ్చుకుని, సాంబారుకి కావలసిన సంభారాలన్నీ కూర్చుకుని, ఈ ముక్కలు ఉడకబెట్టబోతే, అడక్కు, నామొహంలా, అక్షరాలా

నామొహంలాగే ఉన్నాయి. నామొహం అని ఎందుకంటున్నానా? వాటిక్కూడా నామొహానికున్న వయసే ఉన్నట్టుంది, ఫ్రీజరులోనే ఎండిపోయేయి. అక్కడికీ ఆశ చావక, వాటిని ఉడకబెట్టి, సాంబారులో పడేసి, తినడానికి కూర్చుంటే, రామ రామ, మళ్లీ నాచిన్నప్పటిరోజులే జ్ఞాపకం వచ్చేయి. ఈసారి పెరట్లో ములగచెట్టు కాదు. వేపచెట్టు. నా చిన్నప్పుడు పళ్ళు తోముకోడం జ్ఞాపకం వచ్చింది. నవ్వుతావేమిటి, నిజంగానే, నీకు తెలీదు మరి, ఆరోజుల్లో వేపపుల్లలు ఆరోగ్యం అని అప్పటికప్పుడు వేపచెట్టు కొమ్మ నమిలి, కుంచె చేసుకుని, దాంతో పళ్ళు తోముకునేవాళ్లం. అచ్చంగా అలాగే అనిపించిందనుకో ఈ ములక్కాడలు నముల్తుంటే. ఒక ముక్కయితే చేదు కూడా తగిలింది నాలుక్కి!! అంచేత, రెండిందాలా కలిసొస్తుంది, అటు పొద్దు పోతుంది, ఇటు తాజా కూరా అని నేనే వేసుకుంటున్నాను మంచు పాతర.

ఇంతకీ ఇవాళేమయిందనుకున్నావు … అసలు ఈపాతరలేసుకోడం వచ్చేక, తెల్లారి లేస్తూనే, రాత్రికి ఏం కూర చేసుకుందామా అని ఆలో చించి, నాఫ్రీజరులో ఏమున్నాయో నెమరేసుకుని, తరవాత మిగతా పనులు చేసుకోడం కూడా నారోజువారీ పనుల్లో ఒకటయిపోయింది. ఇవాళ కూడా అలాగే తిథివారనక్షత్రాలు చూసుకుని, ఈ దినము బూడిద గుమ్మడికాయముక్కలకి సుదినము అనుకుంటూ ఫ్రీజరు తెరిచేను. తీరా చూస్తే, నాలుగు సంచుల్లో ఏది బూడిదగుమ్మడో తెలీలేదు. ఇంత చాకిరీ చేసినదానివి ఆ సంచులమీద పేర్లు రాసిపెట్టుకోలేదూ అని అడక్కు. నిజానికి ఇక్కడ ప్లాస్టిక్ డబ్బాలమీద తేదీ అని ముద్రలేసేస్తారని కూడా నాకు తెలుసులే. …అవునవునవునవును. … నాక్కూడా తెలుసు ఆ సంగతి. ఏం చెయ్యను, హుమ్, నా నిర్మాణక్రియాశీలతలో లోపం అది. మరియు ఇంకో అవునవునవునవునవు… హాయిగా మంచుపాతరేసినవే కొనుక్కుంటే సరి అంటూ మళ్ళీ మొదలెట్టకు కచేరీ. బాగులేకపోతే పారేసి, మళ్ళీ కొనుక్కోవచ్చు కదా … అవునవునవునవునవును …

కాదు, కాదు, అన్నీ కాదులే. కాకరకాయ ముక్కలూ, బెండకాయముక్కలూ స్పష్టంగానే తెలుస్తాయి. కానీ బూడిదగుమ్మడికాయా, సొరకాయా, బెంగుళూరు వంకాయా, ఇవన్నీ ఒక్కలాగే ఉంటాయి కదా. ఏ కూరయితేనేమిటి, పోపేసి, ఉప్పూ, కారం చల్లేస్తే సరి అని. ఏ కూరయినా, ఏకసూత్రం అంటుంది మా అక్కయ్య కానీ నాకలా కాదు. బూడిద గుమ్మడికాయ అయితే అవియల్, బొప్పాయికాయయితే పోపేసి, నువ్వులపొడి, సొరకాయయితే ఆవ పెట్టి చెయ్యకపోతే నాకసలు అది కూరే కాదు. ఇన్ని పద్ధతులు నీకే చెల్లు అని సుందరి నన్ను హేళన చేస్తుంది. అవును మరి, ఆవిడగారికి ఆపీసులో పని, ఇంట్లో స్కూళ్ళకెళ్ళే పిల్లలు, నెలకి ఇరవై రోజులు ఊళ్ళంట తిరిగే ఇంటాయనా, వారం వారం వచ్చే పోయే చుట్టాలూ… ఆవిడకెక్కడ తీర్తుంది ఇలాటి ఎంపుళ్ళకి. ఉహుఁ. చిక్కదు. కానీ దానిక్కారణం నేను కాదు కద, నన్ననేం లాభం. కావలిస్తే

ఉద్యోగం మానేసుకోమను. ఉద్యోగం మానేయడం సులువే కానీ  పిల్లలెక్కడికి పోతారు? వాళ్ళు పుట్టకముందయితే అదో దారి. ప్చ్.

పిల్లలంటే గుర్తొస్తోంది ఈమధ్య టీవీ చూడ్డం కూడా దుర్భరంవయిపోతోంది ఈ ఎన్నికలమేళంతో. చెప్పుకోడానికి సుప్రసిద్ధ యూనివర్సిటీల్లో పెద్ద చదువులు చదువుకున్నాం అంటూ డంబాలు పోతారు. తమలాటి మేధావులు నాయకులు కాడం మనం చేసుకున్న పుణ్యం అన్నట్టు కబుర్లు, తీరా వాళ్లు వెలిబుచ్చే ఒక్కొక్క అభిప్రాయం వింటే, వీళ్ళా మనల్ని ఉద్ధరించేది అని ఏడవాలనిపిస్తోంది. చూసేవా ఈమధ్య ఆడాళ్లబతుకులమీద వీళ్లు చేసే వ్యాఖ్యానాలు. వింటుంటే కడుపులో దేవినట్టుంటోంది నాకయితే. వీళ్లు ఏ స్కూల్లో చదువుకున్నారో … ఆడమనిషిమీద అత్యాచారం చేస్తే, ఆఆడమనిషి హాయిగా వెనక్కివాలి ఆనందించొచ్చు కదా అనేవాడొకడూ, రేప్ వల్ల పిల్లలు పుట్టడం సైంటిఫిగ్గా అసంభం అనేవాడు మరొకడూ… వీళ్లమెదళ్ళలో ఓ భాగం, బాగా పెద్ద భాగమే తొర్ర అయి ఉండాలి. వీళ్ళు నాయకులైతే ఆడాళ్లబతుకులు పాతరాతియుగంలోనే మేలనిపిస్తోంది. … వీళ్ళనించి మనని బ్రోచేవారెవరురా అని పాడుకోవాలి. పాపం, అమెరికాలో ఆడాళ్ళకి ఆ పాట కూడా రాదు కనక వీళ్ళని రక్షించేవాళ్ళు లేరన్నమాటే. ఖర్మ! వాళ్ళకి మిగిలింది పాట్లే…

ఇంతకీ టీవీ చూడలేక, మరో పన్లేక, పుస్తకాలు చూస్తే ఎప్పుడో నాలుగు దశాబ్దాలకిందట మా అన్నయ్య పంపిన పతంజలి యోగసూత్రాలు కనిపించేయి. సరే, ఆయనేం అంటారో చూద్దాంవని తీసేను. అథో బ్రహ్మ జిజ్ఞాసా! హాహా. తత్వజిజ్ఞాస అని కాదు కానీ అంత చిన్న వాక్యాలు చూడగానే చదవగలిగినందుకూ, అంత చిన్నవాక్యంలో అంత అర్థం సాగదీసి ఆయనెవరో వివ రించినందుకూ. అల్పాక్షరం అనల్పార్థం అంటారు కదా. పతంజలికి ఈవిషయం చక్కగా అవగతమయినట్టుంది. చిన్న వాక్యంలో నర్మగర్భంగా మనం ఆలోచించుకోడానికి కావలసినదెంతో ఉన్నట్టుంది. యోగాసనాలమాట ఎలా ఉన్నా నిత్యజీవితంలో పనికొచ్చేవి కూడా చాలానే ఉన్నాయనిపిస్తోంది. నాకిలాటివి నచ్చుతాయి. పైగా ఇలాటి చిన్నవాక్యాలు మననం చేసుకుంటున్నందువల్ల మనసులోకి వస్తున్న దుష్ట ఆలోచనలు పక్కకి తప్పుకోడం కూడా జరుగుతుంది కదా. అదే అంటున్నా. దేవుళ్ళూ, దెయ్యాలూ నమ్మకాలున్నా, లేకున్నా, మనకి కలిగే కోపాలూ, తాపాలూ, కక్షలూ, కార్పణ్యాలూ వదిలించుకోడానికి ఇలాటివి ఉపయోగపడతాయి కద. చూడు, ప్రత్యక్షానుమానాగమః ప్రమాణాని - **సరైన అవగాహన కలగాలంటే సరైన విశ్లేషణ, సరైన ఉదాహరణలు అవశ్యం అంటారు. ఇది మరి ఎవరికైనా ఉపయోగపడేదే కదా, ఆస్తికులా నాస్తికులా అన్నమాట లేకుండా.** అనుభూతవిషయ అసంప్రమోషః స్మృతిః అంటే జ్ఞాపకం అంటే అనుభవపూర్వకమైన వస్తురూపం. వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్ - సందేహాలమూలంగా మనస్తాపం కలిగినప్పుడు, ప్రతిపక్షభావన అవసరం

అంటారు. ఇది ఎవరికైనా ఆలోచించదగ్గ భావనే కదా. ఎదటివారు ఎందుకలా ప్రవర్తించేరు అని ఆలోచిస్తే, మన మనస్తాపాలు చాలామటుకు తొలగిపోతాయి. ... అదేమిటి లేస్తున్నావు.. ఆఁ అప్పుడే మూడున్నరయిందా. ... చూసుకోనేలేదు. అవుస్లే పిల్లలు, మరిది గారు ... టిఫిన్లు, కాఫీలు ...వాళ్ళంతా వచ్చేలోపున ఇంకా ఏవో పనులు ... సరే పద, పద, మూడుగంటలసేపు ఇట్టే గడిచిపోయింది. మాటాడుకున్నట్టే లేదు. ... ...

(ఆగస్టు 23, 2012)

# 21. ఖాళీ బుర్ర

చల్లగా, నిదానంగా, విలాసంగా ఒయ్యారాలు పోతూ చిన్న చిన్న తరగలు చిరుగాలికి కదులుతుంటే తదేకంగా చూస్తున్నాను. కళ్ళకి ప్రశాంతంగా ఉందా దృశ్యం. ఓ చిన్న  చేపపిల్ల గబుక్కున మూడంగుళాలెత్తు ఎగిరి మళ్ళీ నీటి అడుగుపొరల్లోకి జారిపోయింది. అది మునిగినచోట చిన్న తరగలు గుండ్రంగా సుళ్లు తిరుగుతూ చెలరేగేయి. నేను కళ్ళప్పగించి పరీక్షగా చూస్తున్నాను - ఆ చేపపిల్ల మళ్ళీ ఎగురుతుందా? ఎంత ఎత్తుకి? ఉన్నచోటేనా? మరోచోటికి జరిగి, అక్కడ తుళ్లిపడుతుందా? నూటొక్క సందేహాలు ...

అటు పది గజాలదూరంలో పది, పన్నెండేళ్లకుర్రాడు గట్టున కూర్చుని నీటిలోకి గేలం విసిరి, ముల్లుకి తగులుకొని ఎర మింగేచేపకోసం కళ్ళు చిట్లించి దీక్షగా చూస్తూ ఉన్నాడు. రెండేసి నిముషాలకోమారు నీళ్లలోకి తొంగి చూసి, గేలం  కదిలిస్తున్నాడు ఏ చేపపిల్లకో ఆశ పెడుతున్నట్టు. ఆ వయసు కుర్రాడు అంత ఓపిగ్గా ఓ చోట కూర్చోడం ఆశ్చర్యం. ఈ చేపపిల్ల ఆ గేలానికి తగులుకుంటుందా లేదా అని చూస్తున్నాను. నేను చేపలు పట్టకపోయినా పడుతున్నట్టే అనిపిస్తోంది! నా ఆందోళన చేపపిల్లకోసమా, ఆ అబ్బాయికోసమా అన్నది తోచలేదు.

"చాల్లే. ఎంతసేపు చూస్తావు. పద," అంది నా బుర్ర.

"ఏఁవిటా తొందర? అవతల రాచకార్యాలేవో మునిగిపోతున్నట్టు," విసుక్కున్నాను.

"ఎంతసేపు చూడ్డం, నాకు విసుగేస్తోంది.  పద, పద. పద."

"గెలుపెవరిదో చూద్దాం, ఉండు. చేప తప్పించుకుంటుందో, వల్లో పడుతుందో."

"వాడికీ బుద్ధి లేదు, ఆ చేపలకీ బుద్ధి లేదు. వాడికి చేపలు కావలిస్తే హాయిగా బజారులో కొనుక్కోవచ్చు. ఆచేపకి నీటిలో పురుగులు  వడ్డించిన విస్తరిలా బోలెడుండగా ఈ గేలానికున్న పురుగుకోసం ఆరాటం ఎందుకూ. ఆరెంటినీ చూస్తూ కూచున్న నీకూ బుద్ధి లేదు."

"అవును. లోకంలోఎవరికీ బుద్ధి లేదు. నీకొక్కడికే ఉంది."

"ఇలా ఒకే చోట కూర్చోడంలో మార్పు లేదు, చేతన లేదు. అలాటి స్తబ్ధత అంటే నాకు అసహ్యం, చిరాకు. ఆ కుర్రాడు ఆ చేపపిల్లని పట్టగలడా లేడా అన్నది ఈ విశాలవిశ్వంలో చాలా చిన్న సమస్య," అంటూ నాబుర్ర కదం తొక్కడం మొదలెట్టింది.

నాకీ బుర్రంటే అందుకే చిరాకు. అస్సలు నిలకడ లేదు. దమ్మిడీ ఆదాయం ఎలాగా లేదు కనీసం క్షణం తీరిక అనుభవించొచ్చు కదా. ... కొమ్మల్లో కోతి నయం ఈ బుర్రకన్నా. ఛీ, ఛీ.

"హీహీ పోనీ, ఓ కోతిబుర్ర తెచ్చి తగిలించుకో."

"హా హా. వేరే తెచ్చుకోడం ఎందుకు, ఇప్పుడే ఉంది అంటున్నా. సరేలే. ఇంతకీ ఎక్కడికెళ్దాంవంటావు?"

"ఇంటికి పద. కనీసం టీవీ అయినా చూడొచ్చు."

"ఇప్పుడు టీవీలో ఏం లేదు."

"ఎందుకుండదూ. రెండువందల యాభై చానెళ్ళిచ్చేడు కదా ఆ ప్రవరుడు."

"ప్రవరుడు కాదు, ప్రొవైడరు. అందులో రెండువందలు పాతవే మళ్ళీ మళ్ళీ వేస్తారు, ముప్ఫై అమ్మకాలగోల. నిజానికి ఇది చాలా అన్యాయం. అసలు ప్రోగ్రాములకోసం డబ్బు కట్టేం. మళ్లీ వాళ్ళు అమ్ముకునే సరుకుకోసం మనడబ్బు పెట్టేం. అవి కొంటే మళ్ళీ మనకే ఖర్చు. ఆ వ్యాపారాలవాళ్ళు ఆ చెత్తతో నిన్ను నింపుతారు."

"చెత్తేమిటి, అది విషయసేకరణ. మనకి విషయాలు తెలియాలి."

ఈ టుర్రసమాధానాలు చూస్తే నాకు మరింత చిరాకు. ప్రతిదానికీ ఓ సమాధానం సిద్ధంగా ఉంటుంది దానిదగ్గర.

"ఒక్క నాలుగు నిముషాలు ఆగుదాం. వాడికి చేప దొరికినా దొరక్కపోయినా వెళ్ళిపోదాం."

టుర్రకి కోపం వచ్చింది. "ఇలా మొద్దు రాచ్చిప్పలా ఓ చోట కూచోడం నాచేత కాదు. నేను పోతాను."

"సరే, ఫో," అన్నాను అంతకి పదింతలు విసురుగా.

ఖర్మ అనుకుంటూ ఇంటికొచ్చి, టెన్నిస్ ఛానెల్ పెట్టేను.

"డెమొక్రటిక్ కన్వెన్షనులో ఏం జరుగుతోందో …" అంది టుర్ర సాలోచనగా.

సరే, అక్కడ ఎవరో మాటాడుతున్నారు. ప్రపంచంలోకల్లా గొప్పదేశం. ఇక్కడ ఉన్నన్ని అవకాశాలూ, స్వేచ్ఛా మరెక్కడా లేవు. మనం ప్రపంచానికి ప్రవక్తలం. …

"ఛానెల్ 9లో ఏం వుందో."

ఫ్లిప్. "

"టెన్నిస్ ఛానెల్లో స్కోరు చూడు …

"టెన్నిస్ ఛానెల్లో స్కోరు చూడు …"

ఫ్లిప్. "ఫాక్స్ చానెల్ .."

"మనం కాథలిక్ విశ్వాసాలని పరిరక్షించాలి. భ్రూణహత్య పరమ ఘోరం, నీచం. దానికి మన మతం అంగీకరించదు. ప్రస్తుతం ఈ అధ్యక్షుడికి మనవిశ్వాసాలమీద విశ్వాసం లేదు. అంచేత ఈయన్ని ఎలాగైనా తరిమేయాలి."

"స్కోరు …"

ఫ్లిప్. "6-3, 6-6, … అమ్మో. ఇద్దరూ హేమాహేమీలే. వాలిసుగ్రీవుల్లా విజృంభించేస్తున్నారు. … "

"ఈ తాడు ఇప్పుడప్పుడే తెగదు. ఆ లాటినో మేయరేం అంటున్నాడో …"

ఛప్. నాకు కోపం వచ్చింది. చాలీ ఛానెళ్ళ గెంతుళ్ళు అని విసుగ్గా పుస్తకం తీసేను. ఎంతవరకూ చదివేనో జ్ఞాపకం లేదు. సరే ఇదేమైనా నవలా? అని తెరిచినచోట చూసేను. మరో బాధ ఇంగ్లీషులో ఉంది. ముందు సంస్కృతం కూడబలుక్కుంటూ చదివి, ఇంగ్లీషు అర్థం చదివి అది తెలుగులో అర్థం చేసుకోవాలి.

प्रमाणविर्ययविकल्पनिद्रास्मृतय:

pramāṇa – correct perception; viparyaya – incorrect perception; vikalpa – imagination; nidrā – sleep; smṛtayaḥ – memory.

**They are correct perception, incorrect perception, imagination, sleep and memory.**

అంటే సరైన అవగాహన, తప్పు అవగాహన, ఊహ, నిద్ర, ధారణ - అంటే ...

ఆలోచనలు సాగడం లేదు. పోనీ, అంతర్జాలంలో చూద్దాం తెలుగులో దొరుకుతుందేమో అని చూసేను. ఆరో ఏడో కనిపించేయి కానీ అన్నీ ఇంగ్లీషులోనే. పైగా వాటిలో నాలుగు ఇంగ్లీషువారు అనువదించినవి. తెలుగువాళ్లు తెలుగులో పతంజలి యోగసూత్రాలు చదువుకోరా?

"చాల్లే ఇవాళ్టికి. ఇది చాలా బరువు. ఇంత బరువు మొయ్యలేను. మిగతాది రేపు చదువుదాం," అంటూ నస పెట్టింది నాబుర్ర.

నేను కోపం పట్టలేకపోయేను. "ఏంటీ సుకుమారాలు. ఏ పనిమీదా శ్రద్ధ లేదు. ఏకాగ్రత లేదు. చిత్తశుద్ధి ఉందో లేదో తెలీదు. నాకక్ఖర్లేదీ బుర్ర," గట్టిగా అరిచేను.

"హా, నాకూ అలాగే ఉంది. నువ్వూ నాకక్ఖర్లేదు," అనేసి, టప్పున కిందపడి దొర్లుకుంటూ పోయింది నా బుర్ర.

హమ్మయ్య, నాప్రాణం హాయిగా ఉంది.

OOO

సంపాదకుడు విలేఖరికి ఫోను చేసేడు.

వాలుకుర్చీ విలేఖరి విలాసంగా ఫోనందుకుని, "హలో సార్," అన్నాడు అరమూసిన కన్నులతో చిదానందస్వామిలా.

"ఊళ్ళో పీర్లగుట్టదగ్గర ఓ బుర్ర కనిపించిందిట. అదేమిటో కనుక్కుని ఓ రిపోర్టు పంపించు వివరంగా. వీలయితే ఫొటో కూడా తియ్యి."

"అలాగేనండీ," అని వాలుకుర్చీ విలేఖరి ఫోను పెట్టేసి, మళ్ళీ కునుకుపాట్లో పడ్డాడు. ఆ తరవాత అరగంటకి వార్త తయారయిపోయింది. ఫొటోకి కబురు పెట్టేడు. ఆ ఫొటోగ్రాఫరు తనదగ్గరున్న ఏదో ఆకాశరామన్న ఫొటో తీసి, దాన్లోంచి తల తీసి, కాస్త రంగులేసి వా.వి.కి పంపేశాడు.

ఊళ్ళో ఉన్న మూడు ప్రముఖ పత్రికలు ఆ వార్తని ప్రముఖంగా ప్రకటించేయి "అచ్చయ్యపాలెం పొలిమేరల్లో కని విని ఎరగని అద్భుతమైన వింత - కదిలే, వాగే బుర్ర ప్రదర్శన" అన్న శీర్షికతో. అదే వార్త చిన్నా పొన్నా మార్పులతో అంచెలంచెలుగా తెల్లారేసరికి ఊరి పొలిమేరలు దాటి, దేశపు ఎల్లలు దాటి, దేశాంతరాలకి చేరింది. భారతదేశంలో ఓ జీవము గల, హిందూధర్మసూక్ష్మాలు ఎరిగిన ఒక బుర్ర నవ్యనూతన దృష్టితో అవతరించిందిట. హిమాలయ సానువులలో తపస్సు చేసిన మహాజ్ఞాని అయిన ఓ సిద్ధుని బుర్ర అయి ఉండవొచ్చని అభిజ్ఞవర్గాలు అభిప్రాయపడుతున్నాయంటూ పత్రికలలో కలకలం, గలగలలు సాగేయి. ...

"బ్రిటిష్ మ్యూజియంలో ఓరియంటల్ లైబ్రరీ ప్రపంచంలోకల్లా ప్రాచీనమయింది. ఆ సజీవ బుర్ర మా మ్యూజియంలో ఉండాలి, వెంటనే తిరుగుటపాలో మాకు పంపండి," అని ఆంగ్లప్రభుత్వం ఓ తాఖీదు పంపింది భారతప్రధానికి.

"అనేక ఉత్తమ బారతీయ గ్రంథాలని అనువాదాలు చేసి, పరిష్కరించి, ప్రచురించి వెలుగులోకి తెచ్చింది మా జర్మన్ పండితులు. మా జర్మన్ పండితులు చెప్పేవరకూ మీకు అంత గొప్ప సాహిత్యం ఉందని మీకే తెలీదు. అంచేత మీ బుర్ర మాదేశంలో ఉండడమే ఉచితం," అని జర్మను ఛాన్సలరు కబురు పెట్టేరు.

"ప్రపంచంలో అగ్రరాజ్యం అమెరికా. మాలా ఖరీదు కట్టగల షరాబులు మరొకరు మీకు దొరకరు. రేపు పదిగంటలకి మా ప్రత్యేకవిమానం పంపుతున్నాను. మేం ఆ బుర్రని సగౌరవంగా, రాజలాంఛనాలతో తెప్పించుకుంటాం. ఆ బుర్రని మా ప్రతినిధికి మీరు సత్వరం ఒప్పచెప్పవలసింది," అని అమెరికాలో బహుళ కోటులు గల ఒక బకోనీరు చెప్పేడు. ఇది "అడుగుట కాదు, చెప్పుట అని గ్రహించవలసింది" అని కూడా స్పష్టం చేసేడు. ఆ సొంత జెట్టులోనే ముగ్గురు డాక్టర్ల జట్టుని కూడా పంపుతున్నాడుట ఈ బుర్ర ఏ విషక్రిములూ బట్వాడా చేయడం లేదని ఖరారు చేసుకోడానికి.

000

ఎన్నికలసంరంభం ఉధృతం అయిపోయింది. ఎవర్ని అధ్యక్షులుగా నిలబెడదాం అన్న విషయంలో ఏకాభిప్రాయం కుదరడంలేదు. నలుగురయిదుగురు నేనంటే, నేనని తగువులాడుకుంటున్నారు.

"ఎవరైతేనేమిటి, మనకి కావలసింది మనం చేసిన తీర్మానాలమీద సంతకం పెట్టడమే కదా." అన్నాడు పార్టీ నాయకుడు.

"అందుకే ఇదుగో. ఈ బుర్రని తెచ్చేను," అన్నాడు బకో.

"అదేమిటి, ఒట్టి బుర్ర!" అందరూ ఆశ్చర్యం వెలిబుచ్చేరు.

నలుగురూ నాలుగు ప్రశ్నలేశారు.

"అమెరికా ఆర్థికవిధానంమీద నీ అభిప్రాయం ఏమిటి?"

"ఇశ్రేల్ సమస్యపట్ల అమెరికా అవలంబిస్తున్న విధానంగురించి రెండుమాటలు చెప్పు."

“అమెరికా ఉద్యోగాలు మీఇండియాకి తరలించడం మేం నిరసిస్తున్నాం. ఏమంటావు?”

“అవును. నిరసించాలి.”

“మీ భారతదేశపు యోగా మేం అందరం ఆహ్వానిస్తున్నాం. అది మంచి పద్ధతేనా?”

“మంచి పద్ధతే.”

“స్త్రీల ఆరోగ్యసమస్యలవిషయంలో ప్రభుత్వం చేసిన నిర్ణయాలే తుది నిర్ణయాలని మా అభిప్రాయం. ఆడవాళ్ళు ఏ చికిత్స అయినా సరే పొందడానికి ముందు గవర్నరు అనుమతి పొందాలి. ఉద్యోగస్థులు అయితే, వాళ్ళ యజమాని అనుమతి కూడా తీసుకోవాలి. మంచి పద్ధతే అంటావా?“

“అంటాను.”

“ఆడవాళ్లకి సగం జీతం చాలు.”

“చాలు.”

నలుగురూ మొహమొహాలు చూసుకున్నారు. ఈ బుర్రలో మనం ఏది కావలిస్తే అది పెట్టగలం. ఇది మనకొచ్చే బుర్ర అని తీర్మానించేరు.

“మన తీర్మానాలమీద సంతకాలకి అది చాలు.”

“మరి చేయి లేదు కదా సంతకం ఎలా?”

“ఆః, దానికేంవుంది, చిటికెలో పని. ఇది ఇది యాంత్రికయుగం. ఇది సాంగేతికధర్మం. ఇది తెలుగు బుర్ర. ఓ ప్రోగ్రాం రాసి ఇట్టే పుట్టించీగలదు సంతకం.”

మళ్ళీ అందరూ హాహా అంటూ నాలుగ్గోడలూ, అద్దాలతలుపులూ అదిరిపోయేలా నవ్వేరు.

000

నామనసు ఏడుస్తోంది. అక్కడ నా బుర్ర ఎలా ఉందో, ఏమయిపోతోందో, పాపం. ఇప్పుడు విచారిస్తున్నాను కూడా చిన్నప్పుడే ఆ బుర్రలో ఇంత మేలు గడ్డి పెట్టి ఉంటే ఈ తిప్పలు తప్పును కదా అని.

000

(సెప్టెంబరు 7, 2012)

# 22. నిశ్శబ్దం

శిశిరం ప్రవేశించింది. ఉత్తరాదినించి తరలివచ్చిన కొంగలు తరవాత కార్యక్రమం ఏమిటా అని ఆలోచిస్తున్నాట్టుంది. కిటికీలోంచి ఆకులు రాలిపోయి బడుగుకొమ్మలు బోసిగా ప్రాణంలేని శవంలా నిస్త్రాణగా కనిపిస్తున్నాయి. వరండాలో ఉన్న మల్లెమొక్కని గదిలోకి తరలించేను చలి తట్టుకోలేదని. గదిలో పోషకపదార్థాలు చాల్లేదు కాబోలు గుడ్డిపువ్వులు పూస్తోంది. ప్చ్.



కిటికీకవతల బోడికొమ్మలమీదికి కళ్ళు మళ్ళించేను. ఒంట్లో ఓపిక హరించుకుపోగా, గొంతుకలో శబ్దాలు గొంతుకలోనే అణగారిపోతుంటే, నీళ్ళు నిండినకళ్ళతో, పుల్లల్లాటి చేతులతో ఏవో సంజ్ఞలు చేయడానికి నానా హైరానా పడుతూ ఆస్పత్రిమంచంమీద పడున్న రామాన్ని ఊహించుకోడానికి మెదడుతో కుస్తీపట్లు పడుతున్నాను.

అలనాటి ఆంజనేయుడిలా, లక్ష్మణుడిలా నాకు సకలం అమర్చిపెట్టిన రామం ఆక్షణాల్లో నేను చూడ్డానికి వెళ్ళలేదని బాధపడ్డాడా? నాకోసం పలవరించేడా? అమ్మ పలవరించిందని నాకు చాలాకాలంతరవాత తెలిసింది. నన్ను చూడకుండానే వెళ్ళిపోయింది. నాన్నగారు పోయినప్పుడూ వెళ్ళలేదు. ఎంచేత? ఏమో, ఇప్పుడు చెప్పలేను. ఆకాలంలో నేను ఇండియా వెళ్ళకపోడానికి సవాలక్ష కారణాలు. ఆతరవాత వెళ్ళకపోవడమే అలవాటయిపోయింది.

ఆఖరికి పధ్నాలుగేళ్ళతరవాత తెగించి నేను వెళ్తున్నా అని నాకు నేనే చెప్పేసుకుని, వస్తున్నానని రామానికి ఉత్తరం రాస్తే, … అప్పట్లో ఇంకా ఉత్తరాలే, ఫోనుకాలులు లేవు. టెలిగ్రాములున్నాయి కానీ నాకెందుకో ఆ ఆలోచన రాలేదు. 14 ఏళ్ళతరవాత తొలిసారి ఇండియా వెళ్ళినప్పుడు నాకో ప్రణాళిక ఉంది. గుళ్లూ గోపురాలూ చూడాలనుందని చెప్పేను. సరే, నేనిక్కడ ఏర్పాట్లు చేస్తానన్నాడు రామం. ఏ గుళ్ళు, ఏ గోపురాలు అన్న ఆలోచన నాకు లేదు. అతనే మొత్తం కార్యక్రమం ఆయత్తం చేసేడు. 14 రోజులలో 18 దేవాలయాలు … దక్షిణాదిని శ్రీరంగంలో మొదలుపెట్టి మధ్యప్రదేశ్‌లో ఏదో కొండమీద గుడి … ఇప్పుడు జ్ఞాపకం లేదు కూడాను … తిరిగేం. వెళ్ళిన చోటల్లో తన స్నేహితులఇళ్ళలోనే మకాం. ప్రతివారింట్లో

ఇంటివాడిలాగే మెలిగేడు రామం. వాళ్ళు అలాగే ఆదరించేరు, అతన్నీ, అతనితోపాటు నన్నూ.

"రావుగారు ఎంత చెప్తే అంత. మాఅమ్మాయి మేం ఎంత చెప్పినా పెళ్ళి చేసుకోను కాక చేసుకోను అని ఎంత హఠం వేసుక్కూచుంది. రావుగారు చెప్తే ఒప్పేసుకుంది. పదిహేనేళ్ళయింది. ఇప్పటికీ ఏ మాటయినా సరే ఆయన చెప్తేనే .."

"ప్రసాదుగారు విల్లు రాయకుండా పోయేరు. మీ అన్నగారే పూనుకుని ఎక్కడెక్కడ ఉన్న ఆస్తులూ తవ్వి తీసి మొత్తం స్థిరచరాస్తులన్నీ ఓ కొలిక్కి తెచ్చి పిల్లలకి పంపకాలు పెట్టేరు. రెండున్నరేళ్ళు పట్టింది. నిజంగా ఆయన ఋణం తీర్చుకోలేం."

"నన్నెవ్వరూ నమ్మనప్పుడు చిన్నాన్నగారు యాభైవేలెచ్చి, వ్యాపారం మొదలు పెట్టడానికి సర్వవిధాలా తోడ్పడ్డారు. ఆయనఋణం ఈజన్మంలో తీర్చుకోలేం."

ఇంటింటా ఇలాటి కథలే విన్నానే గానీ ఆయనవల్ల మాకీకష్టం కలిగిందని గానీ ఈ నష్టం వచ్చిందని గానీ వినలేదు. ఆతరవాత కూడా నేను ఇండియా వెళ్ళినప్పుడల్లా ఎవరో ఒకరు, రామం స్నేహితులు పరిచయమవుతూనే వచ్చేరు. ప్రతిసారీ రామం ఎంతమందికి ఎన్ని విధాల తోడ్పడ్డాడో తెలుస్తూనే ఉంది. ఇలా అభిమానాలే పోగు చేసుకున్నాడు కానీ తనకంటూ కూడబెట్టుకున్న ఆస్తులేమీ లేవు. అసలు తనఉద్యోగకాలంలో బాగానే సంపాదించేడు కాస్ట్ ఎకౌంటెంటుగా. అదంతా మరి ఇప్పుడేదీ? ... తనకంటూ ఏమీ కోరలేదు కనక వారందరూ నాకు చేసి ఋణం తీర్చుకున్నారు! నేను వసూలు చేసుకున్నాను! అంతే కానీ వాళ్లెవరూ రామానికి చేసిందీ లేదు, చేయగలిగిందీ లేదు. అలాటి నిస్సంగీ, నిష్కామయోగీ రామం. అలాటి రామాన్ని చిట్టికమల, పురందరం తమ అవసరాలు తీరగానే పొమ్మనగలిగేరు. అణాపైసల్లో లెక్కలు చూసుకుని, ఆయన మదుపుగా ఇచ్చిన యాభైవేలూ తిరిగి ఇచ్చేసేం, ఋణం తీరిపోయింది అన్నారు. అంతేగానీ రామం అణాపైసల్లో లెక్కలు చూసుకోలేదనీ, మొత్తం కుటుంబాన్ని తనకుటుంబంగా స్వీకరించి సొంతం చేసుకున్నాడనీ అర్థం చేసుకోలేదు. మాతరంలో తండ్రికీ పినతండ్రీ, తాతకీ, చినతాతకీ వ్యత్యాసం లేదు. తండ్రెంతో పినితండ్రీ అంతే. అందరూ మనవాళ్ళే కష్టానికీ సుఖాలకీ కూడా. బాగున్నప్పుడు రారమ్మనడం, ఓగున్నప్పుడు పోపొమ్మనడం వీళ్ళకే చెల్లింది.

పురందరం వ్యాపారం మూడు పువ్వులూ తొమ్మిది కాయలూగా వృద్ధి పొందేక, ఇంటికి దూరంగా మరో ఆఫీసు తీసుకుని, అక్కడే మరో వాటా తీసుకుని రామాన్ని ఉండమన్నప్పుడు కూడా అతనికి అర్థం కాలేదు అది వాళ్ల కుట్రలో భాగం అని. ఆఫీసుకి దగ్గరే కనక ఆఫీసు వ్యవహారాలు చూసేడు. కొత్తగా చేరినవాళ్ళందరికీ వాళ్ల పనులు నేర్పేడు. శనాదివారాల్లో చిట్టికమలా, పురందరం సినిమాలకీ, షికార్లకీ వెళ్తే, పిల్లల్ని చూసేడు. ఆరోజుల్లో, ఆ వాటాలో ఉన్నప్పుడే నేను వెళ్లేను. అదే ఆఖరుసారి చూడ్డం. అక్కడున్నప్పుడు మాత్రమే నాకు హాయిగా సొంతింట్లో ఉన్నట్టు అనిపించింది. వంటమనిషి పదిగంటలయింతరవాత వస్తుంది మధ్యాన్నంభోజనం

చేసి పెట్టడానికి. రామం పొద్దున్నే లేచి, కాఫీ పెట్టేవాడు. ఆ తరవాత నేనే పెట్టడం మొదలెట్టేను. కాఫీ తాగి హోటలునించి పెసరట్లూ, ఇడ్లీలూ, పూరీలు ... ఇలా అచ్చమైన తెలుగు వంటకాలు తెచ్చేవాడు. రోజూ ఎందుకులే బయటికెళ్ళడం, సీరియల్ నాకలవాటే అంటే, అక్కడున్నప్పుడు ఎలాగా అదే తింటావు కదా అంటూ బయల్దేరేవాడు. ఏం కావాలని నన్ను అడక్కుండా, ఇది కావాలని నేను చెప్పకుండా చేసుకుపోతూండేవాడు. మాయిద్దరిమధ్యా మాటలు తక్కువే ఏ సభలకో, నా పుస్తకాలు ప్రచురణకో ఎవరితోనో మాటాడాలనో, మాటాడేననో చెప్పడం తప్పిస్తే.

నాసాహిత్యం పదిముందు పెట్టడానికి రామం వెచ్చించినసమయం తలుచుకుంటే ఇప్పుడు నాకు బాధగా ఉంది. నేనేదో గొప్పకథలు రాసేననీ, అవి అందరూ గుర్తించాలనీ, పుస్తకాలు ప్రచురించాలనీ చాలా తాపత్రయపడ్డాడు. అతన్ననడం ఎందుకూ, నేనూ అలాగే అనుకున్నాను. కానీ నాకు ఇప్పటికి తెలిసింది సాహిత్యంలో నాస్థానం. అయ్యో, అతన్ని ఎంత ఇబ్బంది పెట్టేను అయాచితంగానే అయనా అని ఇప్పుడు విచారిస్తున్నాను.

"పుస్తకం కొన్నాను." "చదివేను. కొన్ని బాగున్నాయి." "కొని మాలైబ్రరీలో పెట్టుకున్నాను." హుమ్. ఈ పొడివాక్యాలు చెప్పినంతగా పెద్ద పెద్ద సమీక్షలు చెప్పవు. ఇదే నిజమైన వ్యాఖ్యానం నా సాహిత్యసేవకి. నేనేదో గొప్ప సాహిత్యం సృష్టించేసేనని భ్రమ పడి, రామాన్ని కూడా ఇబ్బంది పెట్టేను. నేను ముందులాగే నామూలన నేను పడి ఉండి, ఏదో రాసుకుంటూ పోతే, రామం మరో పదిమందికి సాయం చెయ్యడానికి వెచ్చించి ఉండేవాడు ఆ సమయం, లేదా, తను రాయాలనుకుంటున్న ఆధ్యాత్మిక చింతనలు రాసుకునేవాడేమో అని మనసు గుబగుబలాడుతోందిప్పుడు.

మాటలు తక్కువే అయినా, ఒకటి రెండుసార్లు కాబోలు తనమనసులోకి వస్తున్న ఆధ్యాత్మికచింతనలగురించి. తన పూర్వజన్మవృత్తాంతాలు కొన్ని చెప్పేడు. వాటికి ఋజువుగా మధుర వెళ్ళినప్పుడు అక్కడ ఆచార్యులు చెప్పిన సంగతులు చెప్పేడు. ఈ జన్మలో తనకి సాంసారికజీవితంమీద ఇచ్ఛ లేకపోవడానికి కారణం వెనకటిజన్మట. వెనకటిజన్మతాలూకు అనుభవాలు అప్పుడప్పుడు గుర్తొస్తున్నాయని చెప్పేడు.

అలా నిర్వికారంగా, నిరామయంగా ఎవరికేం సాయం కావలిస్తే ఆ సాయం చేయడమే పరమావధిగా రోజులు గడుపుకున్నవాడు ఆఖర్న అప్రయత్నంగా, అనాలోచితంగా, అసంబద్ధంగా అసందర్భంగా సంసారంకూపంలో చిక్కుకుపోయేడు. అవే రుగ్మతలయి ప్రాణాంతకంగా పరిణమించేయేమో.

శ్రీనివాసూ, మరదలూ, పిల్లలూ ఎంత ఆప్యాయంగా చూసుకున్నా, రామానికి మాత్రం చిట్టికమలా, పిల్లలమీద ధ్యాసంతా ఉన్నట్టుంది. బహుశా లివర్లో పుండుకంటే చిట్టెమ్మమీద తపనే ఎక్కువగా బాధించిందేమో.

నాకు చిట్టికమలమీద మాచెడ్డ కోపం ఉవ్వెత్తున ముంచుకొచ్చేసింది. దానికి అంతరాత్మ లేకుండా పోయిందేం ఆఖరిదశకొచ్చేసరికి. పైగా దాని అక్కలిద్దరూ యాభైలు దాటి ఉంటాయి కదా ఆమాత్రం జ్ఞానం వాళ్ళకయినా

ఉండక్ఖర్లేదూ. చిట్టెమ్మకి బుద్ధి చెప్పడం పోయి, మరింత పురెక్కించేరు చిన్నాన్నగారిని ఎలాగైనా ఒదిలించుకోమని. నన్నూ, రాజునీ పోరేరు మీకు మాత్రం ఆయన చెయ్యలేదా, మీకు మాత్రం బాధ్యత లేదా, మీధర్మం మీరు ఆచరించక్ఖర్లేదా ... అంటూ.

రామంతో ఆరోజుల్లోనే మాటాడేను. సావిత్రి, వరాలు నాతో రాజుతో చెప్పినవిషయాలు చెప్పేను. నువ్వక్కడ ఉండడం వాళ్ళకిష్టంలేదని వీలయినంత నాజుగ్గా చెప్పేను. అప్పుడే తొలిసారిగా తన మనసులో మాట చెప్పేడు సగం, సగమే అయినా ... చాలా విషయాలు మాటాడేడు, అమ్మసంగతులు, మామయ్యసంగతులు ... అవన్నీ ఇప్పుడెదుకంటే, "చెప్పనీ. మళ్ళీ ఈసంగతులు మాటాడను" అన్నాడు. మొత్తంమీద రామంమాటల్లో సారాంశం, చిట్టికమలకి తనంటే మాచెడ్డ అభిమానం. పురందరం అయితే ప్రాణాలివ్వడానికైనా సిద్ధం. తనకిక్కడే బావుంది. అలాటప్పుడు మరోచోటికి ఎందుకు వెళ్ళడం? తనకి ఇక్కడే, చిట్టికమలింట్లోనే బావుంది. అలాటప్పుడు ఇక్కడికీ అక్కడికీ ఎందుకు తిరగడం? అన్నాడు. వామనుడిలా - నాకు ఒరులు గారు, నేను ఒరలకు ఔదు - అన్నవాక్యం రామంవిషయంలా అక్షరాలా నిజం.

నాప్రాణం గిలగిల కొట్టుకుంది. అయ్యో, ఎంత అమాయకుడివి అని అరవాలనిపించింది. ఏడవాలనిపించింది. సావిత్రీ, వరాలూ నాటకం ఆడుతున్నారంటే రామం నమ్మలేదు. "ఎక్కడో ఉన్న రాజునా .. నేను నమ్మను" అన్నాడు. ఇంకేమిటి చెప్పడం. అప్పుడే వాళ్ళందరికీ ఓ మెయిలు పెట్టేను. నాకక్కడిసంగతులేమీ అర్థం కావడం లేదు. ఓ ఒక్కరూ పూర్తిగా నిజం చెప్పడంలేదు. అంచేత నన్నింక వదిలేయండి. నేనింక జోక్యం కలగజేసుకోనని. కలగజేసుకున్నా వాళ్ళు వినరు, ఎందుకొచ్చిన గొడవ అనిపించింది. అంతే.

పోయేముందు నాగురించి అడిగేడా, ఏమైనా చెప్పేడా అన్నది తెలీడం లేదు. అసలు నాగురించి అడగలేదేమో, అడిగితే ఎవరో ఒకరుచెప్పే ఉండేవాళ్ళు. మర్నాడు పోతాడనగా ముందురోజు బాగానే మాటాడేడుట. వంకాయబజ్జీ చేసి మెత్తగా అన్నం కలిపి పెడితే, ఎంతకాలం అయిందో ఇది తిని అంటూ తృప్తిగా తిన్నాడుట. మరి ఏం మాటాడేడు ... తెలీదు. తరవాత ... తెలీదు. నన్ను కాకపోతే మరెవరినైనా చూడాలని ఉందని అడిగేడా. అదేం లేదన్నాడు రాజు. మాట పడిపోయిందప్పటికే.

ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతోంది. కోపంతో తల పగిలిపోయేలా ఉంది. ఎప్పుడో ఎవరో పంపిన పుస్తకం తీసేను. గదినిండా ఆవరించుకున్న నిశ్శబ్దం చెవుల్లో హోరు పెడుతోంది. ఉలికిపడ్డాను. నిశ్శబ్దం ఇంత బలంగా నన్ను తనలో పొదువుకోడం చిన్నప్పుడు జరిగింది. ఆ నీరవగళం చెప్పిన కథలు ఎన్నో అక్షరగతం చేసేను. మళ్ళీ ఇవాళ అలాగే ఉంది. చీకటీ, నిశ్శబ్దం నాకెంతో ఇష్టంగా ఉన్నాయి.

గబుక్కున లేచి, కోటూ, బూటూ వేసుకుని బయటికి నడిచేను.

ఉత్తరపొలిమేరలనించీ తరలి వచ్చిన తెల్లటి పావురాళ్ళు గుంపుగా గట్టున కూర్చుని భవిష్యత్తు చర్చిస్తున్నట్టున్నాయి. శాంతి, శాంతి అని అరుస్తున్నాయి నిశ్శబ్దంగానే. వాటిని చూస్తుంటే మనసు తేలిక పడింది.

ఇంటికొచ్చి సోఫాలో తూలి పడ్డాను. కిటికీకవతల ముసురు. ఇవతల నిశ్శబ్దం. ఎదురుగా మల్లెమొక్క మరో రెండు గుడ్డిపువ్వులు పూసింది. గోడమీద కేలండరు 2012కి శలవు చెప్తోంది 31ని ఆర్భాటంగా ఎత్తి చూపుతూ.

కనురెప్పలు బరువుగా వాలిపోతున్నాయి …

(డిసెంబరు 31, 2012)

## 23. చేతనాకృతి

చేతనాకృతి

రానున్న తుఫానుకోసం ఎదురు చూస్తూ కిటికీ చట్రంలోంచి మీదిమీదికి తోసుకొస్తున్న కారుమేఘాల్ని చూస్తున్నాను పరీక్షగా. ఎడతెగని ఆలోచనలు … సాహిత్యకారులు అన్నపదంగురింరులు విన్లేదు. చి. ఇంతవరకూ విన్లేదు. స్వర్ణకారులు, కుంభకారులూ, చర్మకారులూలాటి పదాలు తెలుసు గానీ సాహిత్యకాఆంధ్రభారతిలో కూడా లేదు. స్వర్ణకారులు, కుంభకారులూ బంగారమో, మన్నో - ఏదో ఒక స్థూలపదార్థం తీసుకుని ఒక వస్తువు తయారుచేస్తారు. చరిత్రకారులు అన్నది స్థూలజగత్తులో జరిగిన ఘట్టాలు తీసుకుని చరిత్ర రూపురేఖలు తీర్చి దిద్దుతారు అన్నఅర్థంలో కాబోలు. సాహిత్యకారులు ఏం చేస్తారు చెప్మా! కవులనీ, కథకులనీ, "తయారు చేస్తార"నా, కుమ్మరి మట్టితో కుండలు చేసినట్టు? అంటే …

"ఏటలా సూత్తన్నవ్, దివాల్తీసినట్టు ముగెంపెట్టుక్కూసుని."

ఉలిక్కిపడి అటు చూసేను. సంద్రాలు! "రా, సంద్రాలూ, చాల్రోజులయింది కనిపించి. ఏంచేస్తున్నావేమిటి, ఎక్కడా కనిపించడంలేదు. ఏమైపోయేవు? …" గబగబ ఆబగా ఆత్రంగా ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించేను …

"చెప్పు, చెప్పు. ఎందుక్కనిపించలేదిన్నాళ్లూ."

"ఆగమ్మా, ఆగాగు. మా సెల్లెమ్మ బుడ్డోడికి అకస్మాతుగా లగ్గెంపెట్టీసినారంటె దేసంపెల్లిన. ఇంతకీ ఏటైనాదేటి?"

"ఏం లేదు … వీళ్లందర్నీ చూస్తే నాకు మహా చిరాకేస్తోంది."

"ఏటయిందో సెప్పకండ సిరాకంతె నానేటి సెప్పేది?"

"వీళ్ళంతా చదూకున్నాళ్ళూ, మూడో తొమ్మిదో యమ్మేలూ, యమ్మెస్సీలూ … చేసేసి, చైతన్యం, సాంస్కృతికం, అభ్యుదయం అంటూ కథలూ, కవిత్వాలూ, ఉపన్యాసాలూ ఊదరపెట్టేస్తున్నారు. మరి …"

"ఆగమ్మా తల్లీ. నానేటి నీనాగ యమ్మీలూ బియ్యేలూ, ఉలవలూ సదూకున్ననేటి, అనాగ చితనం, సంకారంవంటా ఓరెట్టేస్తే నాకేటి తెలస్ది. ఏటయిందో నిదానంగ సెప్పు."

"అది కాదు, సంద్రాలూ. ఈ కథలు రాసేవాళ్ళూ, వాళ్ళ కొమ్ము కాసేవాళ్ళూ నింగినీ నేలనీ నిలవకండ అదిరిపడుతున్నారు. నీకే గాదు నాకూ అయోమయంగానే ఉంది. మరి అభ్యుదయం అంటే ఎదటిమనిషిని గౌరవించడం కదా, అంటే వారిని నొప్పించకుండా మాటాడడం కాదూ? అదసలు కనీసధర్మం కదా."

"అద్గదో మల్లి అదే రగడ. అసలేటయినాదో సెప్పవమ్మా అంతె ఏదో శాస్త్రాలు చదుతన్నవు."

"… … ఏటీ కాలేదులే. నిన్న ఒకామె వచ్చేరు. చదువుకున్నారు, పండితురాలు. ఏదో కథలూ, కవిత్వాలూ రాసేరు, ఇంకా రాస్తున్నారు. మరి అలాటివారు కనిపిస్తే, వాళ్ళు చదివినవో రాసినవో మాటాడతారనుకుంటాం కద. మరేమో ఈ సాహిత్యమనుషులు తీరా ఎదురుపడి, నన్ను చూడగానే … మొదలెట్టేదేమిటో తెలుసా?"

"ఏటన్నరెటి?"

"ఒకటేమిటి, నానా చెత్తాను. చూడు వాళ్ళెట్టే కుక్కమార్కు రికార్డు …

-----

"ఒక్కరూ ఉన్నారా? అయ్యో పాపం. … అయ్యో రాతా, మీకెంత కష్టంవొచ్చిందీ. … అయితేనూ … ఆయనేమిటీ ఆయనే మిమ్మల్ని వొది… పిల్లల్నొదిలేసేర్ట. నిజంగానే? "నేన్చెప్పేస్లెండి… మీరసలాలాటివారు కాదని నాకు తెలీదూ …లాయరుతో మాటాడరాదూ. మాచెల్లెల్నిలాగే చేస్తే, ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువుల్నీళ్ళు … అవున్లెండి. ఎవరెలా పోతే మనకేల? ఇంతకీ ఇప్పుడాయనెక్కడున్నారు? … అహ, ఇప్పుడావూళ్ళో లేరా? …మీకు తెలీదూ? నిజంగానే? పిల్లల్నడగరాదూ … … అసలింతకీ ఏంచేస్తున్నారూ అని … ఆమధ్య అక్కడికొచ్చేర్ట గదా."

"ఆగమ్మా, ఆగాగు. తలా తోకా నేకండ ఏటా వొరస కుండపోతగ వొరసం గురిసిన్నాగ…"

"నేనంటున్నది కూడా అదే. అలా భోగినీదండకం చదివినట్టు గుక్క తిప్పుకోకుండా … బుచ్చమ్మింట మకాంట, రాజుగారింట మేజువాణిట వీరసాహిత్యకారులతో దేశాటనంట. వందలాది భక్తసంఘాల్ట. కాశ్మీరు శాలువల్ట. పట్టు పీతాంబరాల్ట. అందలాలెక్కించేర్ట, అబిషేకాల్చేయించేర్ట, … అంతేలెండి. మనకెందుకు … వేలాదిపాఠకులు సుడిగాలి చుట్టుముట్టినట్టేన్ట . వందలాది విమర్శకులు శ్లాఘించేర్ట వేనవేల నోళ్ళ ఆదిశేషుడిలా …"

"ఏటో నీగోల నీది. పోన్నె. ఆ రచీతలపేల్లు ఏ బగమంతునిపేరో అవుతే అదీ పున్నెంవే గంద. యెనక ఇస్నువోరు సెప్పినట్టు కోపాన, తాపాన ఎనాగ తల్సికున్న సాయిజ్జంవే."

"అంతేగాదు. మాఊర్రండి. మీక్కూడా శాలువలు కప్పుతాం, ఫొటోలు తీయిస్తాం. పత్రికల్లో రాయిస్తాం అంటారు."

"మరెల్లయితే."

"వెళ్ళేను రెండుసార్లు. ఒక్కళ్ళకీ నేనేం రాసేనో తెలీదు. ఏంచేస్తున్నానో తెలీదు. తెలుసుకోవాలన్న తాపత్రయం కూడా లేదు. ఉన్న తాపత్రయం అల్లా ఒక్కటే … ఆయనేం చేస్తున్నారని."

హిహీ అంది సంద్రాలు.

పళ్ళు కొరికేను నేను, "నీకు నవ్వులాటగానే ఉంటుంది."

"అదిగాదమ్మా. ముగం ముడ్సుకోమాక. నివ్ మాతరం తక్కవతిన్నవేటి?"

నేను జవాబు చెప్పేలోపున తారకం వచ్చేడు.

అతనివెనకే వస్తున్న పెద్దమనిషిని చూసి, గబుక్కున లేచి, "రండి, రండి" అంటూ ఇద్దరినీ ఆహ్వానించేను.

"మానాన్నగారండి. అనంతంగారు. మిమ్మల్ని కలుస్తానంటే తీసుకొచ్చేను."

"అనంతంగారా. పేరు పరిచయమే. మిమ్మల్నెప్పుడూ చూళ్ళేదు. అదేలెండి, ఇంతవరకూ."

అనంతంగారు ప్రతినమస్కారం చేసేరు, "నేను కూడా మీపేరు విన్నానులెండి,"

"ఏం విన్నారని అడగడం నాకు క్షేమం కాదనుకుంటాను."

అనంతంగారు చిన్నగా, అవునో కాదో తెలీనంత సన్నగా, తలూపేరు.

నేను ఇరుకున పడ్డాను తృటికాలం. తరవాత, "మీకథలు చదివి చాలాకాలమయింది. ఇప్పుడంతగా గుర్తు లేవు. ఈమధ్య కొత్తగా ఏమైనా రాసేరా?" అన్నాను.

"లేదమ్మా. నేను కూడా రాయడం చాలా తగ్గించేసేను."

"కూడా అంటారేమిటి?"

"అంటే మీవి కూడా అట్టే కనిపించడంలేదని."

"ఆహా. అయితే ఈనాటి సాహితీక్షేత్రం బాగానే గమనిస్తున్నారన్నమాట."

అనంతంగారు మాటాడలేదు.

నేను ఆలోచించి, "మీ అభిప్రాయం చెప్పండి ఈనాడు ఉత్పత్తి అవుతున్న సాహిత్యం గురించి."

"హా, ఉత్పత్తి అన్న ఒక్కపదంతోనే మీరు సమీకరించేసేరు మొత్తం సాహిత్యాన్ని."

"క్షమించాలి. దేశ, కాల పరిస్థితులనిబట్టి భాష కూడా మారిపోతుంది కదా. ఇక్కడ వ్యాపారపరమైన నుడికారం ఎక్కువ. అలా వచ్చేసింది."

"మీనోట ఎలా వచ్చినా, ఆపదం మాత్రం సరిగ్గా సరిపోతుంది. స్వర్ణకారులూ, కుంభకారులూలాగే, ఈనాటి సాహిత్యకారులు కూడాను. "

నేను నవ్వేసి ఊరుకున్నాను.

"వెనకటి రోజుల్లో గోచరమయే ప్రతిభ, వ్యుత్పత్తి, స్ఫూర్తీ కూడా ఇప్పుడు అదృశ్యమయిపోయేయి. పది కథలు చదివి ఓ కథ రాయొచ్చన్న భావం మంచిదే కానీ అదే ధ్యేయం కాకూడదు. ఆబగా రోజుకో పుస్తకం చదివేసి, వారానికో పరిచయం రాసేయగలరు ఒకరకం సాహిత్యకారులు. రెండోరకం సాహిత్యకారులు – తమకులం అనో, ఊరనో, పేరనో, పలుకుబడనో - ఏదో వంక, ఏమాత్రమో కళ్ళముందుకొచ్చినవాళ్ళని అందలాలెక్కించి, హారతులు పట్టి, శాలువలు కప్పి, పురస్కారాలు ప్రసాదించి, మహారచయితలని చేసి, పదిమంది చేత అవుననిపించగలవారు. కింగ్‌మేకరులలాగే సాహిత్యశేఖర"మేకరు"లు. ఇలాటివి తలపుకొస్తేనే నీరసం వచ్చేస్తుంది," అంటూ అనంతంగారు ఆగిపోయేరు.

నాక్కూడా ఏం మాటాడడానికీ తోచలేదు.

"మనస్సొచ్చిగా కతలు సెప్కొనేవోరు కతలు సెప్పుకుంతబోతరు ఎవురిన్నా యినకున్నా, అదీ ఓ యసనంవె," అంది సంద్రాలు.

"బాగా చెప్పేవమ్మా," అన్నారు అనంతంగారు.

"ఇప్పుడు వస్తున్నది సమకాలీనసాహిత్యం కదా. సమాజం మారుతుంటే, సమకాలీనసమస్యలని ఆవిష్కరించే కథలు కూడా దానికి తగ్గట్టే ఉంటాయి కదా. మార్పు తప్పదు కదా. అందులో ఆశ్చర్యం ఏముంది? వెనకటిసాహిత్యంలా ఉంటేనే సాహిత్యం అనడం ఏం న్యాయం?" అన్నాడు తారకం.

"సమస్యలు మారతాయి. అంటే వస్తువులో అది కూడా పైపొరల్లో మాత్రమే మార్పు ఉంటుంది. మౌలికమైన ఆలోచనల్లో అభిప్రాయాల్లో వచ్చే మార్పులు తక్కువే. అయినా మంచికా చెడుకా అని చూసుకోవాలి వాటికి అనుగుణంగా మనం మారిపోయేముందు."

"ఇప్పుడు సాహిత్యంలో వచ్చినమార్పుకి కారణం ఏమిటంటారు, అందువల్ల నష్టమే కలిగిందనుకుంటున్నారా మీరు?" అన్నాను నేను.

"సమాజంలో మార్పులు వస్తాయి. అవి మంచికా చెడుకా అన్నది నిర్ణయించడం కష్టం. అలాగే సాహిత్యంలోనూను. వెనకటిరోజుల్లో సాహిత్యం ఒకరకంగా ఉండడానికి కారణం ప్రధానంగా ఆరోజుల్లో చదువుకున్నవారు తక్కువ. ఆ చదివినచదువు కూడా వారికి అంతకుపూర్వంనించీ సంక్రమించింది మాత్రమే. అంటే పరిమితమే కదా. తరవాత ఇంగ్లీషు చదువులు వచ్చేక, కొంతవరకూ ఇంగ్లీషుప్రభుత్వమే మనకి ఇంగ్లీషు మప్పింది. మనకి అన్ని భక్తులలాగే రాజభక్తి కూడా ఎక్కువే కనక అదేమని ప్రశ్నించకుండా, మహా ప్రసాదమని  నెత్తిన పెట్టుకున్నాం. ఇంగ్లీషువాళ్ళ భావాలు అంది పుచ్చుకుని, అవే తెలుగులోకి దించేయడం జరిగింది. మన మేధావులందరూ మిగతావారందరికీ అదే బోధించేరు."

"మీరనేది విశ్వజనీనమయిన సాహిత్యాన్ని ఆహ్వానించడం తప్పంటారా? ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టుండిపోతాం. అదేనా మీరు కోరేది," అన్నాడు తారకం.

"లేదు. మార్పు కూడదని నేననడం లేదు. అనేక మతాలు రావడానికి అదే కదా మూలం. కాలానుగుణంగా మార్పులు చేర్చుకుంటూ, మతప్రవక్తలు కొత్త వ్యాఖ్యానాలు రాస్తూ, మతంలో చిన్న చిన్న మార్పులు చేస్తూ వస్తున్నారు. కానీ, మనం మరోసంస్కృతినించి భావాలూ, దృక్పథాలూ స్వీకరిస్తున్నపుడు, అవి మనసంస్కృతికి అనుకూలమవునా కాదా అని కూడా తరిచి చూసుకోవాలి."

"అట్టా సూసుకోపోతే, నివ్విందలక సెప్పినట్టు గోల్మాలయిపోతాది. నీకు చదూకున్నోరిమాట గూడ బుద్దీనంగ కనిపిస్తది," అంది సంద్రాలు.

నేను ఉలిక్కిపడ్డాను. "బుద్ధిహీనంగా అన్నానా నేను?" అన్నాను, అనంతంగారు ఏమనుకుంటారో అన్న పిరికితనం పొడుచుకురాగా.

"ఏమన్నారేమిటి?" అన్నాడు తారకం.

సూక్ష్మంగా చెప్పేను జరిగినసంగతి మళ్ళీ.

అనంతంగారు సంద్రాలువేపు చూస్తూ, "చురుకైన బుర్ర. బాగానే అర్థం చేసుకున్నావు," అన్నారు. తరవాత, నావేపూ, తారకంవేపూ చూస్తూ, "చూసేవా, ఆవిడకి తోచింది నీకు తోచలేదు. మనసమాజంలో జనాభా ఎక్కువ. ఉమ్మడికుటుంబాలు మన సంప్రదాయం. అసలు ఏ దేశంలో కానీ జనాభా, వాతావరణపరిస్థితులే ఆసమాజంలో సంస్కృతినీ, విలువల్నీ తీరిచి దిద్దుతాయి. మూడుతరాలజనం మూడుగదులఇంట్లో సర్దుకున్నప్పుడు, ఇంట్లో ఇంట్లోనే, ఆ నాలుగ్గోడలమధ్యే తగువులు పెట్టుకోడం, తీర్పులు చేసుకోడం కూడా జరిగిపోతుంది అట్టే ప్రయత్నం లేకుండానే. అత్తాకోడళ్ళూ, ఆలుమగలూ, తోటికోడళ్లూ, బావమరుదులూ, ఒకే చూరుకింద ఉంటారు కనక ఎప్పటికప్పుడు ఎక్కడికక్కడ మాటలు అనేసుకుంటారు, దులుపేసుకుపోతారు. అదే మనకి థెరపీ. అలా ప్రతివారూ ఎదటివారిబతుకుల్లో భాగం అయిపోతారు. వారి కష్టసుఖాలు వీరివి, వీరి కష్టసుఖాలు వారివీ అయిపోతాయి. అవే ఆత్మీయతలూ, అభిమానాలూ. మనకిప్పుడు అది అనవసరపు కుతూహలంలా అనిపిస్తోంది ఈ పాశ్చాత్యనాగరికత అందించిన ప్రైవేసిమూలంగా. అప్పట్లో ఇందాక మీరన్నట్టు ఎవరేనా మాటాడితే తప్పు పట్టే రోజులు కావవి. ఇప్పుడు ఓ పక్క ప్రగతిపేరుతో, నాగరికతపేరుతో గుట్టూ, మట్టూ అలవాటు చేసుకున్నాం. మరోపక్క నరనరాలా జీర్ణించుకుపోయిన ఈ "అభిమానాలు" వదిలించుకోలేకపోతున్నాం. అసలు మనం ఇలా చేస్తున్నాం అన్న స్పృహ కూడా ఉండదు చాలామందికి. నేనిలా అడక్కూడదు కానీ అంటూ మొదలుపెట్టేసి, మరీ సాగిస్తారిది. ప్రైవేసి అనబడు విద్య యింకా అందరికీ పట్టుబడలేదు. బహుశా మరో మూడు తరాలు పడుతుందేమో సమాజంలో అందరికీ అది అలవాటు కావడానికి. ఈలోపున ఇలా కొందరు ఆహుతి కాకతప్పదు ఈ అస్తవ్యస్తనాగరికతకి."

"అవుననుకోండి. మరి ఈ చదువుకున్నవారికి తెలియాలి కదా సంగతి."

"నివ్వు మాటిమాటికి సదుకున్నోరు, సదూకున్నోరంటవేటి. ఆరికేటీ తెల్దని తెలస్తనే ఉంది గద," అంది సంద్రాలు మొహం చికిలించి.

"ఈ చదువుకోడం కూడా చాలా మారిపోయింది. పూర్వం చదవడానికి అందుబాటులో ఉన్న సాహిత్యం కూడా పరిమితమే కదా. ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా, సాంకేతికపరంగా పుస్తకాలు ఆకాశంలో నక్షత్రాలన్ని దొరుకుతున్నాయి చదవడానికి. అవన్నీ చదివేయాలన్న ఉబలాటం కూడా పైస్థాయిలోనే ఉంది. అంచేత అందిన ప్రతిపుస్తకం గబగబ చదివేసి, సుమారుగా అందులో ఏముందో తెలిసేసిందనుకుని, మరోపుస్తకానికి తరలిపోతున్నారే కానీ, చదవడం ముగిసినతరవాత దాన్నిగురించి ఆలోచించడం మాత్రం తక్కువే. అంతగా

అయితే తమకి నచ్చిన అంశాలు ఓరెండు రాసి ఏ పత్రికలోనో ప్రచురించేస్తారు. ఒకానొకప్పుడు ఒక పుస్తకం చదివేనంటే ఆ పుస్తకం దాదాపు కంఠతా పట్టినంత శ్రద్ధగా చదివేవాళ్ళం. ఇప్పుడు అట్ట గుర్తుంటే గొప్ప! పోనీ, ఇది అతిశయోక్తే అనుకుందాం. కానీ ఎక్కువ పుస్తకాలు చదివితే ఎక్కువ తెలుస్తుందన్న ధోరణి మాత్రం మంచిది కాదు. కావలసింది ఆ పుస్తకంలోని భావాలు చక్కగా అవగాహన చేసుకోగలగడం, అవి మనకి ఎంతవరకూ ఆదరణీయం అన్నది సుదీర్ఘంగా ఆలోచించే వివేకం."

"చూడండి, ఆంగ్లసాహిత్యంమూలంగా మనం తెలుసుకున్నది ఎంతో ఉందంటే మానాన్నగారు ఒప్పుకోరు," అన్నాడు తారకం నావేపు తిరిగి.

"నేను చెప్పింది నీకు అర్థం కాలేదు. తెలుసుకునేదీ, తెలుసుకోవలసిందీ వేరు. అందులో మనకి ఏది పనికొస్తుంది, ఏది కేవలం మరొకజాతి సంప్రదాయం అని గ్రహించి పక్కన పెట్టుకోడం వేరు. లేకపోతే పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నచందం అవుతాయి మనబతుకులు. అవుతున్నాయి."

"పోన్లెండి. మనం ఏం చెయ్యలేం వీళ్ళని. మరేదైనా చెప్పండి. ఈమధ్య మీరు చదివిన ఓ పుస్తకంగురించి."

అనంతంగారు, "నేను ఈమధ్య ఏంచదవలేదు" అని, తను చదివినపుస్తకాలలో తనకి బాగా నచ్చిన ఒకపుస్తకంగురించి  చెప్పడం మొదలు పెట్టేరు. నేను కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాను. ఆ తరవాత మరో నాలుగు పుస్తకాలగురించి మాటాడేరు. వాటిలో ఒక్కటి కూడా నేను చదివింది లేదు. నాగస్వరం వింటున్న నాగుబాములా తలూపుతూ కూర్చున్నాను. ఆహా అనిపించిందాపూట. ఆయన చెప్పిందంతా నాకు అర్థం కాలేదు కనక ఇక్కడ రాయలేను. కానీ ఏదో వినదగినముక్కలు నాలుగు విన్న ఆనందం కలిగిందని మాత్రం చెప్పగలను. అవి దొరికితే నేను చదువుతాను. అప్పుడు బహుశా ఈయన చెప్పిన ఈసంగతుల్లో కొన్నైనా నాకు స్ఫురిస్తాయి. స్ఫురిస్తాయన్న నమ్మకం నాకుంది.

---

మొన్న వచ్చినావిడ మళ్ళీ పిలిస్తే ఏం మాటాడాలా అని ఆలోచిస్తున్నాను

- ఏముందిలెండి మాటాడ్డానికి. మీకెంతసేపూ అమ్మాయి పెళ్ళయిందా, నాన్నతో మాటాడుతుందా, ఆయనెక్కడున్నారు, ఏం చేస్తున్నారు. ఇవే కదా.

- అసలు ఒక మాటడుగుతాను చెప్పండి. మనం కలిసిన ప్రతిసారీ మీరు ఈమాటే తెస్తారు నేను ఆవగింజంతైనా  ఆసక్తి చూపకపోయినా. దానివల్ల మీరు పొందే ఆనందం ఏమిటి?

- నేను రాసినవేమీ చదివినట్టు లేదు. మీకు నచ్చలేదు కాబోలు. పోనీండి. నేను రచయితని కాననుకున్నప్పుడు నన్ను పిలవడం, కలవడం మాత్రం ఎందుకూ? జాలిచేతనా? తమాషా చూద్దాం అనా?

- నేనెలా ఉంటానో, ఏం మాటాడతానో అన్న కుతూహలమా?

- అయ్యో నాబతుకిలా అయిపోయింది అని నేనెడిస్తే చూడాలనా?

-----

ఫోను మోగింది. ఫోనుతీసి ఐడి చూసేను. ఆవిడే.

మరో రెండు రింగులు మోగి ఆగిపోయింది ఫోను. కిటికీవేపు చూసేను. చిన్న తుంపరలు మొదలయేయి.

“సిరాకు ఫోనాదా?”

మళ్లీ ఉలిక్కి పడ్డాను. “ఏంటి, వాళ్ళతోటే నువ్వూ వెళ్ళిపోయేవనుకున్నాను. ఇంకా ఇక్కడే ఉన్నావా?” అన్నాను నిరామయంగా.

“ఎల్నేదు. నివ్విప్పుడు ఏడస్త కూకుంటవేమొనని.”

“లేదులే. ఏడవడం లేదు. నేనలా ఏడవలేదనే ఆయమ్మ బాదేమో ...”

“ఇందాకతల ఆబాటు సెప్పినారు గంద. ఈలలో సానామందికి ఏటి మాటాన్ను తెల్దు. అందుసేత అల మల్ల మల్ల అదే పెస్న అడగతరు. కొందురికి రాతలొస్తయి గానీ ఊసుల్ తెలవ్వు. నివ్వంటె ఇట్టంగన్కనె వస్తరు, ఆయెన్క ఏం సెప్పాలో తెల్దు. నీకెందుకా గోల. ఆరినాగే నివ్వూ దులుపేసుకు పో, సరిపోతాది.”

“నీకేం, నువ్వలాగే చెప్తావు. నాకు మాత్రం విని, విని ప్రాణం కడగట్టిపోతోంది. “

“అయ్న నివ్ మాతరం తక్కవ తిన్నవేటి?”

“అదేమిటి అలా అంటావు, గంటన్నరసేపు నోరు మూసుక్కూచున్నాను హరికత వింటున్నట్టు.”

“మరి చిగురంటా యిని. చివర్నెటి సేసినవ్ టపాస్కాయ టప్మని పేల్సినట్టు అన్నవు గంద.”

“ఏంటి, నేనేం అన్నాను?”

“అదె సెప్పినవ్ గంద. నేనిందులకే సబలకెల్లనని. మరి ఆయమ్మ మొగం మాడిపోనేదా?”

అవును, సభలగురించి మాటాడుతుంటే, అన్నాను నేను సభలకిందుకే వెళ్ళనని. ఆవిడకూతురివేపు తిరిగి అన్నాను.

“హీహీ. అంతినయంగ సెప్పినవ్వేటి? ఏటి మాటాడవ్, ఎరికయినద నేనెటంటన్ననో.”

మ్ మ్. ఏమన్నానో జ్ఞాపకం రావడం లేదు.

“ఉప్పుడె గంద నాకు సెప్పినవు. ఆయమ్మ బాబుగోరికబురేదో సెప్తావుండేటేల నివ్వేమో తుపుక్కున ఇందికే నాను సబలకెల్లనంటివి. ఆడ ఇసమంటి మాటలిని తల బొప్పి కట్టేసినాదంటివి.”

అవును, నేను సభలకెందుకు వెళ్ళనన్నసంగతి అంతకుముందు మాటాడుకున్నాం కనక చెప్పేను.

“అంతెదనిక ఆగినవ? నేదు. ఆ పెద్దమ్మయెంక సెయ్యి సూపతా మరీ సెప్పినవ్. మల్ల నాను సబలకెల్లీది ఇసుమంటి ఊసులకా అంటివి. మరి ఆయమ్మకేటనిపిస్తదని నీకేటయిన తోసిందా?”

“హా!! తోసనేదు. నీకేల తోసిందట్ట.”

“ఏటి నన్నెకసక్కెలాడ్తన్నవు. ఉన్నమాట సెప్తే ఉలుకెక్కవంతరిందికే.”

“లేదు, లేదు, సంద్రాలూ, లేదు. నిన్ను వెక్కిరించడంలేదు. ఎందుకో అలా వచ్చేసింది. మరేదో గుర్తొచ్చింది. మరోలోకంలోకి వెళ్ళిపోయేను.”

“ఏటది? ఏటానోకం?”

“అదే, నాచిన్నతనంలో తొలిసారి నిన్ను చూసినప్పుడడిగేను, ఏ బళ్ళో చదివేవు, చెప్పు, నేనూ అక్కడే చదువుకుంటానని. మళ్ళీ ఇప్పుడు అలాగే అనిపిస్తోంది.”

“సూడు తల్లీ. అందురు మాటాడేతప్పుడూ ఎక్కవ తక్కవలొస్తయి. ఒకొప్పుడు తప్పూ, నొప్పీని, మరోతప్పుడు ఒప్పువుతాది. నామాటినుకో. నివ్వీల బుర్రవొంకరలు తీరసనేవు. తెల్సినాదా?”

తెలిసింది.

(మే 26, 2013)